


ఉగాది ప్రత్యేక సంచిక నన్నెంతో ఆకర్షించింది. ఈ సంచికలోని కథలన్నింటిలోనూ శ్రీమతి ముప్పాళ రంగనాయకమ్మగారు రచించిన 'సరికొత్త మనుషులు' అనే కథ ఆణిముత్యం లాంటిది.

సాహితీ రంగంలో శ్రీమతి ముప్పాళ రంగనాయకమ్మ గారి కథలకు ఒక ప్రత్యేకత ఉంది. వా రే కథ వ్రాసినా విప్లవాత్మకమైన కొత్తదనం తొంగిచూస్తూంది.

ఏదైనా తనదాకా వస్తేనే కానీ దానిలోని బాగోగులు తెలియవని ఈ కథ నిరూపిస్తుంది. పన్నెండు రోజుల సంసార జీవితానంతరం తన భార్య ఒక పతిత, గర్భవతి అని తెలుసుకొన్న ప్రతి వ్యక్తి ఈ కథలోని రాజారావు కేమీ తీసిపోడని నా అభిప్రాయం. డాక్టరు రఘునాధ్ ఎంత నీతివాక్యాలు వల్లించినా తన భార్య గత చరిత్రను చెప్పేటప్పుడు రాజారావుకు చెప్పిన ధైర్యాన్ని తన విషయంలో కోల్పోతాడు. ఒక రోజు విరహానంతరం తన భార్య చేసిన తప్పును క్షమించి, ఆమెకు పుట్టే బిడ్డను తన బిడ్డగానే భావిస్తానన్న రాజారావుని అభినందించకుండా ఉండలేక పోతున్నాను. ఏమైనా ఈ కథ లోని రాజారావు, డాక్టరు రఘునాథ్ లాంటి వాళ్ళు నిజజీవితంలో ఉన్నారా? ఉంటారా? ఉండరేమో!

—క్రొవ్విడి రాయుడు (ధవళేశ్వరం)

• • •

ఆంధ్రప్రభ ఉగాది ప్రత్యేక సంచిక నూతన శోభలతో (అతిశయోక్తిగా భావించకండి) ప్రతి శీర్షిక ఒక ప్రభ వలె వెలుగొందుతూ, దేని కదే సాటిగా, ఒక దానితో ఒకటి పోటీ పడుచూ వెలువడి మమ్మల్ని అలరించింది.

శ్రీ శిల్పి గారు వేసిన ఆ చల్లని తల్లి శ్రీ కనక దుర్గమ్మవారి దివ్య స్వరూప చిత్రమును గాంచినంతనే భక్తిభావము ఇనుమడింపజేసింది. తన్మయత్వంతో తెలియకుండానే నా మనస్సులో నమస్సు లర్పించాను.

శ్రీ బాపు గారి ముఖచిత్రం ఉగాది శుభసూచకంగా, నూతనత్వంతో ముచ్చటగా, చక్కగా ఉంది.

విశ్వంగారు వ్రాసిన బాంగ్లాదేశ్‌పై సచిత్ర వ్యాసం చదువుతూంటే గుండెల్లో బల్లెపు పోటులు పొడిచినంత బాధ కలిగింది. కన్నీళ్ళు అనుకోకుండా కారాయి మళ్ళీ. అబ్బా! మన బాంగ్లా సోదరులు ఎన్ని బాధలు పడ్డారో గదా! ఆ భగవంతుని దయవల్ల ధర్మం జయించింది. వారు స్వతంత్ర పాలన అనుభవిస్తున్నారు.

—బొర్రా పాండురంగశాస్త్రి (విజయవాడ)

• • •

మీ 'సంపాదకీయం'లో 'పెరుగుట పెరుగుట కొరకా?' అన్నారే—నేడు వింటున్న రవాణాభార్జీలు, శిరసవాయిలు, చక్కెరధరలు పెరుగుటలో, పెరుగుట పెరుగుట కొరకు అనవలసి వస్తుంది. చెప్పినది, 'పేదతనం పో' జరుగుచున్నది 'పేదలు పొండి', 'మృత్యువు నీడన' కథ ఆకలి అడ్డమైన పనులు చేయిస్తుందని. 'కడుపు తీపి' తల్లీబిడ్డల ప్రేమానుబంధాలను తెలుపుతున్నాయి.

పి. ఆగాచార్యగారి చిత్రాలు కొత్తపోకడలతో ప్రభకు అలంకారాలు. 'వింతలు—విడ్డూరాలు'లో వీర వనితల విషాద కథనాలు చదువుతూంటే ఇలా జరిగిందా అని ఎటువంటి వారికి అయినా మనసు విచలితమవుతుంది.

—కె. నారాయణ (సిరిసిల్ల)

• •

ప్రతి రోజు నేను మనసులో పడే బాధను మీరు 'సంపాదకీయం'లో వెలిబుచ్చారు. మీ రన్నట్లు "పేదలను తొలగిస్తారా, లేక పేదతనం తొలగిస్తారా" అనిపిస్తుంది.

—శ్రీమతి టి. ధనలక్ష్మి (తాడేపల్లిగూడెం)

అతివేగంతో పరిభ్రమించే ఈ జీవనస్రవంతిలో అనంత మానవకోటి కష్టించే ప్రతి పనీ జానెడు పొట్ట కోసమే! కోటి విద్యలూ కూటి కొరకే! ఆ పోరాటంలో స్వార్థచింతనకూడా లేకుండా పోలేదు. 'మృత్యువు నీడన' కథ మా కెంతో నచ్చినది.

'రేపటి వెలుగు' కొరకు ఈ నాటి ఈ చీకటిని సంతోషంతో అనుభవిస్తూన్న శారద తాను చేసే ప్రతి పనినీ చెడ్డగా విమర్శిస్తూ డిటెక్టివ్‌లా క్రాస్ ఎగ్జామిన్‌తో, తల్లి వేసే ప్రశ్నలకు ఎంతో సహనంతో సౌమ్యంగా జవాబులిచ్చే ఆమె మనస్తత్వం ఎంతైనా మెచ్చుకోతగినది.

—కోటగిరి భారతి (చింతలపూడి)

• • •

## మనవి

భారత రక్షణ నిధికి విరివిగా విరాళాలను పంపవలసిందిగా మా పాఠకులను అభ్యర్థిస్తున్నాము.

పరీధావి ఉగాది ప్రత్యేక సంచికలో శ్రీ పాలగుమ్మి పద్మరాజుగారి వ్యాసం 'కూచిపూడి ఆర్ట్సు అకాడెమీ' చదివి ఎంతో ఆనందించాము. శ్రీ వెంపటి చిన్నసత్యం గారి గురించి ఎంతయినా వ్రాయవచ్చు. కేంద్ర రాజధానిలో శ్రీ చినసత్యంగారి శిష్యురాలు కుమారి శోభానాయుడు కూచిపూడి నృత్యప్రదర్శనలు ఎంతో ఖ్యాతిని గడించుకున్నాయి.

నేడు కూచిపూడి నృత్యకళని అనేకమంది అభ్యసిస్తున్నారు. ఈ నాట్యాచార్యులంతా కలిసి అప్పుడప్పుడు సమావేశమౌతూ, కూచిపూడి నృత్యకళకి కొత్త శోభ చేకూర్చాలి. అందుకు తెలుగుదేశ ప్రభుత్వం నడుం బిగించి, ఆర్థిక సహాయంతో ముందుకు రావాలి. కూచిపూడి నృత్యకళని, సంప్రదాయం చెడకుండా, నూతన సాంకేతిక యుగంలో ముందుకు తీసుకు వెళ్ళాలి.

ఇటువంటి వ్యాసం అందజేసిన శ్రీ పద్మరాజుగారికీ ప్రచురించిన మీకు నా అభినందనలు.

—కూచి సూర్యనారాయణ (న్యూఢిల్లీ)

• • •

ఈ వారం (29—3—72) ప్రభలోని కథలు అంత బాగా లేవు. కాని విద్వాన్ విశ్వంగారి 'బాంగ్లాదేశ్' వ్యాసాలు చదువుతుంటే ఒడలు జలదరిస్తూ ఉన్నాయి. ఇంకా ఎంతో తెలుసుకోవాలని ఆత్రతగా ఉన్నది.

హాలం యొక్క 'ముఖచిత్రం' ప్రభకు అందం చేకూర్చకపోవటమే కాక అసభ్యంగా ఉన్నది.

—ఇ. విశాల (హన్మకొండ)

• • •

'మృత్యువు నీడన' కథ చదివాక ఆ కథలోని ప్రత్యేకత, కొత్తదనం, మరపురాని చక్కని కథాసంవిధానం ప్రశంసనీయం. మళ్ళీ ఇక 'కడుపు తీపి' చదివాక గుండె బరువౌతుంది. ఇక 'మృత్యువునీడన'లోని రెండవ వరసలో రెండవ పేరాలో వ్రాసిన మాటలు నిజాన్ని నిలబెడతాయి. బ్రతికున్న మనిషికి రెండు పైసలు విలువ కట్టలేని సమాజం, చచ్చినవాడి కోసం రెండు రూపాయలైనా దానం చేయడానికి వెనుకాడరు కొందరు. చచ్చిపోయిన శవాలమీద వ్యాపారం చేద్దామని పార్టనర్స్ ఏర్పాటు చేసుకొని బ్రతగ్గా, చివరకు అతడు చనిపోగా మిగతా ముగ్గురు పార్టనర్స్ వద్ద అంత డబ్బున్నా వారి అలవాట ప్రకారం చివరికి పైడయ్య మీద రూపాయలు రాల్చుకుంటారా మిత్రులు. ఇదే దీనివల్ల మనుషుల స్వార్థం స్పష్టంగా తెలిసినా అతడు ఎలా, ఎందుకు చచ్చిపోయాడు అన్నది అర్థాంతరంగా వదిలేశారు రచయిత.

—డి. శేషాద్రి (బొంబాయి—25)

• • •

'కడుపు తీపి' ('మంజుశ్రీ' గారి కథానిక) చాలా బాగుంది. తన కన్నబిడ్డల కోసం తన నిండు ప్రాణాలు అర్పించిన ఆ స్త్రీ ధన్యమూర్తి. కథ చక్కని శైలిలో మా మనస్సును దోచుకుంది.

—ఎ. జయరాములు (లచ్చపేట)

• • •

ఈ వారం రెండు కథలూ రెండు మణులే.

'మృత్యువు నీడన' కథలో పైడయ్య తాను చేసుకున్న గోతిలో తానే పడె. 'కడుపు తీపి'లో ఓవర్సీ భార్యకు పుణ్యానికి పోతే పాపం ఎదురయ్యె!'

విశ్వంగారి 'బాంగ్లాదేశ్' చాల కుతూహలాన్ని రేపె. 'వింతలు—విడ్డూరాలు' నిజంగా వింతలే.

—చిటవరం వేణుగోపాలస్వామి (హుజూరాబాద్)

• • •

'హైదరాబాదు లేఖ', 'శ్రీరామనవమి' వ్యాసాలు ఆకర్షణీయంగా ఉన్నాయి. 'కడుపు తీపి' కథానిక ప్రేమమూర్తి స్వరూపం ప్రత్యక్షంగా బిడ్డల తల్లిగా ఇల్లాలి ఆవేదన చక్కగా వివరించారు. ఆంధ్రుల కళాఖండం లేపాక్షి చిత్రము 'దుర్గా నాగేశ్వరాలయం'నిరుపమానమై శిల్పరామణీయకత చిత్రణలో స్వయంగా చూస్తున్నామా అన్న భ్రాంతి కలిగిస్తుంది. సీరియల్ 'అన్వేషి'లో 'కస్తూరి', అపర్ణ ఊహలకందని మనస్తత్త్వములచిత్రణ

(తరువాయి 63 వ పేజీలో)



సాలుచందా: స్థానికంగా రు. 26-00 — పోష్టుద్వారా రు. 31-20
సంపుటి 20 — సంచిక 34 = 72 పేజీలు 50 పైసలు




**12-4-72**

## విషయసూచిక


| | |
|---|---|
| **సంపాదకీయం** | 3 |
| **వింతలు - విడ్డూరాలు** | 5 |
| వారఫలాలు | 6 |
| బాంగ్లాదేశ్ | 17 |
| చిత్రాలలో లేపాక్షి | 36-37 |
| ప్రమదావనం | 41 |
| చిత్రప్రభ | 48 |
| జంతర్ మంతర్ | 54 |
| నటరత్నాలు | 54 |
| మార్గదర్శులు | 55 |
| ఉగాది ఉత్సవాలు | 57 |
| బాలప్రభ | 59 |
| హైదరాబాదు లేఖ | 60 |
| కొత్త పుస్తకాలు | 71 |

### నాటకం

| | |
|---|---|
| ఆజ్ఞ | 8 |

### సీరియల్స్

| | |
|---|---|
| అన్వేషి | 23 |
| రేపటి వెలుగు | 64 |

### కథలు

| | |
|---|---|
| ఈ కన్నీటికి అర్థం తెలుసా? | 33 |


ముఖచిత్రం:
భారతి

## బాంగ్లాదేశ్ క్రియాశీలం

స్వేచ్ఛా స్వాతంత్ర్య సముపార్జనం చేసుకున్న బాంగ్లాదేశ్ చకచకా పునర్నిర్మాణ కార్యక్రమాన్ని కొనసాగించుకొనడంలో నిమగ్నం కావడం శుభసూచన.

భారతదేశంతో చేసుకున్న స్నేహ సంధికి అనుగుణంగా వందకోట్ల రూపాయల వాణిజ్య ఒప్పందం చేసుకొనడం ఎంతైనా కొనియాడవలసిన అంశమే.

పొలిమేరలలోని ఇరు దేశాల జనం కొన్ని వస్తువుల వినిమయాదులు, క్రయ విక్రయాదులు సుంకాలతో నిమిత్తం లేకుండా జరుపుకునే వీలు కల్పించడం అభినందనార్హం.

అలాంటిది లేనినాడు ఎలాగూ దాని నాపడం సాధ్యం కాదు గనుక, చాటుమాటున అలాంటి లావాదేవీలకు ఆస్కారం ఏర్పడేది. అది ఉభయులకూ శ్రేయస్కరం కాదు.

అలాగే వారికి కావలసిన పొగాకు, సిమెంటు, బొగ్గు, నూలు, యంత్ర సామగ్రి మనం ఎగుమతి చేసుకొనడం; వారికున్న చేపలు, ముడి జనుము, న్యూస్ ప్రింటు, నాఫ్తా వగైరాలు వారు మన దేశానికి ఎగుమతి చేయడం మూలంగా రెండు దేశాల మధ్యా నేడు ఏర్పడిఉన్న అనుబంధాన్ని మరింత బలవత్తరం చేయగలదు.

అలాగే స్వతంత్ర సంగ్రామ సమయంలో వంగ ప్రజానీకాన్ని నానా ఇడుముల పాలుజేసిన పాక్ కిరాతక సైన్యాలతో చేతులు కలిపి దేశ ద్రోహం నెఱపిన విరుద్ధ శక్తులను తుదముట్టించవలసిన బృహత్తర సమస్య నేడు బాంగ్లాదేశ్ ప్రభుత్వాన్ని ఎదుర్కొంటున్నది.

అలాంటి విద్రోహులను విచారణ జరిపి రుజువయిన చోట్ల తగిన శిక్షలు విధించడానికై షేక్ ముజీబ్ ప్రభుత్వం 73 ప్రత్యేక న్యాయస్థానాలను నియమించడం కడు శ్లాఘనీయం.

ఆ విద్రోహులు చేసిన దారుణాలకు అంతూ పొంతూ లేదు. వారి విచారణ అతి త్వరగా జరిగిపోవడం అక్కడి ప్రజల ఆగ్రహావేశాలను అదుపులో పెట్టగలదు.

ఏమైనా అనేక జటిల సమస్యలు నూతన బాంగ్లాదేశ్ ప్రభుత్వం అతి శీఘ్రంగా, అతి జాగరూకతతో, అతి చాకచక్యంగా పరిష్కరించుకుంటూ పోవడమొక్కటే ఆ దేశ సమృద్ధికీ, సౌభాగ్యానికీ, సమతా సమాజ స్థాపనకూ రాచబాట కాగలదు.

ఆ బాట అతి త్వరగా ఏర్పడి వారి భవిష్యత్తు బంగారు పండించుకో గలదని ఆశిస్తున్నాము.



# ఏటేటా వచ్చే దురద

## దానికి నివారణ ఏమిటి?



చెమటకాయలతో దురద, దురదని ఎంతో చికాకు పరచాయి. గోకితే చర్మము పొరలు లేచి అవశ్యముగా ఉంటుంది. జాన్సన్స్ ప్రిక్లీ హీట్ సబ్బు మరియు ప్రిక్లీ హీట్ పౌడరు ఎండ వేడితో చెమట కాయలు రాకుండా త్వరగా రక్షణ కలిగిస్తాయి అవి రెండూ చెమటకాయలనుండి రక్షణ ఇవ్వటమే కాదు లభిస్తున్న తయారులలో ఎంతో పేరైనవి. సబ్బులు, ఔషధములు చేసిన జాన్సన్స్



ప్రిక్లీ హీట్ సబ్బుతో స్నానము చేయండి. అది మూసిన చర్మ రంధ్రములకు ఉపశమనము కలిగించి, అంటురోగములను పోగొట్టును.

తరువాత, చెమ్మను పీల్చి చర్మమునకు హాయిని కలిగించే జాన్సన్స్ ప్రిక్లీ హీట్ పౌడరును ఒంటిమీద చల్లుకోండి. దానిలో చెమటకాయలనుండి రక్షణనిచ్చే ఒక ప్రత్యేక మైన యాంటిసెప్టిక్ పదార్థముంది. దానితో వెంటనే గుణము కనిపిస్తుంది. చెమటకాయల బాధనుండి తప్పించుకొనే పద్ధతి ఇదే.



**జాన్సన్స్***
**ప్రిక్లీ హీట్**
**పౌడరు మరియు**




JJ.3420

# వింతలు విడ్డూరాలు




కొత్త కొత్త నాయకులు మంత్రులు కావడం వల్ల ఒక చిక్కు ఉన్నది. ఎవరు మంత్రులో గుర్తు పట్టడం కష్టం. కేంద్రమంత్రి శ్రీ బహుగుణ ఆ మధ్య ఆఫీసుకు రాగానే ఒక ట్రంక్ ఫోన్ వచ్చింది. అది పాట్నానుండి వచ్చింది. అవతలి గొంతుక "నేను ముఖ్యమంత్రి కేదార్ పాండేను. నాకో చిన్న సాయం కావాలి" అని అరిచింది. అదృష్టవశాత్తు బహుగుణకు పాండే గొంతు పరిచయం ఉన్నది. ఆయన వెంటనే ఆ అశరీరవాణితో అన్నాడు "అయ్యా, తమరెవరో నాకు తెలియదు. మీరు పాండేమాత్రం కాదు" అని అంటుండగానే, అవతలి వ్యక్తి టప్‌న ఫోన్ పెట్టేశాడట. "నేను ఫలానా మంత్రిని" అంటూ ఎవరైనా ఫోన్ చేయవచ్చుగా. ఎదురుగా వచ్చిన ఆయన ఫలానా అని చెప్పుకుంటేగాని తెలియ దిప్పుడు.

## కండక్టరు లేని బస్సులు

నిజమే, కొన్ని బస్సులలో కండక్టర్లు అవసరం లేదనిపిస్తుంది. దూరప్రయాణాలు చేసే బస్సులు ఎక్కడా ఆగవు. ఆగినా, మధ్య పాసింజర్లను ఎక్కించుకోవు. అట్లాంటప్పుడు ఎక్స్‌ప్రెస్ బస్సులలో కండక్టర్ల అవసరం కనిపించదు. తమిళనాడు ట్రాన్స్‌పోర్టువారు కండక్టర్ లేకుండా కొన్ని బస్సులను నడపడానికి నిశ్చయించుకున్నారు.

విమానాలలోవలె అందమైన ఆడపిల్లల్ని ఎక్స్‌ప్రెస్ బస్సులలో కండక్టర్లుగా నియమిస్తే బాగుండుననే ఆలోచనకూడా లేకపోలేదట.

## నో ప్లీజ్

గుజరాత్ ముఖ్యమంత్రి ఘనశ్యామ్ ఓజా ఈ మధ్య ఒక గమ్మత్తు చేశారు. ఆయన ముఖ్యమంత్రి అయిన తరవాత సురేంద్రనగర్ వెళ్లాడు—తన తండ్రిని చూడడానికి. ఆయన తండ్రి 86 ఏండ్ల వృద్ధుడు. ఆ సందర్భంలో వాణిజ్యమండలివారు ఘనంగా సన్మానించడానికి ఏర్పాట్లు చేశారు. కానీ ఆయన సన్మానం అంగీకరించలేదు. "నేను ప్రజలకు ఏమీ చేయలేదు—" ముఖ్యంగా పేదప్రజలకు నేను చేసిన సేవ ఏమీ లేదు. కనక నేను సన్మానానికి అనర్హుణ్ణి" అన్నారు.

మంత్రి అయితే చాలు, ఊరూరా ఊరేగి సన్మానాలు పొందాలని ఉబలాటపడే వారికి ఆయన చక్కని పాఠం నేర్పారు.

## దుష్ట న్యాయవాది

ఈ మధ్య లెనిన్ అనే న్యాయవాదికి మద్రాసులో రెండేళ్ల కఠిన కారాగారవాసశిక్ష పడ్డది. లెవి వెంకటరంగంశెట్టి కేసులో న్యాయవాది. వారు కోర్టులో 50 వేలు డిపాజిట్ చేశారట. కొంత కాలానికి సివిల్ కోర్టులో ఉన్న డబ్బు హైకోర్టుకు మార్చాలని చెప్పి, ఆ డబ్బు కోర్టునుండి తీసుకుని, తన పేర బాంకులో వేసుకుని స్వాహా చేస్తూ వచ్చాడు. వెంకటరంగంశెట్టి చనిపోయి, ఆయన కొడుకుల హయాంలో రహస్యం బయటపడ్డది. నందగోపాల్ అని వెంకటరంగం కుమారుడు పోలీసులకు ఫిర్యాదుచేయగా, లెనిన్ మహాశయుడు పట్టుబడ్డాడట.

## భారత ప్రాశస్త్యం

మహాభారత, రామాయణ కథలకు మన దేశంలో కాదు, విదేశాలలో ప్రాముఖ్యం ఉంది. భారతం సంగ్రహ గ్రంథం రష్యన్ భాషలోనికి అనువదించి ప్రచురించినప్పుడు ఒక్క రోజులో 30 వేల పుస్తకాలు అమ్ముడు పోయాయట. ఇప్పుడు అమెరికాలో రాజాజీ రామాయణ, భారతాలు లక్షల కాపీలు అమ్ముడు పోతున్నాయి. రష్యాభాషల్లోకి ఏటా 20 భారతీయ గ్రంథాలు అనువదించబడుతుంటం. రష్యాలోని 25 ప్రాంతీయ భాషలలో వాటిని ప్రచురిస్తారు. వాటిలో తెలుగు పుస్తకాలు ఎన్ని ఉన్నాయో అని ఆలోచించకండి. తెలుగు రచయితల గురించి భారతదేశంలోని ఇతర ప్రాంతాలలోనే చాలామందికి తెలియదు.

## ప్లాస్టిక్ పాప

కనుగుడ్డులో చెడిపోయిన కంటిపాపకు బదులుగా ఉపయోగపడే కృత్రిమప్పటికాన్ని రష్యాలో కనిపెట్టారు. ఈ కటకం 5 మిల్లిమీటర్ల వ్యాసం కలిగి, ఒక మిల్లిమీటర్ మందంగా ఉంటుంది. కంటికుక్కల వల్ల, కాల్పులవల్ల, రేడియేషన్ వల్ల చూపు పోయిన వారికి ఈ కృత్రిమ పాపవల్ల చూపు వస్తుంది. దీనిని కనుగుడ్డులో అమర్చడం చాలా తేలిక.

## ఫోన్ జోస్యం

బర్మింగ్‌హామ్ పోస్టాఫీసువారు 'అదృష్టఫలాలు' చెబుతున్నారట. మారిస్ వూడ్రఫ్ అఫ్ జ్యోతిష్కుడు సాయంత్రం 6 నుండి ఉదయం 8 వరకు ఫోన్‌లోనే ఫలితాలు చెబుతాడు. టెలిఫోన్‌లు ఉన్న వాళ్లంతా అడగవచ్చు. ప్రతిఫలం, ఒక ఫోన్‌కాల్ ఖరీదు. పుట్టిన రోజు ఫలితాలు ప్రత్యేకం. ఈ సౌకర్యం 4 లక్షల మందికి ఉంటుంది. ఈ పద్ధతి బాగుంటే మిగతా అన్ని నగరాలలోనూ 'ఫోన్‌జ్యోతిషం' ప్రారంభిస్తారట.

## కాగితం నుండి కొయ్య

కొయ్యనుండి కాగితం చేస్తారు గానీ కాగితంతో కొయ్యను చేయడం ఏమిటి అంటారా! అమెరికాలో చిత్తుకాగితంతో కొయ్య తయారు చేయడం, చెత్తచెదారంనుండి కాగితం తయారు చేయడం జరగబోతున్నది. చినిగిన, పాతపత్రికలు, ప్లాస్టిక్ వస్తువులు కలిపిన మిశ్రమాన్ని ఉడకపెట్టి ఎక్కువ ఒత్తిడితో చెక్కగా మార్చబోతున్నారు. అంటే, కేవలం చెట్ల నుండే కాకుండా ఇలా కాగితం నుండి చెక్క తయారు కావడంవల్ల వృక్షసంపద నశించదు. అలాగే పనికిరాని చెత్తనుండి మంచి ముద్రణ కాగితాన్ని తయారు చేస్తున్నారు.

—శార్వరి

## మేషం

[అశ్వ., భర., కృత్తి 1 పా.]

ధన నష్టం, అనారోగ్యం, ఆవేశం ప్రాప్తించే కాలంగా ఉంది. అధికారుల వలని అనాదరణ ప్రాప్తించవచ్చు. సంసారసుఖం ఉంటుంది. బంధుమూలక దుఃఖం, మిత్రులవలన మోసం పొందవచ్చు. కార్యాలను శ్రమపడి సాధించగలుగుతారు గాని, ఆ సాధన వ్యయంతో కూడి ఉంటుంది. శత్రుబాధ ఎక్కువగా ఉంటుంది. ఉద్యోగస్థులు జాగ్రత్తగా వ్యవహరించాలి. రాజకీయ వాదులకు శుభకాలంగా ఉంటుంది. వ్యాపారస్థులకు లాభకరం. స్త్రీలకు కుటుంబసౌఖ్యం, బహుమాన ప్రాప్తి, ధనలాభం సూచకాలు. 18 వ తేది శుభకాలం.

## వృషభం

[కృత్తి. 2,3,4 పా., రోహి., మృగ 1,2 పా.]

వారం ప్రారంభంలో ఉన్న ఉత్సాహం క్రమంగా తగ్గుతుంది. అధికారుల ఒత్తిడి, మిత్రులతో భిన్నాభిప్రాయాలు ప్రాప్తించినా ధనలాభము, కీర్తులకు అడ్డురావు. శ్రమకరమైన ప్రయాణం ప్రాప్తించవచ్చు. ఆరోగ్యం విషయంలో జాగ్రత్త వహించాలి. కార్యానుకూలం ఉంటుంది. విద్యార్థులకు ఫలం ఆలస్యంగా ప్రాప్తించినా శుభప్రదం. కుటుంబసౌఖ్యం ఉంటుంది. రాజకీయాల్లో జయం లభిస్తుంది. స్త్రీలకు కుటుంబ తగాదాలవల్ల చికాకు ఏర్పడవచ్చు. 12, 13 తేదీలు శుభదినాలు.

## మిథునం

[మృగ. 3,4 పా., ఆరు., పున 1,2,3 పా.]

కార్యలాభం, గౌరవం, కుటుంబసౌఖ్యం క్రమక్రమంగా వృద్ధి కాగలవు. వారాంతంలో అశ్రద్ధ మూలక వ్యయం ప్రాప్తించవచ్చు. మిత్రాదరణ ప్రాప్తిస్తుంది. స్త్రీలతో అకారణ కలహం ప్రాప్తించవచ్చు. వృద్ధులు ఆరోగ్యంవిషయంలో జాగ్రతవహించాలి. బంధుమరణం సూచకం. కోర్టు వ్యవహారాలు అనుకూలించవు. విద్యార్థులకు ప్రోత్సాహకరంగా ఉంటుంది. ఉద్యోగులకు శుభకాలం. ప్రజానాయకులకు ప్రజాదరణ ప్రాప్తిస్తుంది. స్త్రీలకు ఉత్తమ కాలం. 14, 15 తేదీలు శుభదినాలు.

## కర్కాటకం

[పున 4 పా., పుష్య, ఆశ్రే.]

కార్యాచరణలో ఆటంకాలు ఏర్పడవచ్చు. బంధువులతో భిన్నాభిప్రాయాలు ఏర్పడకుండా వ్యవహరించుట శుభప్రదం. భార్యకు అనారోగ్యం సూచకం. పెద్దలతో విరోధం ప్రాప్తించవచ్చు. క్రమంగా జయం లభిస్తుంది. విలాస వస్తువులు స్వీకరిస్తారు. స్థిరాస్తి ప్రాప్తించే కాలం. కుటుంబసౌఖ్యం ఉంటుంది. కీర్తి ప్రతిష్ఠలు పెంపొందగలవు. విద్యార్థులకు వారాంతంలో శుభం. ఉద్యోగులకు ప్రమోషన్ అవకాశా లున్నాయి. స్త్రీలకు ఆర్థిక, కుటుంబసౌఖ్యాలు ఏర్పడగలవు. 16, 17 తేదీలు శుభదినాలు.

## సింహం

[మఖ., పుబ్బ. ఉ 1 పా.]

వివిధ లాభాలు ప్రాప్తించవచ్చు. చాకచక్యంగా కార్యాలు సాధింపగలుగుతారు. పెద్దల వలన అవమానం ప్రాప్తించకుండా జాగ్రత వహించాలి. కోర్టు వ్యవహారాలు అనుకూలం కాకపోవచ్చు. రాజీమార్గం అవలంభించడం క్షేమకరం. ఉద్యోగప్రాప్తి ఉన్నా వ్యయంతో కూడి ఉంటుంది. ఉద్రేకం తగ్గించుకొనుట మంచిది. విద్యార్థులకు వాంఛితార్థ ఫల సూచకం. ఉద్యోగులకు మధ్యమ ఫలకాలం. వ్యాపారస్థులకు వ్యయ మధికం. స్త్రీలకు ఉద్యోగలాభం. 18 వ తేది శుభప్రదం.

## కన్య

[ఉత్త 2,3,4 పా హస్త, చిత్త 1,2 పా.]

ఈ వారం గ్రహస్థితి ఎక్కువ అనుకూలంగా లేదు. వృథా ప్రయాణాలుండవచ్చు. అనారోగ్యంప్రాప్తిస్తుంది. ఉత్సాహంగా ఉండరు. వారాంతంలో అనుకూలంగా ఉంటుంది. ఉద్యోగులకు శుభకాలంగా ఉండదు. బంధు మరణం ప్రాప్తించవచ్చు. వ్యయం అధికం. సంతాన అనారోగ్యం ఉంటుంది. విరోధి బాధ ఎక్కువగా ఉండవచ్చు. స్త్రీలకు మిత్రాదరణ, విలాస వస్తుసేకరణ ఉంటాయి. పెద్దలవలన గౌరవం లభిస్తుంది. కీర్తిని పొందుతారు. 12, 13 తేదీలు శుభప్రదాలు.

## తుల

[చిత్త 3,4 పా. స్వాతి. విశా 1,2,3 పా.]

వారం ప్రారంభంలో శత్రుక్షయం, మనశ్శాంతి ఉంటాయి. ధనలాభం, వాంఛిత వస్తుప్రాప్తి ఉండగలవు. కుటుంబ సౌఖ్యం లభిస్తుంది. విలాసయాత్రలు చేస్తారు. వారాంతంలో అనారోగ్యం సూచకం. ప్రజానాయకులకు గౌరవ మర్యాదలు ప్రాప్తించవచ్చు. ధన. వృద్ధి, కార్యానుకూలం విశేషాలు. మిత్రాదరణ, తన్మూలక లాభం ఉండగలవు. సంతానం విషయంలో జాగ్రత వహించాలి. స్త్రీలకు కుటుంబసౌఖ్యం, మిత్రాదరణ, నూతన వస్త్రప్రాప్తి. 12, 13 తేదీలు శుభదినాలు.

## వృశ్చికం

[విశా 4 పా., అనూ., జ్యేష్ఠ.]

ఈ వారంలో ధనలాభం ఉంటుంది. కుటుంబ సౌఖ్యం లభిస్తుంది. వ్యయంకూడా ఉన్నందున ఒత్తిడి ప్రాప్తించవచ్చు. మనశ్శాంతి ఉండకపోవచ్చు గాని, బాధాకరంగా పరిణమించదు. స్త్రీల మూలంగా శ్రమ కలుగుతుంది. భార్యతో తగాదా రాకుండా చూడండి. ప్రయాణాలు ప్రయాసతో కూడి ఉంటాయి. విద్యార్థులకు శుభప్రదం—ప్రజానాయకులకు వారంమధ్యంనుండి శుభకాలం. ఉద్యోగులకు అధికారవృద్ధి, గౌరవం ప్రాప్తించవచ్చు. స్త్రీలకు అశుభకాలం. 16, 17 తేదీలు శుభదినాలు.

## ధనుస్సు

[మూల, పూషా. ఉషా. 1 పా.]

ఇతరుల మూలకంగా ధనం లాభించినా నిలవకపోవచ్చు. కుటుంబం వారికి అనారోగ్యం సూచకం. శత్రు




—దివాకరుని వెంకట సుబ్బారావు

**12-4-72 నుంచి 18-4-72 వరకు**

[ఈ వారంలో గ్రహస్థితి: మీన మేషములలో - రవి; వృషభంలో - కుజ, శుక్ర, శనులు; కర్కాటకంలో — కేతువు; ధనుస్సులో - గురువు; మకరంలో - రాహువు; మీనంలో - బుధుడు; మీన, మేష, వృషభ, మిథునాలలో చంద్రుడు ఉంటారు.]

పీడ కొంత ఉంటుంది. ఆర్థికంగా ఒత్తిడి ఉంటుంది. కోర్టు వ్యవహారాలు అనుకూలించగలవు. ఆరోగ్యం తృప్తికరంగా ఉంటుంది. ఉద్యోగులకు శుభకాలం; ప్రమోషన్ లభించవచ్చు. వ్యాపారం లాభకరంగా ఉంటుంది. విద్యార్థులకు అనుకూల ఫలితం లభిస్తుంది. స్త్రీలకు ఆర్థికంగా చిక్కులు ఏర్పడవచ్చు. వ్యయం ఎక్కువగా ఉంటుంది. 18 వ తేది అనుకూలం.

## మకరం

[ఉ. షా 2,3,4 పా., శ్రవ., ధని. 1,2 పా.]

దూర ప్రయాణం చేసే కాలంగా ఉంది. బంధు విరోధం ఉంటుంది. అధికారుల వలన చిక్కులు ప్రాప్తించవచ్చు. కుటుంబసౌఖ్యం కొంత తగ్గుతుంది. సంతానం విషయంలో ప్రమాద సూచకంగాన తగు శ్రద్ధ వహించటం అవసరం. వృథా తగాదాలు పెంచుకొనరాదు. మనశ్శాంతి లభించకపోవచ్చు. విద్యార్థులకు అనుకూల ఫలం ప్రాప్తించదు. ఉద్యోగులకు మిశ్రమ ఫల సూచకం. రాజకీయవాదులకు ప్రతికూల కాలం. స్త్రీలకు సంతాన సుఖం ఉంటుంది. 12, 13 తేదీలు అనుకూలం.

## కుంభం

[ధని 3,4 పా., శత పూభా 1,2,3 పా.]

ఉద్యోగవృద్ధి, కీర్తి ప్రాప్తించే కాలం. ఆరోగ్యం తృప్తికరంగా ఉంటుంది. బంధుమూలక దుఃఖం ప్రాప్తించవచ్చు. అపవాదులు ప్రాప్తించవచ్చు. కార్యానుకూలం ఉంటుంది. కుటుంబసౌఖ్యం తృప్తికరం. మిత్రుల వలన లాభం కలుగుతుంది. వృద్ధికి అవరోధాలుండవు. వ్యవసాయమూలక లాభం ప్రాప్తిస్తుంది. ప్రయాణాలు శ్రమతో కూడి ఉండగలవు. విద్యార్థులకు శుభప్రదం. ప్రజానాయకులకు గౌరవప్రాప్తి. స్త్రీలకు శుభప్రదం. 14, 15 తేదీలు శుభదినాలు.

## మీనం

[పూ. భా., 4 ఉ భా., రేవతి.]

పట్టుదల ఎక్కువగా పెరుగుతున్నందున ఆర్థికంగా నష్టపడవలసి వస్తుంది. విరోధులు ఎక్కువ అయ్యే సూచనలున్నా శత్రుక్షయం అవుతుంది. ఆరోగ్యం బాగుంటుంది. ధనలాభం తృప్తికరంగా ఉంటుంది. కీర్తి, అధికారం వృద్ధి పొందుతాయి. కార్యజయం అనుకున్నదానికంటె ఎక్కువగా లభిస్తుంది. పలుకుబడి వలన లాభప్రదంగాఉంటుంది. విద్యార్థులకు సామాన్యం. స్త్రీలకు ఉత్తమ శుభఫలప్రాప్తి. 16, 17 తేదీలు శుభప్రదం. ★

ఏరుదాటి... చిత్రం—కె. శోభ (నరసరావుపేట)



(క్రిందటి సంచిక తరువాయి)

## 9 వ రంగము

[విద్యాసాగర్ డ్రాయింగు రూములో పచార్లు చేస్తూ, ఆగి ఆగి పద్యం పూర్తిచేస్తూ చదువుతూ ఉంటాడు.]

**వేల భావాల క్రింద, ప్రభవించి, ప్రవృద్ధిని గాంచి,**
**త్రెస్సిపోజాలక ఈ గతిన్ కొనలు సాగెడు, నా**
**వల పిట్టు కానిచో కాల మహత్య మేకతము**
**గా సమకూడిన నూత్న జీవిక్కై, ఏల తపిం**
**చు, నీ హృదయ మిట్లు నిశమ్మున శాంతి విహీనమై.**

[హఠాత్తుగా అతని దృష్టి సర్ నరసింగరావు పక్కనే అమర్చిన మహాలక్ష్మమ్మగారి ఫోటో మీద పడుతుంది. చంద్రమ్మ ట్రేలో ఫలహారాలు, కాఫీ తెచ్చి విద్యాసాగర్ వంక చూచి సానుభూతితో వెళ్ళి పోతుంది.]

విద్యాసాగర్ : అమ్మా! నీతో నిజం చెప్పకపోతే, మాత్ర వంచన చేసినవా ణ్ణవుతా ననుకొన్నాను గాని, నీ హృదయం బ్రద్దలు కొట్టి నిన్ను కోల్పోతా ననుకోలేదమ్మా!

లక్ష్మయ్య : (ప్రవేశించి) కాఫీ అవీ చల్లారి పోతున్నాయి, బాబూ! విచారపడి చేసేదేముంది, చెప్పండి? అయ్యగారి అజ్ఞ రెండు పెద్ద ప్రాణాల్ని బలిగొంది. ఇంకే అనర్థాలు ముంచుకు వస్తాయో తెలియదు.

విద్యాసాగర్: ఏదో బలవత్తరమయిన కారణం లేకుండా ఆయన అల్లా చేసి ఉండరు, లక్ష్మయ్యా!

లక్ష్మయ్య: ఏమో, బాబూ! అంతా కలవరం కలిగిస్తోంది. ఇష్టమో, అయిష్టమో — ప్రసూనమ్మ తమర్ని వివాహం చేసుకున్నదిగా? పోనీ, అత్తగారు పాతకాలపు మనిషి కనక ఎక్కడికని అడిగిందే అనుకోండి. ఏ స్నేహితురాలు ఇంటికోనని వినయంగా చెబితే ఎంత బాగుండేది! అంత అమర్యాదగా మాట్లాడ్డం దేనికి?

విద్యాసాగర్: తమ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను నిరోధించే వ్యక్తుల్ని ఆధునిక యువతీ యువకులు సహించరు, లక్ష్మయ్యా! ఇంతకీ ఆ రోజు ప్రసూన ఎక్కడికి వెళ్ళినట్లు?

లక్ష్మయ్య : ఎక్కడికి వెళుతుంది? ఆయనగారి దగ్గరికే!

విద్యాసాగర్ : ఆ సంగతి నీ కెలా తెలుసు?

లక్ష్మయ్య : ఆయన టెలిఫోన్ చేశాట్ట. చంద్రమ్మ ఫోను తీసుకుంది. ప్రసూనమ్మగారిని పిలవమని ఆజ్ఞాపించినట్లు చెప్పాట్ట. ఎవరో అనుకొని చంద్రమ్మ ఆ వార్త అందించింది.

విద్యాసాగర్ : ఫోను చెయ్యడంలో తప్పేమీ లేదనుకో.

లక్ష్మయ్య: ఇంత మంచితనం మంచిది కాదు, బాబూ, కాస్త ఆవిణ్ణి అదుపులో ఉంచాలి!

విద్యాసాగర్ : అంటే? నేను మొగుడిని, నాతో చెప్పకుండా నువ్వు ఎక్కడికీ ఫోనూ గీనూ చెయ్యగూడదు; ఎవరి దగ్గరకూ వెళ్ళకూడదు అని ఆజ్ఞాపించమంటావు! అంతేనా?

లక్ష్మయ్య: అది కాదు, బాబూ! ఆమేగా మిమ్మల్ని కోరి వివాహం చేసుకుంది. ఆస్తికోసమే అనుకోండి. ఆస్తి చేజిక్కే వరకైనా సంఘ మర్యాదలు పాటించాలిగా?

విద్యాసాగర్ : సంఘ మర్యాదలు సంఘీయుల్ని బట్టి మారుతూ ఉంటాయి, లక్ష్మయ్యా! ఒక సంఘంలో మర్యాద అనుకున్నది, ఇంకొక సంఘంలో కాకపోవచ్చునుగా!

లక్ష్మయ్య: ఏమో, బాబూ? మన సంఘ మర్యాదల మాట చెప్పాను.

విద్యాసాగర్ : లక్ష్మయ్యా! అవిడ నా ఆస్తి నాకు పంచి, నా స్వేచ్ఛ నా కిమ్మని అడిగితే నిస్సంకోచంగా ఇచ్చేసి ఈ భవంతిని విడిచి నిస్సందేహంగా వెళ్ళిపోతాను. కాని, మామయ్య ఆదేశం అడ్డం వస్తోంది. మామయ్య విల్లులో ఏం రాశాడో చూడు. (డ్రాయరు తెరిచి విల్లు బయటకు తీసి) "ప్రసూన అమాయకురాలు. దాని తల్లి అహంభావి. వాళ్ళకు డబ్బు విలువ తెలియదు. దానివి, దాని ఆస్తిని పరిరక్షించే భారం విద్యాసాగర్ మీద ఉంచుతున్నాను. అది అతనికి బాధాకరంగా పరిణమిస్తుందని తెలుసు. వాడు కనిపెట్టిన యంత్రాలు పేటెంటు చేసుకొనడానికీ, వాడి ఆదర్శాలు సాధించటానికీ వాడికీ భాగ మిస్తున్నాను. ఎప్పటి కయినా ప్రసూన తన పొరపాటు గ్రహిస్తుందని నా ఆశ. అంతవరకూ నిగ్రహం, సహిష్ణుత చూపమనీ, తప్పనిసరి అయితేనే విడిచి పొమ్మనీ విద్యాసాగర్‌ను ఆడపిల్ల తండ్రిగా, మేనమామగా ప్రార్థిస్తున్నాను."

పాపం! మామయ్య చిన్నప్పుడు నన్ను భుజాల మీద ఎక్కించుకొని మోసే వాడు!

లక్ష్మయ్య : ఇప్పుడు కూతుర్ని నెత్తికెక్కించుకొని మోయమంటున్నారు. ఇది స్వార్థం కాదా, బాబూ! అయ్యగా రేమీ అనరు గానీ ...

విద్యాసాగర్ : స్వార్థం కాదు, లక్ష్మయ్యా! పితృప్రేమ. ఇందులో కొంత నా స్వార్థమూ ఉంది. ఏనాటికైనా ప్రసూన నా ప్రవర్తన మెచ్చుతుందని, ప్రసాద్ ప్రవర్తన ఆమెలో విరక్తి కలిగిస్తుందనే ఆశ నాలో లేకపోతే, ఇంత సహనం చూపించి ఉండకపోదునేమో!

లక్ష్మయ్య : అదా సంగతి! అలా చెప్పండి. ప్రసూనమ్మగార్ని ఒక్కసారేగా, బాబూ, చూసింది తమరు?

విద్యాసాగర్ : ఒక్కమాటు చూడ్డంతో కలిగే ప్రేమలు అణుచుకోలేనివి, లక్ష్మయ్యా! ప్రేమ లోపాల్ని గణించదు. సహిస్తుంది.

చంద్రమ్మ తల్లి తిరిగి వచ్చి క్షమించమంటే ఏం చేస్తావు?

లక్ష్మయ్య : వచ్చినా చంద్రమ్మకోసం తిరస్కరిస్తాము.

విద్యాసాగర్ : అదే పురుషజాతి వైచిత్ర్యం. పెడదారి తొక్కిన స్త్రీ మీద విముఖత్వం, ఆ స్త్రీ వల్ల కలిగే సంతానం మీద మమకారం.

లక్ష్మయ్య : దాన్నే, బాబూ, కడుపు తీపి అంటారు.

విద్యాసాగర్ : తన బిడ్డలని ఋజువు చెయ్యటానికి మగవాడి కేమీ సాక్ష్యం లేదు, లక్ష్మయ్యా! వాళ్ళ అభిమానమో, తన బిడ్డలేనన్న నమ్మకమో! లేక తను ప్రేమించిన స్త్రీ బిడ్డలనే ఆ మమకారాన్ని కలిగిస్తుందేమో? అంతే!

(తలుపు మీద చప్పుడు)

విద్యాసాగర్ : ప్లీజ్ కమిన్! (ప్రసూన ప్రవేశం) కూర్చో, ప్రసూనా!

లక్ష్మయ్య : నేను తరవాత దర్శనం చేసుకుంటాను, బాబూ. సెలవమ్మా (వెళ్ళిపోతాడు.)

విద్యాసాగర్ : (కుర్చీ చూపించి) కూర్చో!

ప్రసూన : (కూర్చొని) మీతో కాస్త మాట్లాడాలి.

విద్యాసాగర్ : అందుకు సంకోచ మెందుకు? ఏమిటది?

ప్రసూన : నాకు లక్ష రూపాయలు కావాలి. నా భాగం లోంచి ఇవ్వండి. ఎందుకని ప్రశ్నించి నన్ను ఎంబరాస్ చెయ్యకండి.

విద్యాసాగర్ : (ఆలోచించి) ఎందుకు అని అడిగే హక్కు నాకు నైతికంగా లేదు. అడిగేటంత అవివేకినీ కాదు ... కానీ ... నీ భాగంలో నుంచి ఇవ్వలేను.

ప్రసూన : (కటువుగా) ఎందుకని?

విద్యాసాగర్ : ఆ మాట వివాహం ఇచ్చిన హక్కుతో అనడం లేదు, ప్రసూనా! మీ నాన్నగారు ఇచ్చిన ఆదేశం వల్ల అంటున్నాను.

ప్రసూన : నా డబ్బు విషయంలో కూడా ఆదేశా లిచ్చి పోయినా డేమిటి ఆయన!

విద్యాసాగర్ : అవును.

ప్రసూన : ఏమి టా ఆదేశం?

విద్యాసాగర్ : ఆ డబ్బు నువ్వు ఖర్చుచేసే విధానం సంతృప్తికరమైనదని తెలిసే వరకూ ఇవ్వగూడదని.

ప్రసూన : అతను అన్నంతా అయిందే! ఎంత కుతంత్రం! (దుఃఖం ఆపుకొని)

విద్యాసాగర్ : అంతమాత్రానికే నువ్వు దుఃఖపడ నవసరం లేదు, ప్రసూనా! అదృష్టవశాత్తూ నా భాగం డబ్బుమీద ఏ షరతులూ లేవు. ఆ డబ్బు నేను ఇస్తాను. తీసుకో.

ప్రసూన : అప్పుగానా?

విద్యాసాగర్ : కాదు.

ప్రసూన : మరి?

విద్యాసాగర్ : గిఫ్ట్‌గా.

ప్రసూన : మీ డబ్బెందుకు పోగొట్టుకుంటారు?

విద్యాసాగర్ : ఆ డబ్బు నాది కాదు. అది నిన్ను నేను వివాహం చేసుకోవటం వల్ల నాకు సంక్రమించింది. ఆ వివాహానికి అర్థం లేదు. ఆ డబ్బుకు విలువా లేదు. కనక నీవు సంకోచించ నవసరమేమీ లేదు, ప్రసూనా!

ప్రసూన : (ఆశ్చర్యంగా, వ్యగ్రంగా చూస్తూ ఉంటుంది.)

విద్యాసాగర్ : ఎందుకు, ప్రసూనా, అట్లా చూస్తున్నావు!

ప్రసూన : మీరు నాన్న కన్నా విచిత్రమైన మనుష్యులు.

విద్యాసాగర్ : థాంక్ యు ఫర్ ది కాంప్లిమెంట్! ( డ్రాయరులోంచి చెక్కు బుక్కు తీసి, చెక్కు రాసి ) ఈ చెక్కు మార్చుకొని డబ్బు తీసుకోలేకపోతే నేను తెప్పించి ఇస్తాను.

ప్రసూన : ( ఆలోచించి ) అక్కర్లేదు, ఇవ్వండి. ( పెదవి కొరికి ) మీ సొత్తు ఇంకొకరికి ఇస్తున్నారేమో!

విద్యాసాగర్ : నా సొత్తయితే మళ్ళా తిరిగి వస్తుంది.

ప్రసూన : ( అతని వంక చూచి, నేలవంక చూస్తూ ) యు హేవ్ గాట్ ఎ సెన్స్ ఆఫ్ హ్యూమర్. ఆల్‌రైట్!

చంద్రమ్మ : ( ప్రవేశించి ) ప్రసాద్‌గారు ఫోన్‌లో పిలుస్తున్నా రమ్మా!

ప్రసూన : ( ముఖం చిట్లించి) ఫోనా! ( తల పంకించి విద్యాసాగర్‌ని చూచి ) బై బై! ( వెళ్లి పోతుంది. )

( చంద్రమ్మ అతనివంక జాలిగా చూస్తూ వెళ్లి పోతుంది. ) ( తెర. )

## 10 వ రంగము

[ వడమటిల్లు. చంద్రమ్మ కొండచీపురుతో ఊడుస్తూ ఉంటుంది. రాఘవులు ప్రవేశించి, ఇది తలుపుల్లోంచి చూచి ఎవరూ లేరని గ్రహించి]

రాఘవులు : చలాకీ అయినదీ
గిరాకీ ఉన్నదీ
కల్లా కపటము నెరుగని
కార్మికులా చిన్నదీ ॥చ॥

చంద్రమ్మ : ( ఉలిక్కిపడి ) నీ కేమయినా బుద్ధి ఉందా! పెద్దమ్మగారు క్రిందే ఉన్నారు. ఆమె కళ్ల పడ్డామంటే మళ్లీ ఇంటి ముఖం చూడకుండా చేస్తారు.

రాఘవులు : ఓస్, ఇంతేనా! నీ ముఖం చూడకుండా చేయలేరుగా?

చంద్రమ్మ : ఇలాంటి పిచ్చి చేష్టలు చేశావంటే ఆ పని నేనే చేస్తాను. ( మళ్లీ ఊడుస్తూ ఉంటుంది. ఒక చేతిలో చీపురు, ఒక చేయి నడుంమీద ఉంటుంది. )

రాఘవులు : చేత చీపురు పట్టి
చెయ్యి రొంటిన బెట్టి
ఊపు ఊపుకు వళ్లు
ఉయ్యాల లూగుతుంటే

చంద్రమ్మ : ( కోపం నటిస్తూ ) ఏం? కవిత్వం పుట్టుకొస్తుందేమిటి?

రాఘవులు : చెంపమీద చెయ్యేస్తే
గూబ గుయ్యి మనిపిస్తది
కన్నుసైగ చేసేరా
వెన్ను విరగ బొడిచేస్తది.

చంద్రమ్మ : తెలుసుగదా!

రాఘవులు : నువ్వే దేవత వంటే
నవ్వు పువ్వు విసిరేస్తది.

చంద్రమ్మ : ( చీపురు కత్తిలాగా ఝళిపిస్తూ ) ఎళ్లావా? ఎళ్లావా?

రాఘవులు : శరణు! శరణు! ( వంగి నమస్కరిస్తాడు. )

చంద్రమ్మ : ( మళ్లీ తలుపుగుండా చూచి ) అమ్మగారి స్నానం అయింది. ఇంక వాళ్లే, వెళ్లు.

రాఘవులు : నేను ఆఫీస్ బాయ్‌ని. వచ్చే నెలనుంచి నన్ను అయ్యగారు మిల్లులో క్లైన్స్ కీపర్‌గా వేస్తామన్నారు. ఇక నీకు కనపడ మన్నా కనపడనులే! ( ధీమాగా అటు తిరిగి నించుంటాడు. )

చంద్రమ్మ : ( ఆదుర్దాగా ) ఈ ఇంట్లోంచి ఎళ్లి పోతావా! అన్నీ ఉత్తిదే, కోతలు.

రాఘవులు : మరి దగ్గరికొస్తే కరుస్తావు! ఎళ్లిపోరా నంటే ఎళ్లొద్దంటావు—ఈ ఆడోళ్ల తంతుతో ఇరక్తి పుట్టింది. ఎళ్లిపోతా!

చంద్రమ్మ : ( బెంగగా ) ఇహ రావా!

రాఘవులు : ఎందుకు రావడం? నీ కక్కర లేదుగా!

చంద్రమ్మ : అని నే నన్నానా? అమ్మగారు వస్తుంది. ఎళ్లమంటే అంత కోపమెందుకు? అంత ఎళ్లాలని ఉంటే ఎళ్లు. ( మూతి తిప్పుకుంటుంది. )

రాఘవులు : నువ్వు ఎళ్లమంటే ఎళ్ల బుద్ధికావటం లేదు.

( మరో ద్వారం నుంచి ప్రవేశించి వారిద్దరినీ చూచి నవ్వుతూ )

దుర్గాంబ : వెళ్ల బుద్ధికాకపోతే ఇక్కడే ఉండరా. ( చంద్రమ్మ, రాఘవులు ఉలిక్కిపడి వణికి పోతారు. ) ఎందుకర్రా అలా వణికి పోతారు? ఈ ఇంట్లో చిన్న వాళ్ల ప్రేమ కలాపాలు చూచి ఎన్నాళ్లయిందో! ( నిట్టూర్పు. చంద్రమ్మ, రాఘవులు ఒకరి ముఖాలు మరి ఒకరు చూసు కుంటారు. )

దుర్గాంబ : భవనాల్లో ఉండేవాళ్లకంటే ఏ ఆస్తిపాస్తి లేని మీ జీవితమే ఆనందమయంగా ఉంది. మీ కోర్కెలు తీరటానికి మీ కే తల్లిదండ్రులు అడ్డురారు. ఏ ధన వాంఛా మీ కాటంకం కలిగించదు. ( చంద్రమ్మ, రాఘవులు దుర్గాంబ కాళ్ల మీద పడతారు. )

చంద్రమ్మ, రాఘవులు : మన్నించం డమ్మగారూ!

దుర్గాంబ : మన్నించండర్రా! మీ ప్రేమ గోష్ఠి చెడ గొట్టి నందుకు మీరు నన్ను మన్నిం చాలి. ఎవరి ప్రమేయం లేకుండా సహ జంగా ప్రకృతిసిద్ధమయిన ప్రేమ మీది! ఆ ప్రేమ అందరికీ లభించదు. లభించినా శాశ్వతంగా ఉండదు. సంపన్న కుటుంబాల వారు ఆ ప్రేమను చవిచూట్టానికి కూడా నోచుకోరు. ప్రేమను గురించి నేను కన్న కలలన్నీ కల్లలై పోయినాయి. మోడు పోయిన నా జన్మ మీ ఆనందంతో మళ్లీ చిగురిస్తోంది. చంద్రీ! ప్రసూన ఇంకా రాలేదా?

చంద్రమ్మ : ( అటూ ఇటూ చూచి ) ఇంకా రాలే దమ్మగారూ!

రాఘవులు : సెలవిప్పించమ్మా! ఇలాంటి దేవతలాంటి తల్లిని గురించి ఏమేమో అనుకుంటుంది పాడుకోకం!

దుర్గాంబ : ( రాఘవులు భుజంతట్టి ) ఒరే, రాఘవులూ, [illegible]. భర్త తన మాట జవదాటి కూడదని ప్రతి ఆడది కోరుకుంటుంది—( చంద్రమ్మను చూచి ) చంద్రీ! ఈ గాడిద నీ మాట కాదంటే నాతో చెప్పు, చంద్రీ, వీడి రెండు చెవులూ మెలిపెడతాను. పోండి. తోటలోనికి పోయి ఆడుకోండి. ( చంద్రమ్మ, రాఘవులు ముఖాలు చేటంత చేసుకొని పోతారు. )

( తెర )

( రాత్రి వేళ పడక సీనుతో లాగే చంద్రమ్మ అద్దం ముందు నించుని కులుకుతూ పాడుకుంటూ ఉంటుంది. )

చంద్రమ్మ : చలాకై పడి ఛలో
గిలాకై పడి
కళ్లు మిటమిట లాడగ
హార్మికుల చిన్నది
( అద్దంలో చూసుకొని ) నే నంత చలా కీగా ఉంటా నేమిటి? ( కళ్లు మిటమిట లాడిస్తూ ముంగురులు సవరించు కుంటూ ) నేను నిజంగా అందమైన దాన్నే! రాఘవులు అబద్ధమాడితే మట్టుకు అద్దం అబద్ధం ఆడుతుందా ఏమిటి?
ఒంటిమీద చెయ్యేస్తే
గూబ గుయ్ మనిపిస్తది
కన్ను సైగ చేశారా
పన్ను విరగ దొబ్బేస్తది.
పాపం, రాఘవులనుకునేటంటే ఎంత భయమో! భయం లేకపోతే ఎట్లా గేమిటి? మర్యాదగా ప్రవర్తించకపోతే నామ పీపు మీద తాషామరపా వాయి స్తాడు. ( ఆగి ) రాఘవులు అల్లరి చేసినా బాగానే ఉంటుంది. ఇష్టమైన వాళ్లు ఏం చేసినా బాగానే ఉంటుంది. రాఘవు లెంత బాగా నృత్యం చేశాడు! నేనుకూడా నేర్చుకోవాలి. ( అడుగులు వేస్తూ )
నువ్వే దేవత వంటే
నవ్వు పువ్వు విసిరేస్తది
నవ్వు పువ్వు విసిరేస్తది
పువ్వు నవ్వు విసిరేస్తది.
( నృత్యం ఆపి ) ఇదేమిటి? నేను అడుగు తప్పకుండా నృత్యం చేస్తున్నా నేమిటి? ( ఆలోచిస్తూ ) ఈ ప్రేమ జబ్బు భలే తమాషా జబ్బు. ఆ జబ్బొస్తే సాధన లేకుండానే సంగీత మొస్తుంది. అలవాటు లేకుండానే అడుగు తెయ్యిడ మొస్తుంది. చదువు లేకుండానే కవిత్వ మొస్తుంది. ( ఆలోచిస్తూ )
చేదులోనే తియ్యదనము



బాధలోనే పరమ సుఖము
ఎండలోనే చల్లదనము
గట్టిలోనే మెత్తదనము

( హఠాత్తుగా ఆగి )

రాఘవు ఓ ఇంట్లోనుంచి వెళ్లిపోతానంటే కాలి క్రింద భూమి కుంగిపోయినట్లైపోయింది. ఊపిరే ఆడలే.

ఇప్పుడిప్పుడే ప్రేమ పిచ్చి పట్టిన నాకే ఇట్లా ఉంటే, ఎప్పుడో పుట్టి బాగా ముదిరిపోయిన చిన్నమ్మ గారికీ, పెద్దమ్మ గారికీ ఎట్లా ఉంటుందో?

మనసుకు నచ్చిన వాళ్ళు దొరికితే ఒక రకం బాధ. దొరక్కపోతే ఇంకో రకం బాధ.

బాధలోనే పరమ సుఖము
చేదులోనే తియ్యదనము ( నృత్యం )

( ప్రసూన ప్రవేశించి చంద్రమ్మను చూసి)

ప్రసూన : ఏమిటే ఆ బాధ? చాలా తియ్యని బాధలా ఉంది?

చంద్రమ్మ : ఏం లేదు, ప్రసూనమ్మగారూ, ఊరికేనే అడుగులేస్తున్నా. మీరూ ఒకప్పు డేసేవారుగా ?

ప్రసూన : ( చిట్లార్చి ) నన్ను ఇమిటేట్ చేయబోకు, చిక్కుల పాలవుతావు.

చంద్రమ్మ : ( ప్రసూన వంక సార్థకంగా చూస్తూ ) మీరు నేర్చుకొమ్మన్నప్పుడు నేర్చుకోలేదు. ఇప్పు డేమిటో నృత్యం చేయాలనిపిస్తున్నది.

ప్రసూన : అట్లాగా! ( కొంటెగా చూస్తూ ) ఏదీ, ఆ పాట మళ్ళీ పాడు.

చంద్రమ్మ : ( సిన్నెమ్మ లాగా )
బాధలోనే పరమ సుఖము
చేదులోనే తియ్యదనము

ప్రసూన : ప్రేమలో పడ్డ వాళ్ళు గాని ఆ పరమ సత్యం గ్రహించరే!

చంద్రమ్మ : పోండి, ప్రసూన్నమ్మ గారూ! ( సిగ్గు )

ప్రసూన : భాగవతం పాఠం బాగానే పని చేస్తున్నట్లుంది.

చంద్రమ్మ : భలేవారే పండి?

ప్రసూన : ఆ పాట నీ కెల్లా వచ్చు?

చంద్రమ్మ : ఏదో, ఏదో అనుకుంటూ అడుగు లేస్తున్నాను.

ప్రసూన : సరస్వతీదేవి నడకే నృత్యమట. భావాలే గేయాలట. ప్రేమావేశంతో స్పందించిన హృదయం ఆటలా ఆడుతుంది, పాటలా పాడుతుంది, ఆ పాట అంతకు ముం దెరుగని అనుభూతుల్ని,కలవరాన్నీ కలిగిస్తోంది నాకు. ( పాడుతుంది. పాడుతూ నృత్యం చేస్తుంది. పరిసరాల్ని మరిచి, చంద్రమ్మ తదేక దీక్షతో చూస్తూ ఉంటుంది. )

చేదులోనే తియ్యదనము
బాధలోనే పరమ సుఖము
ఎండలోనే చల్లదనము
గట్టిలోనే మెత్తదనము.

ప్రసూన : ( పాట ఆపి ఖాళీగా చూస్తూ ఉంటే)

చంద్రమ్మ : ప్రసూనమ్మగారూ! ఆ బాధలోనే పరమ సుఖ ముందికదూ?

ప్రసూన : ( ఉలిక్కిపడి ఈ లోకంలోకి వచ్చి ) ఏ బాధలో!

చంద్రమ్మ : ( తొణక్కుండా ) మీరు పడే బాధలో!

ప్రసూన : ( ఖంగారుపడి ) ఉంటుందేమో! ( మాట ధోరణి మార్చి ) ఎవరే ఆ సుందరాకారుడు?

చంద్రమ్మ : ( ఆలోచించి తల వంకించి ) చెప్పను, బాబూ!! భయమేస్తోంది.

ప్రసూన : ఎవరో సుందరాకారుడిమీద కన్నేసి, "బాధలోనే పరమ సుఖము, చేదులోనే తియ్యదనము" తెలుసుకొనటానికి భయం లేదుగాని, నాతో వాడి పేరు చెప్పటానికి భయమేస్తున్నదా? చెపుతావా? అమ్మ గారితో చెప్పనా?

చంద్రమ్మ : ( భయం నటిస్తూ ) చెప్పకపోతే పెద్దమ్మగారితో చెపుతారా?

ప్రసూన : తప్పకుండా!

చంద్రమ్మ : చెపితే మీకు కోపమొస్తుంది.

ప్రసూన : నువ్వెవడి మీదో కన్నేస్తే మధ్య నా కెందుకే కోపం?

చంద్రమ్మ : చెప్పనా? ఆ తరవాత నన్నేమీ అన గూడదు మరి!

ప్రసూన : ఏమిటే ఈ తలాయింపు? చెపుతావా? చెవులు మెలిపెట్టనా? ( చెవులు పట్టుకో బోతుంది. )

చంద్రమ్మ : ( తప్పించుకొని ప్రసూన ఎదురుగా నిలబడి) విద్యాసాగరంగారు (అని ప్రసూన ముఖ కవళికలు పరీక్షిస్తూ ఉంటుంది. ) ప్రసూన ముఖంలో మార్పు చూసి, వచ్చే నవ్వు ఆపుకుంటూ తల వంకిస్తూ ఉంటుంది. )

చంద్రమ్మ : క్షమించండి, ప్రసూనమ్మగారూ! నేను భయపడుతుంటే మీరే బలవంతంచేసి చెప్పించారు.

ప్రసూన : ( దీర్ఘంగా ఊపిరి పీలుస్తూ చంద్రమ్మ వంక చూస్తూ ఉంటుంది. )

చంద్రమ్మ : బాధగా ఉందా, ప్రసూనమ్మగారూ? మన సొత్తు జోలికిఇతరులుపోతున్నారని తెలిస్తే బాధగానే ఉంటుంది మరి! ... కాని, విద్యాసాగరం గార్ని నా మనస్సులోనే ప్రేమిస్తున్నాను. ఆయన ఏ పాపమూ ఎరగడు.

ప్రసూన : విద్యాసాగర్ నా సొత్తని నేను ఏ నాడూ భావించలేదు. నా సొత్తే అయితే మళ్లీ తిరిగి నా దగ్గరకే వస్తుంది.

చంద్రమ్మ : ( నవ్వుతూ ) మీరు కావాలనుకుంటే. అయినా అసలు పోతేగా మళ్ళీ రావడానికి! ( కొంటె చూపు )

ప్రసూన : నన్ను పరిహాసం చేస్తున్నావుటే?

చంద్రమ్మ : ( ప్రసూన దగ్గరకు వెళ్లి రెండు చేతులూ ఆమె రెండు చెంపలమీదా ఉంచి ) పిచ్చి ప్రసూనమ్మగారూ! ఏది చెయ్యి జారిపోతున్నదని తెలిస్తే మనకు బాధ కలుగుతుందో దాన్నే మనం ఎక్కువగా ప్రేమిస్తున్నా మన్న మాట!

డున్న మనః స్థితిలో అలా చెప్పిన మాట నిజమే. ఇంతకీ గతం తవ్వుకుంటే వచ్చే ప్రయోజనం ఏమీ లేదు. నీ కెందు కింత దుఃఖం కలిగిందో, నువ్వెందు కింత ఖిన్నురాలివై ఉన్నావో చెప్పడం లేదు. ప్రసాద్ మోసం చేశావని నిందించాడా?

ప్రసూన : హాః! అతన్ని నేను మోసం చేయలేదమ్మా! అతన్ని మరువలేక ఒకసారి చూద్దామని ఉద్యోగ ప్రయత్నం ఏమయిందో కను క్కుందామని అతని గదికి వెళ్ళాను.

దుర్గాంబ : ఒంటరిగానా!

ప్రసూన : ( తల ఊపుతుంది. )

దుర్గాంబ : చాలా తప్పు చేశావు, ప్రసూనా! శాసన రీత్యా నువ్వు విద్యాసాగర్ భార్యవు. అతనితో తెగతెంపులు చేసుకొని ఏ పని చేసినా తప్పు లేదు.

ప్రసూన : ఎంతసేపూ మన క్షేమం సంగతి, సంపద సంగతి తప్ప మనం మానవ హృదయాలతో ఆడుకుంటున్నామన్న సంగతి మరిచిపోతున్నా వమ్మా!

దుర్గాంబ : మనంగా మనం ఆ పని చేయలేదు. అంత కన్నా గత్యంతరం లేకుండా చేసింది మీ నాన్న గారు.

ప్రసూన : మనం ఇద్దరం చదువుకున్న వాళ్ళం. ఆస్తి పోతే పోయిందని ఏ ఉద్యోగమో చేసుకొని జీవిస్తే సుఖం లేకపోయినా శాంతయినా మిగిలేదేమో!

దుర్గాంబ : ( ప్రసూనవంక చూచి ) ఇంత మనః క్షోభ జరగటానికి ఏం జరిగిందే? ప్రసాద్‌కు ఉద్యోగం దొరికిందా?

ప్రసూన : లేదు లక్ష రూపాయలు పెట్టి వ్యాపారం చేస్తున్నాడు!

దుర్గాంబ : లక్ష రూపాయలా! అతని కంత డబ్బె క్కడిది?

ప్రసూన : నే నిచ్చాను.

దుర్గాంబ : నువ్వా! వాడికా, లక్ష రూపాయలా?!

ప్రసూన : అవును.

దుర్గాంబ : నీ కంత డబ్బెక్కడిది?

ప్రసూన : విద్యాసాగర్ ఇచ్చాడు.

దుర్గాంబ : ( నివ్వెరపోయి ) నీ వాటా ధనం నీ కిచ్చేశాడా!

ప్రసూన : ( బాధగా ) లేదు. అతని వాటాలోంచి ఇచ్చాడు.

దుర్గాంబ : ( ఆశ్చర్యంగా ) ఎందు కంత డబ్బుని అడగలే!

ప్రసూన : అడిగాడు. ప్రసాద్‌కు వ్యాపారార్థమై ఇస్తున్నానని చెప్పాను.

దుర్గాంబ : ఆ సంగతి తెలిసీ తన వాటాలోంచి ఇచ్చాడా! కారణ మేమయినా చెప్పాడా?

ప్రసూన : నేను తన్ను చేసుకోవటం వల్ల ఆ ఆస్తి తనదయింది కాని, లేకపోతే అది తనదయి ఉండేది కాదన్నాడు. నాన్న ప్రసాద్‌ను గురించి దురభిప్రాయం పడి ఉంటే ఆ విషయం తెలుసుకొనటానికి ఈ డబ్బిచ్చి చూడటం కన్నా వేరే మార్గం లేదన్నాడు. ఒకవేళ ప్రసాద్ యోగ్యుడని బుజువైతే నా స్వేచ్ఛను నా కిస్తా నన్నాడమ్మా!

దుర్గాంబ : మంచితనంలో స్త్రీ హృదయాన్ని మెరి పెట్టడంలో ఆ మేనమామ పోలికే వచ్చినట్లుంది.

ప్రసూన : మనుష్యుల స్వభావ శీలాలు నిర్ణయించే వద్ధతుల్లో ఆయన పోలికే వచ్చిందేమో!

దుర్గాంబ : అదేమిటి?

ప్రసూన : డబ్బుకోసం ఇష్టంలేని పెండ్లి చేసుకొని నే నతని జీవితానందాన్ని నాశనం చేశాను. నేను ప్రేమించిన వాడు నాకు తగినవాడని తోస్తే, తనకు కైవసమైన నన్ను తన ధనాన్ని, నా సౌఖ్యంకోసం త్యజించటానికి సిద్ధపడ్డాడమ్మా విద్యాసాగర్!

దుర్గాంబ : కొంపతీసి విద్యాసాగర్ నిన్ను నిజంగా ప్రేమించలేదు కదా!

ప్రసూన : ఔదార్యం ప్రదర్శించటానికి ప్రేమించ నక్కరలేదేమో?

దుర్గాంబ : పిచ్చితల్లీ! ప్రేమకాకుండా త్యాగం ఎప్పుడూ ఉండదు ... ప్రసాద్ వ్యాపారం పెట్టాడా?

ప్రసూన : వ్యాపారం ఎలా ఉన్నా పెద్ద ఆఫీసు కొన్నాడు. అందమయిన సెక్రటరీని కుదుర్చు కున్నాడు. ఆవిడతో ప్రతి రోజూ సినిమా లకు వెళ్ళుతున్నాడు. హాయిగా తాగు తున్నాడు.

దుర్గాంబ : ఇవన్నీ నీ కెలా తెలుసు?

ప్రసూన : నే నక్కడినుంచే వస్తున్నాను.

దుర్గాంబ : ప్రసాద్‌ను నేను నిగ్గదీసి అడిగితే తేలి పోతుందిగా — ఆ లక్ష హతమారి ముందే?

ప్రసూన : అదే చాలు.

దుర్గాంబ : కొంపదీసి మీ నాన్న మాట నిజం కాద కదా?

ప్రసూన : అప్పుడు లక్ష రూపాయల నష్టంతో ఇన్ని జీవితాల్ని నాశనం చేసిన నా అజ్ఞానమూ, ! అహంకారమూ పటాపంచలై పోతాయి

దుర్గాంబ : నా అహంకారం ఏనాడో నశించిపోయింది ధర్మరాజు లాంటి భర్తను దిగమింగాను కన్నబిడ్డ సుఖాన్నైనా కాపాడుకుంటే అదే చాలు. ( చంద్రమ్మ రాఘవులు చె పట్టుకొని ప్రవేశిస్తుంది. )

చంద్రమ్మ : అమ్మగారూ, చూడండి! రాఘవు మిల్లులో వైవ్‌కీపర్‌గా వెళ్ళిపోతాడు

దుర్గాంబ : ( నవ్వుతూ ) ఏం! వెళ్ళితే నీ కం కష్టమా!

చంద్రమ్మ : ( కళ్ళనీళ్ళు తుడుచుకుంటుంది. )

దుర్గాంబ : ( రాఘవులు చెవి మెలిపెట్టి ) ఏం వెళతావా! వెళతావా! !

రాఘవులు : ఎల్లను! ఎల్లను! ఇక్కడే ఉంటాను.

దుర్గాంబ : పొండి, ఇక్కడినుంచి జాగ్రత్తగా ఉండం ( వాళ్ళు పిల్లిద్దరికి నమస్కరించి పోతారు

ప్రసూన : మన జీవితాలకంటే వాళ్ళ జీవితమే హాయి ఉంది.

దుర్గాంబ : ప్రేమ ఉంటే అందరి జీవితాలూ హాం గానే ఉంటాయి.

( తెర )

(సశేషం

ప్రాంగణం

చిత్రం—బి. వ్యాఘ్రేశ్వరుడు (వ్యాఘ్రేశ్వర





# తల నొప్పా?
# అనాసిన్

## నొప్పి నివారణకు మేలైనది. ఎందువలనంటే అది బలీయమైనది మరియు సురక్షితమైనది.



ఒలింపియన్ ఫుట్ బాల్ ఆటగాడు నెవిల్ డిసౌజా అనాసిన్ వాడకందారు. 'నేను ఎల్లప్పుడూ అనాసిన్ దగ్గర ఉంచుకుంటాను', అని అతను అంటాడు.

**బలీయమైనది** ఎందువలనంటే ప్రపంచమంతటా ఎక్కువ మంది డాక్టర్లు సిఫారసు చేసే బాధా నివారక పదార్థాలు అనాసిన్ ఎక్కువగా కలిగియున్నది. అందువలననే అనాసిన్ బాధనుంచి సత్వర నివారణ కలిగిస్తుంది.

**సురక్షితమైనది.** ఎందువలనంటే అనాసిన్ డాక్టరు ఇచ్చే మందుల మిశ్రమం వంటిది. మీరు దానిని సురక్షితంగా పిల్లలకు కూడా ఇవ్వవచ్చును. అన్ని మందుల విషయంలో వలె, మీ పిల్లలకు దీని సరియైన మోతాదు కోసం మీ డాక్టరును సంప్రదించండి.

జలుబు మరియు ఫ్లూ వలన కలుగు నొప్పులకు, తలనొప్పి,
నడుం నొప్పి, కండరాల నొప్పులకు మరియు పంటి నొప్పికి బాగా పనిచేస్తుంది.

**అనాసిన్**

**భారతదేశపు ఎక్కువ జనప్రియమైన నొప్పినివారిణి**




Regd. User of TM: Geoffrey Manners & Co. Ltd.

# బాంగ్లాదేశ్

విద్వాన్ విశ్వం

## 6. దిక్కూ మొక్కూ లేని దీనులు

ఒకే గోలగా ఉంది.

ఎటు చూచినా జనం—మగవాళ్ళూ, ఆడవాళ్ళూ, పిల్లలూ.

ఎక్కడి కక్కడ రెం డడుగుల కో సంసారంగా ఉంది.

ఎవరి తట్టా బుట్టా వారి దగ్గతే. ఎవరి కుండా చట్టీ వారి దగ్గతే. ఎవరి పొయ్యి వారిది.

అడుగడుగునా కనిపించే ఆ ముఖాలలో ఒక వైపు దైన్యం, ఒక వేపు సర్వం పోగొట్టుకున్న పేదఱికం; ఇంకొక వేపు తిరిగి తమ తావులకు తాము చేరుకోబోతున్నాం కదా అన్న ఆశ.

అంతా ఆ ఆఫీసు ఆవరణంతా నిండి ఉన్నారు.

అందులో చాలామంది వాకిట మూగి ఉన్నారు.

అది ఒక శరణార్థుల శిబిరం—జెస్పూర్‌లో.

మొదట వీరు భారతదేశం వైపు పయనించినప్పుడు కాందిశీకులు. ఇప్పుడేమో తిరిగి వస్తున్నవారు. ఆంగ్లంలో అప్పుడు రెఫ్యూజీ కాంపులయితే, ఇప్పుడివి రిటర్నీస్ కాంపులు.

వానిలో ఇదొకటి.

ఈ ప్రాంతం నుంచి పోయిన వారందఱినీ ఇటు పంపుతున్నారు.

రోజు రోజూ, గంట గంటా లారీల మీద లారీలు వస్తూనే ఉన్నవి.

ఇలా చాలా కాలంగా వస్తూనే ఉన్నవి.

వీరంతా పాకిస్తాన్ సేన కిరాతకాలకు, రజాకార్ల క్రౌర్యాలకు గుఱి అయిన కుటుంబాలకు చెందినవారు.

ఉన్నదంతా పోతే పోయింది "బ్రతికి యుండిన శుభములు బడయవచ్చు" అని పారిపోయినవారు.

* *

శిబిరం కార్యాలయంలోనికి వెళ్ళడమే కష్టమయింది. ఒకే జనం. అది సాయంకాలం కనుక అంతా తమ తమ బత్తెంకోసం అవస్థపడుతున్నారు.

అంతేకాక వీరిని పంపించే ఏర్పాట్లు చేస్తున్నారేమో, ఎవరికి వారు వచ్చి తమ తమ ఊళ్ళూ పేళ్ళూ నమోదు చేసుకుంటున్నారు.

ఈ కార్యాలయం పనల్లా భారతదేశంలోని శిబిరాల నుంచి ఈ ప్రాంతం వస్తున్నవారిని ఇక్కడ చేర్చడం, తర్వాత వారిని ఆయా సొంత తావులకు పోయే వ్యవహారాలు చూడడం.

రోజూ వేలమంది వస్తున్నారు. అక్కడేమో శరణార్థుల శిబిరం నుంచి బయలుదేరగానే ప్రయాణ భత్యం ( జర్నీ మనీ ) ఇస్తారు. అది పది నుంచి ముప్ఫై రూపాయలదాకా ఉంటుంది.

ఇక్కడ దిగి రేషన్‌లు తీసుకుంటారు. ఏదో ఇంత ఉడక వేసుకొని తిని పడుకుంటారు.

ఈ ప్రాంతాని కంతా ఇదే పెద్ద స్థావరం.

ఇక్కడే రామకృష్ణ మఠం వారు కూడా వీరికి సాయపడుతూ ఒక శిబిరం తెఱచారు.

ఆ కార్యాలయాధికారిని అడిగితే వీరిలో రకరకాల వారూ ఉన్నారన్నాడు.

కొందఱేమో రైతులు. మఱి కొందఱు చేతిపనులు చేసుకొనేవారు. ఇంకొందఱు ఉపాధ్యాయులు వగైరా వృత్త్యుపాధులలో ఉన్నవారు.

వీరు ఉన్నవన్నీ వదులుకొని వచ్చారా మఱి తిరిగి తమ తావులకు పోయినా ఏమిటా అనే సమస్య వారిని వేధిస్తూనే ఉంది.

ఒకామె. ఇద్దఱు పిల్లలూ తానూ ఈ గుంపులో ఉంది. పిలిచి అడిగాము.

పాపం, వెనుకటి సంగతి ఏమి టన గానే కన్నీళ్ళు తిరిగినవి.

తా నేదో బయటికి వెళ్ళింది. హఠాత్తుగా తమ ఇంటిమీద పడి తన భర్తనూ, నలుగురు మఱదులనూ పట్టుకున్నారన్నారట.

భర్తను చంపివేశారు. మిగత వారినీ చంపారనే ఆమె అనుకుంటున్నది.

తిరిగి తాను ఇంటికి వెళ్ళకుండా ఆ పిల్లలను అలాగే పిలుచుకొని భారత దేశం వేపు బయలుదేరింది.

పొలాల్లో అడ్డంపడి నడుస్తున్న జనం కనిపించారు. వారితోపాటు తానూ వెళ్ళింది.

ఎంత దూరమో ఏమిటో ఏమీ తెలియదు. తుదకు భారతదేశంలోని ఒక శరణార్థుల శిబిరంలోకి చేరింది పిల్లలతో.

అక్కడే ఇన్నాళ్ళూ ఉంది. వా రింత తిండీ బట్టా ఇచ్చారు. ఏమవుతుందో ఏమో తెలియదు. ఏదో ఆశతో బతుకుతున్నది.



తన గోడు వినిపిస్తున్న శరణార్థిని

తిరిగి వస్తున్న శరణార్థులు

బాంగ్లాదేశం నుంచి పాకిస్తాన్ సేనలు పోయాయనీ, రజాకార్లను పట్టుకున్నారనీ చెప్తే సంతోషించింది.

ఇప్పుడు మీ దేశం మీరు పోవచ్చునని లారీలో పంపుతుంటే వారితోపాటు తానూ వచ్చింది.

తిరిగి తన పల్లెకు పోతే అక్కడేం మిగిలి ఉంటుందో తెలియదు. ఏమైనా స్వస్థలం పోతున్నది.

అదీ ఆమెకు సంబరంగా ఉంది.

* *

అలాగే మరొకతనిని పిలిచారు వారే.

అతనేమో ప్రక్క ఊళ్ళో ఉపాధ్యాయుడు. ఏదో ఒక పాఠశాలలో చాలాకాలంగా పని చేస్తూ వస్తున్నా నన్నాడు.

ఒకనాటి సాయంత్రం రజాకార్లూ సైనికులూ వచ్చి దాడి చేశారు. ఉన్నపళంగా బయటికి లాక్కొని వచ్చారు.

మొదట ఒక రజాకార్ల దళం క్యాంపులో పెట్టారు. తర్వాత ఇంకో చోటికి మార్చారు.

అక్కడ నానా బాధలూ పెట్టారు. చిత్రహింస చేశారు. ఓ మూల పడవేసి పోయారు పొద్దున చూస్తామని.

కటిక చీకటి. తానేదో గదిలో ఉన్నట్టు తెలుస్తున్నది. స్పృహ వచ్చేసరికి చాలా బాధగా ఉంది.

ఓ ఉద్ధరిణె నీళ్ళు నోట్లో పోసే దిక్కు కూడా లేదే అనుకుంటున్నాడు.

ఏదో కిర్రుమన్నది. తలుపు తీస్తున్న ట్టున్నారు. తిరిగీ తన్ను యమ బాధ పెడతారు కావచ్చు. అయినా చేయగలదేం లేదు. రోటిలో తల దూర్చి రోకటి దెబ్బలకు వెరచీ లాభం లేదు.

ఏదో చీకటిలోనే ఓ ఆకారం లోనికి వచ్చింది. తన్ను సమీపించింది. తన్ను తట్టి ఏదో సైగ చేసిన ట్టయింది. లేచాడు తను.

కడకు ఆ వ్యక్తి ఆకారమే మెల్లగా లేపి బయటికి తీసుకొని వెళ్ళింది. దూరంగా నడిపించుకు వెళ్ళింది.

అక్కడ ఆ ఆకారం ఓ నూనూగు మీసాల యువకునిదని తేలింది.

అతను మెల్లగా చెప్పాడు. "నేను మీ సమాజ విద్యాలయంలో చదువు కొన్నాను. మీ దగ్గర పాఠాలు నేర్చు కున్నాను. శిష్యుణ్ణి" అన్నా డతను.

తనకు గుర్తు రావడం లేదు. కావచ్చు. తన ఉపాధ్యాయ వృత్తిలో ఎందఱికో చెప్పాడు చదువు.

ఇంతకూ తన నెందుకు తెచ్చాడో, ఇత నెలా ఇందులో కొచ్చాడో అదే అడిగాడు తను.

"మన్నించండి. నేనూ రజాకార్నే. ఈ దళంలో వాణ్ణే. మా నాయకుని ఆజ్ఞానుసారం చాలామందిని హింసి స్తున్నాం. అది ఇప్పుడు అవసరమని మావా ళ్ళంటున్నారు. కానీ మిమ్మల్ని గుర్తించాను. గురువుగారిని బాధ పెడుతుంటే చూడలేకపోయాను."

"ఏం లాభం, బాబూ. నా దుర దృష్ట మిది ..."

"చెప్పనివ్వండి. మీరు తిరిగీ ఆ కొట్టులోకి వెడితే పొద్దున్నే మిమ్మల్ని చంపేస్తారు."

"ఇంతకంటే అదే నయం" అన్నాడు తను.

"కాదు. మీరు ఇలాగే పారిపొండి. తెల్లవారేదాకా అటు నడవండి, తిరిగి చూడకండి. మీ వెనకెవరూ రాకుండా నే చూస్తాను" అన్నా డతను.

అలా తను పారిపోయి ఎలాగో, ఎప్పటికో భారతదేశం ప్రవేశించాడు. శిబిరాల్లో ఉన్నాడు. తిరిగి ఇప్పుడు వస్తున్నాడు.

ఇలా తను చెప్పుకొని వస్తుంటే మానవత్వం మనుషుల్లోనే కాదు, దానవుల్లోనూ ఇంకా పూర్తిగా చావలే దనిపించింది.

ఇప్పుడు తాను తిరిగి సమాజ విద్యాలయం వారి దగ్గఱకు పోతాడు. ఇస్తే ఉద్యోగం చేస్తాడు. లేకపోతే ...

* * *

ఇలా అక్కడున్న జనాన్నందఱనూ అడిగి రాసుకోగలిగితే కొన్ని వందలూ, వేలూ కథావస్తువులు దొరుకుతాయి.

అందఱిదీ ఒకే అనద మమగడ. అందఱూ అలాగే బాధలు పడ్డారు, అలాగే పారిపోయారు, అలాగే భారతదేశంలో ఏ పొలంలోంచో ప్రవేశించారు, అలాగే శిబిరాలలో ఉన్నారు, అలాగే తిరిగి వస్తున్నారు.

* * *

ఈలోగా అక్కడికి రామకృష్ణ మఠం యువస్వామి ఒకాయన వచ్చారు.

వారొక శిబిరం నడుపుతున్నారు. వచ్చినవా రందఱికూ దాల్ (పప్పు), మూనె వీరు ఇస్తారు. బియ్యం అధి కారులే ఇస్తారు కదా! అలాగే జబ్బు లున్న వారికి ఏవో ఇన్ని మందు లిస్తారు.

ఆ స్వామి వీరి స్థితి అతి దయనీయంగా ఉందన్నారు. తాము అనుబంధంగా చేస్తున్న సాయం కూడా ఏ మూలకూ చాల దన్నారు. చేయగలిగి నంతా చేస్తున్నా మన్నారు.

ఈ ఒక్క ప్రాంతం నుంచి శరణార్థులు దాదాపు 28 లక్షల మంది భారతదేశంలో ప్రవేశించి ఉన్నట్టు అంచనా.

వారిలో ఇప్పటికి ఇరవై లక్షల మంది వచ్చారు.

మే మక్కడ ఉండగానే బ్రిగేడియర్ దత్తా, ఘోషూ వగైరాలు వచ్చారు. ఈనాటి లెక్క లన్నింటినీ చూచి వ్రాసుకొన్నారు.

వా రన్నారు— మీ రిలా ఇప్పుడు చూచే అంత ఆవేదన పడుతున్నారే, ఇంతకుమునుపు మీరు ఈ ప్రాంతం వచ్చి ఉంటే తెలిసేది.

ఇది విషాద సమయం కాదు. ఇది పునరావాస కల్పన జరుగుతున్న సమయమూ కాదు. సంధి సమయం.

ఇంతకూ వీరి ఇళ్ళలో చాలా వఱకు గుల్ల అయిపోయినవే. పొలాలు పాడు పడినవి. వారు తిరిగి అవన్నీ సర్దుకునేందుకు ఎన్నాళ్ళో పడుతుంది. అంతదాకా వారిని చూచి, వారిని తర్వాతా ఆదుకొనే పనంతా కొత్త దొరతనం పై ఉన్నది. ఎంత భార మది!

కొందఱు వివిధ వృత్త్యుపాధులతో జీవించినవారు, తిరిగీ ఇప్పుడు వాటిలో కుదుటపడాలి కదా?

ఇదో బ్రహ్మాండమైన సమస్య. కోటిమంది శరణార్థులను కొంతకాలం కాపాడిన భారత ప్రభుత్వం ఎంత భారాన్నో వహించింది. ఇప్పుడు ఆ భారంలో చాలావఱకు కొంతకాలమైనా— వారు కుదురుకునేదాకా నైనా—



ఒకే వరుస ట్రక్కులలో వస్తున్న శరణార్థులు

బాంగ్లాదేశ్ ప్రభుత్వం వహించవలసి ఉన్నది.

మరి ఇందు కెంత ధనాదులో అవసరం. అవన్నీ సమకూర్చుకొనడంలో అంతర్జాతీయ సంస్థలు తోడ్పడాలి. ఏవో కొన్ని సంస్థలు తోడ్పడుతున్న విప్పటికే. ఇంకెంతో పాయుపడాలి.

* * *

ఆ శిబిరాలలో ఎందరిను అడిగినా అవే కథలు, అవే విషాద ఘట్టాలు. సరి, ఆ "శనిదేవత రథ చక్రపు టిరుసులలో పడి నలిగిన దీనులనూ" వారినీ చూచి కలతపడిపోయి తిరిగి హోటల్ చేరుకొని ఇంత కడుపున వేసుకొన్న శాస్త్రం చేశాం.

ఇప్పటికి పూర్తికావలసిన పనులను ముగించుకొన్నాం.

జెస్సోర్‌లోని పి. ఆర్. ఓ. శ్రీ కరీం తన వాన్ తెచ్చారు. ఇక మమ్మల్ని తిరిగి పంపడానికి సరిహద్దు దాకా వస్తానన్నారు.

అదెంతో మంచి దనిపించింది. ఇంత దాకా బాటమీద చాలా దూరం ఎక్కడా బాంగ్లాదేశ్‌లో పయనించ లేదు. దారి పొడవునా చూడవచ్చు ననుకున్నాం.

అందరం బయలుదేరాం.

కానీ కొన్ని మైళ్ళు వెళ్ళామో లేదో వాహనం మొరాయించింది. ఇంజను లోనుంచి ఏదో పొగ రావడం ఆరంభ మయింది.

ఆపి అటూ ఇటూ ఏవేవో కదిలించీ, తిప్పీ చూచాడు డ్రైవర్. లాభంలేదు.

ఎవరైనా దారిలో వెనుక నుంచి వస్తారేమో అని చూడగా ఓ మిలిటరీ ట్రక్కు వచ్చింది. వారిని ఆపాం.

వా రంతా ముందువాడు పాకిస్తాన్ మంద పాతర తొలగించే సమయంలో మాకు దారిలో కనిపించినవారే. గుర్తు పట్టారు.

వారూ ఏవో చూచి సరే కదలమని ముందుకు వెళ్ళారు. మేమూ కదిలాం. ఎందుకైనా మంచిదని వారు కాస్త ఆగి మా వెనుకగా రాసాగారు.

మరో మైలుకూడా గడవకనే తిరిగీ వాహనం మొండికెత్తింది.

ఇక లాభంలేదన్నారు కరీంసాహేబ్. ఏం చేయాలి?

అప్పటికి బాగా చీకటి పడింది. ఆ ముందు రెండు రోజులూ ఈ ప్రాంతంలో పెద్దగా వానలు కురిసి నందువల్ల విపరీతంగా చలిగా ఉంది. అదేమో ఏ ఊరికీ దూరమైన అర్థాంతర మార్గం. ఇక్క డేం చేయగలం?

మిలిటరీ ట్రక్కులో వారు ఆపి వచ్చారు. మీ కేం ఫరవాలేదు మాతో వస్తే తీసుకపోతాం అన్నారు.

వారు కలకత్తాలో స్థావరం కల 'ఇంజనీర్స్' దళం.

అదేమో లారీ లాంటి ట్రక్కు. వెనుక కప్పు లేదు. ఆ చలిలో ఏ డెబ్బై మైళ్ళో ఎలా వెళ్ళాలో.

వారు నన్నేమో ముందు డ్రైవర్ దగ్గర కూచుమన్నారు. అంతదాకా కప్పు ఉంది. ప్రక్కన తలుపు లున్నవి. కనుక చలిగాలి వీచే ప్రమాదం లేదు. ఆ గాలికే నా ఒంటిని అప్పజెబితే మరునటి రోజే 'న్యుమోనియా' ఖాయం.

మిగతా వా రంతా పాపం వెనుక వైపే ఎక్కారు — సావి గారుకూడా. బాధే మరి.

అక్కడికీ ముందు కూచున్నా నా శరీర తత్త్వంవల్ల ఓర్చుకోలేనంత చలిగానే ఉంది.

ఆ మిలిటరీ ఇంజనీర్లు చాలా మంది మళయాళీలు, కన్నడిగులు. వా రెంతో ఆప్యాయంగా పలకరిస్తూ తమ కథలు చెబుతూ ఉల్లాసంగా తోడున్నారు.

దారి పొడవునా ముందు నాటి వర్షం వల్ల అంతా నానా రభసగామూ ఉంది బాట. పైగా ఎదురుగా ఒకే లారీల వరుసలు రావడం ఆరంభ మైంది.



ప్రళయం సృష్టికి నాంది




అంతర్జాతీయ సంస్థల సహాయం

# కడుపు సరిగ్గా లేదా?

## వాయువు? కడుపులో ఆమ్లము? గుండెల్లో మంట? అజీర్ణము?



## 2 రెన్నీ నమలండి, సత్వరం కడుపులో హాయిగా వుంటుంది

| కడుపు సరిగా లేక మీరు బాధ పడుతున్నారా? | అవును | కాదు |
|---|---|---|
| 1 భోజనం చేసిన తరువాత ఒకప్పుడు కడుపు నిండుగా ఉన్నట్లు, అసౌఖ్యంగా మీకు అనిపిస్తుందా? | | |
| 2 భోజనం తరువాత మీకు సాధారణంగా నొప్పి వస్తుందా? | | |
| 3 కొన్ని పదార్థాలు మీకు అసౌఖ్యం లేక బాధ కలిగిస్తున్నట్లు గమనించారా? | | |
| 4 మీకు మానసిక బాధ లేక ఆందోళనగా ఉన్నప్పుడు, మీకు కడుపులో నొప్పి వస్తుందా? | | |
| 5 గుండెమంట మీకు రాత్రి నిద్ర లేకుండా చేస్తుందా? | | |
| 6 అధికంగా పొగ త్రాగిన లేక పుగాకు నమిలిన తరువాత మీకు అజీర్ణం బాధ కలుగుతుందా? | | |
| 7 మీకు ఆకలి నొప్పులు కలుగుతాయా? | | |
| 8 అకాల భోజనాలు మీకు నొప్పి కలిగిస్తాయా? | | |
| 9 మత్తు పానీయాలు త్రాగిన తరువాత మీకు మంట వస్తుందా? | | |

మీరు 3 సంఖ్యలకు పైగా 'అవును' అని గుర్తిస్తే బహుశా మీ సమస్య అధికమైన కడుపులో ఆమ్లము అయివుండవచ్చును.

### కడుపులో ఆమ్లము ఏది కలుగ చేస్తుంది?

జీర్ణానికి అవసరమగు ఆమ్లమును కడుపు తయారు చేస్తుంది. కాని కొన్ని కడుపులు అవసరమైన దాని కన్నా ఎక్కువ ఆమ్లాన్ని తయారు చేస్తాయి. ఈ అధిక ఆమ్లము వలననే ఆమ్లము కడుపు, 'అజీర్ణ బాధ' సరాల అజీర్ణ రోగం, గుండెల్లో మంట వంటి బాధలు కలుగుతాయి. ఈ అధికమైన దాన్ని వెంటనే సరి చేయాలి. ఈ సురక్షితమైన సత్వర చర్య కోసం మీకు రెన్నీ అవసరం.

### కడుపులో ఆమ్లమును నివారించుట ఎట్లా?

కడుపులో ఆమ్లానికి అత్యుత్తమమైన నివారిణి సత్వరమై, సౌమ్యమైన చర్య గల ఆమ్ల వ్యతిరేకం—రెన్నీ. రెన్నీ బాధను నిర్మూలించేందుకు అవసరమైనంత ఆమ్లాన్ని మాత్రమే తగ్గిస్తుంది. అంతేకాని జీర్ణమునకు అడ్డు తగిలేటంత మాత్రము కాదు. కడుపు బాధ నుంచి సత్వర నివారణ కోసం 2 రెన్నీ నమలండి. రెన్నీ ప్రపంచమంతటా చాలా మందిచే వాడబడుతోంది.

| రెన్నీ కడుపులో బాధను పోగొట్టుటకు మంచిది ఎందువలనంటే ఆమ్ల వ్యతిరేక మందు చేయవలసిన ఆరు పనులు సవ్యంగా అది చేస్తుంది |
|---|
| 1. రెన్నీ శీఘ్రంగా, నిశ్చయంగా నిమిషాలలో ఉపశమనము నిచ్చును |
| 2. రెన్నీ వాయువు కలుగుటను ఆపును. |
| 3. రెన్నీ సరియైన ఆమ్లతను నిలబెట్టును. |
| 4. రెన్నీ మామూలు జీర్ణ పద్ధతికి అటంకముగా వుండదు. |
| 5 రెన్నీ కడుపు పొర మీద సురక్షితమైన పూత నిచ్చును. |
| 6. రెన్నీ తరచు తీసుకొన్నప్పటికీ, విరేచనములుగాని మలబద్ధకముగాని కలుగచేయదు. |

## 2 రెన్నీ టేబ్లెట్లు మీ కడుపును హాయిగా వుంచును

పిప్పరమెంటు రుచిగల రెన్నీ దగ్గర వుంచుకోండి.

ఒక నికోలస్ (N) ఉత్పాదన

mcm/ni/4 tel

కలకత్తా శిబిరాలనుంచి తిరిగి వస్తున్న శరణార్థుల లారీలే అవి. ఒకటీ రెండూ కాదు, ఒకే వరుస కలకత్తాదాకా వస్తూనే ఉంది.

మరి ఆ బాటేమో చిన్నది. నడుమ నడుమ బాటకు అటూ ఇటూగా ఉండే చిన్న చిన్న పల్లెలూ, కొన్ని బస్తీలూ. ఒకటే రద్దీ.

బండి కదలడం చీమ నడకతోనే.

ఎలాగో నడుమ ఓ బస్తీలో ఆపి అంతా తేనీరు సేవించి తిరిగీ పయనం కట్టి అంగుళం అంగుళం తప్పించు కుంటూ ఎలాగో ముందుకు వెడు తున్నాం.

ఇదిగో సరిహద్దు అన్నారు.

అక్కడో అటూ ఇటూ కట్టిన కుటీరాలు. అందుపై బాంగ్లాదేశ్ జెండా, అధికారులు.

దానికి కాస్త ముందుకు వెడితే అక్కడా అదే మోస్తరు కుటీరం, భారత దేశం జెండా.

అదీ సరిహద్దు.

అందులో దూరి తిరిగీ భారత దేశంలో అడుగు పెట్టాం. మళ్లో ముప్పై మైళ్ళో ఎంతో వెళ్ళగానే కలకత్తా.

కలకత్తా వేపు తిరుగు ముఖమై వెడిపోతున్నాం.

శరణార్థులు బాంగ్లాదేశ్ ముఖంగా వస్తున్నారు.

ఇంతకూ మా ప్రయాణమంతా ఓమారు నెమరువేసుకుంటే, మా పర్యటనం సింహావలోకనం చేసు కుంటే ....

**(ఉప సంహారం వచ్చే వారంతో)**



ఊరిబాటలో...



సీరియల్

# అన్వేషి

ఎ. రాధారాణి

(క్రిందటి సంచిక తరువాయి)

## 10

కావాలనే కొంచెం వెనకపడి నడుస్తున్న గిరిధారి అప్పటికి దగ్గరగా వచ్చాడు. అటుపక్క మొహరీ మీద కూర్చున్నాడు. ఏరు పలచగా పారుతూంది. పెద్ద చెలమలు తీసి నీరు నిలవచేసి బట్టలుఉతుకుతున్నారు రజకులు. పని పూర్తిచేసుకున్నవారు గాడిదలపై బరువు లెక్కించి తిరుగుముఖం పట్టారు. దూరాన పెద్ద బండపై కూర్చున్న వ్యక్తి— సంగీతంవాస్త్రరులా ఉంది— ఎలుగెత్తి ఏవో దరువులు వేస్తూ పాడుతున్నాడు. వంతెన కివతల ఏదో శవం కాలిన బూడిద దూదితో పేర్చిన పడకలా ఉంది. ఆ ఒడ్డున రెండు వరసల్లో శిథిలమౌతున్న సమాధులు. వాటి కివతలి కాలిబాట పక్కన వర్షాకాలంలో శవదహనం కోసం కట్టిన మంటపం. ప్రకృతి సాయంసంధ్యకు ముఖారి రాగాలాపనతో స్వాగతం చెబుతున్నట్లుగా ఉంది.

ఏదో లారీ పెద్ద చప్పుడు చేస్తూ ఆలోచనకు అంతరాయం కలిగించింది. ఎంకన్న ఇంకా ఆ జాగాలోనే కూర్చుని ఉన్నాడు. సంఘం హర్షించని మార్గాన ఈ ప్రపంచంలోకి వచ్చినందుకు తను కర్త కాకపోయినా తనను తనే నిందించుకున్నాడు. ఆ కర్తకు ఈ జీవి ఉనికి తెలుసునో, లేదో?

వెళ్లి ఓదార్చాలని ఉంది. ఏమని?

ఇలాంటి సమాధానం దొరకని ప్రశ్నలు సృష్టిలో ఇంకెన్ని ఉన్నాయో? భూగోళంపై జరిగినంత అభివృద్ధి ఖగోళంపై జరిగిననాడుకూడా ఇవి సమాధానం లేని ప్రశ్నలే!

ఒక రిక్షా పల్లెవేపు పోతూంది. పల్లెలో ఉంటూ రోజూ పట్నం వచ్చిపోయే రిక్షా అతనేమో!

"ఓరే, వెంకా! ఈడ కూసున్నవేంరా?" అని పలకరించాడు.

"ఆఁ! ఏం లే! ఎవరైనా తోడు దొరికితే కలిసి పోదామని!"

"రా! రిక్షా ఎక్కు!"

"నువ్ పోలే!"

"ఓ్రరారా! డబ్బు లడగనులే!"

ఎంకన్న లేని నవ్వు తెచ్చుకుంటూ వచ్చి ఎక్కాడు. రిక్షా సాగిపోయింది. గిరిధారి లేచాడు. మళ్లీ వెనక్కు తిరిగాడు.

ఇంకొక పది గజాల్లో తన నివాసం చేరతాడనగా వెనకనుంచి ఎవరో పేరు పెట్టి పిలవటం వినిపించింది.

తిరిగి చూస్తే నవనీతకృష్ణ. కాంపౌండు గోడమీది నుంచి అతని తలా భుజాలూ మాత్రం కనిపిస్తున్నాయి.

"మిమ్మల్నేనండీ, మహానుభావా! ఏమి టలా కలలో లాగా నడిచిపోతున్నారు పిలిచినా వినిపించుకోకుండా!"

గిరిధారి నవ్వుతూ అతన్ని సమీపించి గోడమీది నుంచే కరస్పర్శ చేశాడు.

"రండి! లోపలికి వచ్చి మా ఇల్లు పావనం చేయండి!"

"ఇప్పుడా!"

"ఏం?"

"ఏం లేదు. బాగా చీకటి పడింది. వెళ్లి దీపం వెలిగించాలి!"

"ఊఁహూఁ! అంత బలమైన కారణం కాదు." చేయి వదలలేదు కృష్ణ.

"రేపు! రేపు తప్పక వస్తాను."

"మరొక వాగ్దానం!"

గిరిధారి నవ్వి, "వస్తానుగా?" అని నమ్మబలికాడు. కృష్ణ చేయి వదిలాడు. "సరే! వెళ్లిరండి!"

తన గదికి వచ్చి గిరిధారి చేసిన మొదటి పని దీపం వెలిగించటమే. దీపానికి నమస్కరించి పూర్తిగా రాని శ్లోకం చదువుతూ గదిలో దీపం వెలిగించాడు ఈ పూట ఇదమిత్థమని, స్థిరత్వంలేని ఆలోచనలు మనసును చీకాకు పరుస్తున్నాయి. బ్రతుకుబాటను మార్గా లనుకుని సాగిన తను దారి తప్పిన బాటసారి కాలేదు కద? అర్థంకాని వ్యథతో, అనుభవానికి దూరమైన శాంతి కోసం అన్వేషిస్తూ తా నెక్కడి సాగిపోతున్నాడు? ఏది తన మార్గం? ఎక్కడికి తన పయనం?

గేటు దాటి లోనికి రాగానే కనిపించేవి అటూ ఇటూ ఉన్న పది పన్నెండు కొబ్బరిచెట్లు, గోడవారగా రకరకాల పూలమొక్కలు, దారికి రెండు వైపులా ముద్ద బంతిచెట్లు, వాకిలి ముందు పందిరి, దానికి దట్టంగా అల్లుకున్న బటాణీతీగలనుంచి తోరణాల్లా కట్టి వేలాడుతున్న రెండు రంగుల పూలగుత్తులు. ఇది నవనీత కృష్ణ ఇంటిముందు ఆవరణలో గల చిన్న తోట తాలూకు సమగ్ర స్వరూపం. ఇంకా ఏపుగా పెరు గుతున్న, విరబూస్తున్న [illegible] మొక్క లున్నాయి.

"బాగుంది" అన్నాడు వాకిలి అరుగుపై ఉన్న బల్ల మీద కూర్చోబోతూ.

"ఏమిటి బాగుంది? లోనికి రండి! మిమ్మల్ని బయటివారిని బయటనుంచే సాగనంపటానికి గాదు పిలిచింది?"

"మరెందుకు? ఎక్కడైతేనేం లెద్దురూ!"

"ఫర్వాలేదు, రండి, సార్! మొహమాట పడకండి! మనం స్నేహితులం."

దగ్గరకు వచ్చి లేవదీశాడు. ఇంక తప్పదని లేచాడు గిరిధారి.

లోపల హాలు! ఒక పెద్ద బల్లమీద రేడియో! దానిమీద ఏవో పత్రికలు, పుస్తకాలు. వాటిల్లో కొన్ని తన దగ్గరినుంచి వచ్చినవి. గదిమధ్యలో పెద్ద గుండ్రని బల్ల. దానిచుట్టూ ఆరు పేముకుర్చీలు హాలులోనుంచి లోపలకు వెళ్లే గది కటూ ఇటూ రెండు అద్దాల బీరువాలు. ఒక దానిలో భారత భాగవతాది గ్రంథాలు. మరొకదానిలో దశావతారాల మట్టిబొమ్మలు మొదలుకొని, గాజు పింగాణిబొమ్మలూ, సముద్రపు చిప్పలవరకూ ఉన్నాయి. హాలు కుడి ఎడమలుగా గదులూ, వాటి పరదాలూ!

గిరిధారిని హాలులో కూర్చోబెట్టి లోనికి వెళ్లాడు కృష్ణ. అతను గోడమీది ఫొటోలనూ, ఫ్లవర్‌వాజ్‌లనూ చూడసాగాడు. అలా చూస్తూ ఉండగా ఒక ఫొటోపై అతని దృష్టి ఆగిపోయింది. అందులో ఉన్నది కీర్తిశేషుడైన గృహమేధి కావచ్చు. కృష్ణ ఛాయలు పుష్కలంగా కనిపిస్తున్నాయి. రంగుల ఎన్లార్జిమెంటులో రీవిగా వెలిగిపోతున్నాడు.

కృష్ణ ఇంకా రాలేదు. పరిచయం కాకముందే అవమానించినందుకు ఎదుట పడబోతున్న అపర్ణకు ఎలా క్షమాపణలు చెప్పుకోవాలో మననం చేసుకుంటూ కూర్చున్నా డతను.

## 11

"ఎవరు, బాబూ!"

స్వరం వినిపించినవైపు చూశాడు. ఆమె వయస్సెంతో తెలియకుండా ఉంది. కాని ప్రౌఢ వయస్సు దాటిందని ఉజ్జాయింపుగా సరిపెట్టుకోవచ్చు. కొస్త పొట్టిగా, లావుగా, ఎర్రగా ఉంది దామె. కొద్దిగా [illegible] ముడుకలు ముద్దుమొహం. అందమైన పెద్ద కళ్లు. వాటిలో ఏవో నిగూఢ రహస్యాలు. [illegible] కొంత లంతర్యుద్ధముంచి అనిపించే [illegible] భావాన్ని ప్రతిఫలింపజేస్తున్నాయి. సందేహం లేదు. ఆమె సౌందర్యవతి. ఇప్పుడే ఇలా ఉంటే వయసులో ఇంకా ఉండేదో?

"నా పేరు గిరిధారి! నవనీతకృష్ణగారితో వచ్చాను."

"అలాగా! ఏడీ వాడు?" స్వరంకూడా విన సొంపుగానే ఉంది.

"లోపలికి వెళ్ళారు."

"మంచినీళ్ళు కావాలా?"

"ఇప్పించండి."

ఆమె తెచ్చి ఇచ్చింది. "మీరు. . .?" గ్లాసందుకుంటూ అడగబోయి అర్థోక్తిలో ఆగిపోయాడు.

"ఈ పిల్లల తండ్రి నాకు బావగారవుతారు. తల్లిపోయిన దగ్గరినుంచీ నేనే వీళ్ళని పెంచాను. నేను వచ్చే నాటికి కృష్ణకు ఊహ తెలుస్తోంది. అపర్ణ ఇంకా చిన్నపిల్ల. ఆయన దాటిపోయాడు" అంటూ కళ్ళు చెంగుతో అద్దుకుని తిరిగి అన్నది: "బాధ్యత నా నెత్తిని పడింది. చూస్తూ వదిలి వెళ్ళలేకపోయాను."

'ఏమి టీమె ఇలా చెబుతుంది తొలి పరిచయంలోనే' అనిపించింది. ఇంటి కెవరు వచ్చినా వారి దృష్టిలో తన హక్కునూ, స్థానాన్నీ బలపరుచుకొనేందుకా?

"మీ కే ఉద్యోగమూ లేదుటగా? ఒంటరిగా ఇక్కడెందుకున్నట్టు, నాయనా? పెద్దదాన్ని! ఈలా అడిగానని ఏమీ అనుకోకు."

ఆప్యాయంగా, చొరవగా ఎంత తేలిగ్గా అడిగేసింది!

తనను తొలి పరిచయంలోనే, కాదు, అసలు ఈ ఊరు వచ్చాక ముఖాముఖిగా ఈ ప్రశ్న అడిగిన తొలి వ్యక్తి ఈమె. 'దయ ఉంచి నా విషయాలేమీ అడక్కండి! నా పేరు గిరిధారి! అంతకుమించి ఇంకేమీ చెప్పలేను.' పెదవులదాకా వచ్చిన ఈ మాటలను అతను నోరు తెరిచి అనలేకపోయాడు. ఇంతలో నవనీతకృష్ణ, అతని వెనకాలే అపర్ణ ప్రవేశించారు.

కాంతమ్మగారు చప్పున గిరిధారి ఖాళీ చేసిన గ్లాసందుకుని వెళ్లిపోయింది.

"మీ రిద్దరూ పరిచయస్థులే! మిమ్మల్ని ప్రత్యేకించి పరిచయం చేయ నవసరం లేదు" అని గిరిధారి వంక తిరిగి, "నేను ఆలస్యం చేశానా? అదే జరిగితే అందుకు సంజాయిషీ ఇచ్చుకోవలసింది నువ్వే, అపర్ణా" అన్నాడు.

అపర్ణ ఒక్కమారు చురుగ్గా అన్నవంక చూసింది. మరుక్షణంలో ప్రసన్నవదన అయి తన తామరతూండ్ల లాంటి చేతు లెత్తి నమస్కరిస్తూ అతని కెదురుగా ఉన్న కుర్చీలో కూర్చుంది.

అతను చేతులు జోడించాడు.

నల్లగా, పొడుగ్గా కనిపించే అపర్ణ అందమైనదే ననిపిస్తుంది. కురులకూ, కనుబొమలకూ మధ్యగల జాగా చాలా తక్కువ. కత్తుల్లాంటి కనుబొమలు. వాటిక్రింద చేపల్లాంటి నయనాలు. అవి ప్రసరించే దృష్టి ఎదుటివారి మనస్తత్వాన్ని ఎక్స్-రే తీస్తూందా అనిపిస్తుంది. ఆమె ఆకారం ఆమె కింకా వల్లెవాటులే బాగుంటాయనిపిస్తే, ఆమె కదలికలు, చూపులు, ముఖభంగిమలు ఎంతో పెద్దరికాన్ని వ్యక్తం చేస్తాయి. అంత పెద్ద చీర ఆమె శరీరానికి కట్టుకున్నట్లు లేదు. చుట్టుకున్నట్లుగా ఉంది. తెల్లని చీరమీద గోధుమరంగు వలయాల అద్దకం. అవి రకరకాల సైజులు. ఆ చీరలో ఆమె నాగకన్యలా ఉంది.

"నా సంగీతం మిమ్మల్ని బాగా విసిగించింది." 'దాడి ప్రారంభించింది' అనుకున్నాడు. కాని ఆ స్వరం పాట పాడినట్లుగా, వీణ మీటినట్లుగా ఉంది. కొందరు మాట్లాడితే పాట పాడిన ట్లుంటుందని వినటమేగాని స్వానుభవంలో ఇంతవరకూ ఎదురవలేదు.

"ఆ విషయం మాత్రం ఎత్తవద్దు. మీకు బాధ కలిగించాను నేను. ఇలా ప్రారంభిస్తే ఎన్ని మాటలైనా చాలవు."

"వద్దులెండి! మీరు రావటం చాలా సంతోషంగా ఉంది. మీరు చాలా మంచివారని అన్నయ్య చాలా చెప్పాడు."

"ఇంత కొంచెం పరిచయంతో న న్నంత మంచివాడిని చేయుటం కేవలం ఆయన మంచితనం. పైగా చూడక ముందే మిమ్మల్ని అవమానించాను."

"న న్నా విషయం ఎత్తవద్దని మీరే ఎత్తుతున్నారే?" అంటూనే కిలకిలా నవ్వింది అపర్ణ.

వెంటనే గిరిధారికి మాట దొరకలేదు. ఒక వెర్రి నవ్వు ప్రదర్శించి ఊరుకోబోయేటంతలో కృష్ణ అందుకున్నాడు.

"నే నెవరినైనా సరే! ముఖం చూసి స్వభావం చెప్పేస్తా నంతే!"

"గోముఖవ్యాఘ్రాలూ, పయోముఖ విషకుంభాలూ— ఇలాంటి మాటలు మీరు వినలేదా?"

ఈ మారు కృష్ణకన్నా ముందు అపర్ణ అందుకుంది.

"సరే, పోనివ్వండి! మిమ్మల్ని గురించి మే మింత త్వరగా ఒక నిర్ణయానికి వచ్చాం. మీరు మా గురించి నిదానంగా అంచనాలు వెయ్యండి!సరేనా?" అన్న దామె.

ఆమె ఆ విధంగా మాట్లాడటం గిరిధారి కానందా న్నిచ్చినా ఈమెతో మాటలు జాగ్రత్తగా తూచి వాడాలని తెలుసుకున్నాడు.

ఇందాక వాయిదా వేసిన వెర్రినవ్వు ఇప్పుడు వాడక తప్పలే దతనికి.

"ఇప్పుడే వస్తాను" అంటూ లోనికి వెళ్లిం దామె.

"మీ నాన్నగారు పోయి ఎన్నాళ్ళైంది?"

"అయిదు సంవత్సరాలు." తండ్రి చిత్రంవంక చూస్తూ అన్నాడు కృష్ణ.

"వ్యవసాయం పనులు మీరే చేయిస్తారా?"

"అవి చేయించడాని కో సూపర్‌వైజర్ ఉన్నాడు. నే నలా డైరెక్షన్స్ ఇస్తూ ఉంటా నంతే! పంటల కాలంలో మాత్రం స్వయంగా కల్పించుకుంటాను. మిగిలిన కాలమంతా వాళ్ళపై ఆధారపడి ఆ కాస్తలో అనుమానించినట్లు కనిపించటం మంచిది కాదంటుంది అపర్ణ!"

పేకముక్కలు పరిచినట్లు డిజైనున్న ట్రేలో మూడు కాఫీలు తెచ్చింది అపర్ణ. టేబుల్‌పై పెట్టి అన్నకొకటి, అతని కొకటి స్వయంగా అందించింది.

"అవునండీ! మన శ్రద్ధాసక్తులు మొదటినుంచీ ఒక్క తీరుగా ఉంటే మనకూ, మననుబట్టి వాళ్ళకూ మర్యాద. ఒక ప్రత్యేకించిన సమయంలోనే మన జాగ్రత్తలు మనం కనపరిస్తే వాళ్ళ జాగ్రత్తలు వాళ్ళు అంతకుముందే పడతారు. ఏమంటారు?"

"తార్కికంగా మీరు చెప్పింది నిజమే! కాని వ్యాపారానికి బాగా వర్తిస్తుంది. వ్యవసాయం ఋతువుకు సంబంధించినది. ముందు కాలమేమోగాని ఇప్పటివరకూ

భూస్వాములు పంటల రోజుల్లో మాత్రమే జాగ్రత్త పడుతున్నారు."

మాట్లాడటాని కేమీ తోచనట్లు ఆమె తన గోళ్ళు పరిశీలించుకోసాగింది. కాలి బొటనవేలితో ఆమె నేలపై అర్ధవృత్తాలు గీస్తూంటేక దిలే కుచ్చెళ్ళలో నాగుపాము మిలమిలలు స్ఫురించా యతనికి. ఈమెను చూస్తూంటే ఊరికే పాములు తలపు కొస్తున్నా యెందుకో!

ఇంతలో కాంతమ్మగారు వచ్చి ట్రే, కప్పులూ తీసుకెళ్ళబోతూంటే అపర్ణ అన్నది: "అదేమిటి, పిన్నీ, రంగడు లేడూ?"

"బజారు కెళ్ళాడు."

"వచ్చాక తీస్తాడుగా!"

"ఎప్పటి కొస్తాడో ఏమో! అయినా ఇంతలో ఏమైందని?" అని సమాధానం కోసం ఎదురుచూడకుండా వెళ్ళిపోయిం దామె.

"మా పిన్ని పాతకాలపుది. అపర్ణకు అంతా సిస్టమేటిక్‌గా ఉండాలి."

అపర్ణ అన్న వంక చూసి, "ఇటువంటివి నేను సహించలేను. అందులో ఎవరైనా అతిథు లున్నప్పుడు" అన్నది.

కాంతమ్మగారు చిన్న వెండిప్లేటులో వక్కపొడి తెచ్చింది. అది బల్లమీద పెట్టి అపర్ణ కేసి తిరిగి, "నీ దృష్టిలో ఇది నేరం కాదనుకుంటాను" అన్నది.

అపర్ణ ఆమెకేసి నవ్వుతూ చూసి, "నాకు నీ వేది చేస్తే ఇష్టమో, ఏది చేస్తే అయిష్టమో నీకు బాగా తెలుసు, పిన్నీ! ఇంకేం చెప్పను?" అన్నది.

కాంతమ్మగారి ముఖం క్షణకాలం రోషంతో మండిపోయింది. ఆ తరవాత తెచ్చిపెట్టుకున్న చిరునవ్వుతో గిరిధారివంక చూస్తూ, "ఏమీ అనుకోకు, నాయనా! నేను పాతకాలపుదాన్ని! మా ఇంటి పని మేము చేసుకోవటం చిన్నతనంగా అనిపించదు నాకు! అపర్ణ నన్నిలా ఎప్పుడూ మందలిస్తూనే ఉంటుంది. మా కిది కొత్త కాదు" అన్నది.

"ఇందులో అనుకోవడాని కేముందండీ!" అన్నా డతను. బయటి కలా అన్నాడే కాని అతనికీ వాతావరణం అస్తిమితంగానే ఉంది. సెలవు తీసుకుని వెళ్ళిపోవటానికైనా సందర్భం మారాలి. ఆ అదను కోసం నిరీక్షిస్తున్నా డతను.

"పిన్నీ! కార్తీకమాసం పూర్తి కావస్తోంది. వన భోజనాల మాటే మరిచిపోయాం మనం. మన తోటలో ఊరంతా పబ్బం గడుపుకుంటూ ఉంటే మన కా ముచ్చట తీరే రోజు మాత్రం వెనకడుగేస్తోంది."

"నిజమే. సరిగ్గా గుర్తు చేశావు? ఎప్పుడు వెళదా మన్నయ్యా?"

"చెప్పనా! ఏం పిన్నీ, నా మాట ఖాయమేగా! అపర్ణా! చెప్పేస్తున్నాను. నేను చెప్పే రోజు కుదరకపోతే ఇంక నేను రానేరాను."

"చెప్పవయ్యా, స్వామీ!"

"వచ్చే ఆదివారం. ఒక్క స్నానాలూ, ఉదయం టీవరకూ మాత్రమే ఇంటి దగ్గర! తరవాత అంతా—అంటే సాయంత్రంవరకూ తోటలోనే మకాం."

ఆడవా ళ్ళిద్దరూ మాట్లాడలేదు.

"గిరిధారిగారుకూడా మనతో వస్తారు" అన్నాడు కృష్ణ.

"తప్పకుండా! అన్నట్టు, అన్నయ్యా, కస్తూరి కూడా" అంటూ గిరిధారివైపు చూసి, "అసలు మీరు మాకు కస్తూరివల్లనే పరిచయం. అదొక అడివిగొడ్డు! నాలు గక్షరం ముక్కలు చెప్పాలని ఎంత ప్రయత్నించానో—మీ మాటంటే గురి! మీ రైనా చెప్పి చూడండి!" అంది అపర్ణ.

గిరిధారి ఊహలో కస్తూరి భవిష్యత్తు తళుక్కున మెరిసినట్లైంది. "నిజమే. కస్తూరికి కొంత విజ్ఞానం అవసరం" అని ఒప్పుకున్నాడు.

ఆ తరవాత కొంతసేపటికి అతను సెలవు తీసుకున్నాడు. ఆదివారం ప్రోగ్రామ్ విషయంలో అన్నా చెల్లెళ్లిద్దరూ అతని దగ్గర గట్టి మాట తీసుకున్నారు.

## 12

కస్తూరికి మీ మాటంటే గురి— మీరైనా ప్రయత్నించండి!— అని అపర్ణ చెప్పిన తరవాత గిరిధారికి కస్తూరిని గురించిన జిజ్ఞాస అధికమైంది. నిజంగా ఆమె తనకు తగినట్టే దొరికింది. తనీమధ్య ఆమెను బాధపెట్టాడు. ఆమె కాస్త తప్పుకుంటే— ఇంత మంచిమనిషి దొరకటం కష్టం. అంత శ్రద్ధాసక్తులతో మరొకరు చేయలేరు. తనలాగే ఆమె ఏకాకిని. భర్త వదిలిపోయాడు. జీవితమంతా ఎలా గడుపుతుంది? మరొకడిని ఎన్నుకుని మరొక దారి చూసుకునే తత్త్వం కాదు. ఆమెలోని అందమూ, ముగ్ధత్వమూ చూసిన వాడి మనసులో సంచలనం రేగక మానదు. తన స్థానంలో మరెవడున్నా ఆమెను వదిలేవాడు కాదు. ఆమె జీవితం అంధకారం కావటం క్షణం పట్టదు. తరవాత భర్త వచ్చినా ఏలుకోడు. ఆమె జీవితం గడ్డిపూవులా ముగిసి పోతుంది.

అలా కాకూడదు. అలా అనుకుంటే సరిపోదు. తనను తాను నడిపించుకోగల విజ్ఞానమూ, సంస్కారమూ కావాలామెకు. కేవలం సంస్కారిణి అయినంతమాత్రాన స్త్రీ జీవితం స్వార్థపరుల స్వార్థానికి బలి కాకుండా ఉద్ధరింపబడుతుందా? అంటే అది వేరు విషయం. కనీసం కొన్ని విషయాలలోనైనా ఆమె జాగ్రత్తగా మంచి చెడ్డ లాలోచించుకో గలుగుతుందిగదా!

ఇప్పు డామె జీవితాని కేం లోటు? ఇలా అంట్లు తోముతూనా? ఇదీ ఒక జీవితమే! తన మాటేమిటి? ఆమెకన్నా ఎక్కువగా తను సాధించి గెలుస్తున్న దేమిటి? నిజానికి ఆమెను గురించి ఆలోచించటానికి తనకేం అధికారముంది? జీవితంలో తనకు తా నేమీ చేసుకోలేని తను మరొకరి జీవితా న్నుద్ధరించాలని ప్రయత్నించటం ఎంతవరకూ న్యాయం? అది వేరు విషయం. అందరి జీవితాలూ ఒకే సమాంతర రేఖలపై పయనించటం లేదు.

కస్తూరికి చదువు చెప్పాలి. ఆ నిర్ణయంతో బజారుకు వెళ్లి పలకా, బాలశిక్షా కొని తెచ్చాడు.

"ఆదేం టయ్యగారు పలకా, బలపం తెచ్చా రెందుకు?"

"నీ కోసమే."

ఆమె నిరగబడి నవ్వింది.

"నవ్వులు కాదు. నీవు వ్రాయటం, చదవటం నేర్చుకోవాలి!"

"పంతులమ్మను చేస్తారా నన్ను?"

"ఒకరు చేసే దేమిటి? నీవే అవుతావు: రేపు నీ మొగుడు ఉత్తరం రాస్తాడనుకో! చదివించుకోవడానికి ఎవరి దగ్గరకు పరుగెత్తుతావు?"

"మీరు లేరూ?"

"నేను వెళ్లిపోతే..."

"అపర్ణమ్మగారు..."

"ఆమె అత్తారింటికి వెళ్లదూ!"

"వెళ్లదు!"

"ఏం?"

"ఆమె కసలు ఆ ఆలోచనే లేదు."

"నీతో చెప్పిందా?"

"ఊఁ"

"ఏమని?"

"కస్తూరీ, మీ అయ్యగారికి పెళ్ళైందా? అని అడిగింది. నా కేం తెలుసమ్మా? అయినా ఆయనకూ మీ లాగే పుస్తకాలంటే చాలు, మరేమీ అక్కర్లేదు అని చెప్పాను. ఎందుకొచ్చిన పెళ్లిలేవే! చేసుకోకపోతే నేం? అన్నది."

"అసలు పుస్తకాలంటే నీ కింత కోప మెందుకు?"

"అవ్వుంటే మీరు ఇంతలివాళ్ల గొడవ పట్టించుకోరని?"

"పిచ్చివాగుడుమానేసి బుద్ధిమంతురాలిలా చదూకో." లాలనగా పదేళ్ల పిల్లకు చెబుతున్నట్టు అన్నా డతను.

"ఆయమ్మ చెప్పింది—ఇక మీరు! ఆఁ అన్నట్టు విన్న ఎళ్లారుగా! తెలిసిందిలెండి! ఇది ఆమెగారి ఉపదేశమే!"

"నేను చెప్పినట్టు వింటే వెళ్ళేటప్పుడు వెంట తీసుకెళతాను."

"నిజంగానా!" ఆమె కళ్లు సంతోషంతో మెరిశాయి. "ఎప్పుడు వెళదాం?"

"నీ చదువు పూర్తి అయ్యాక."

"అయితే చదువుకుంటాను."

అతను నవ్వుతూ పలకమీద అక్షరాలు వ్రాసి ఆమె కిచ్చాడు.

## 13

ఆదివారం ఉదయమే వచ్చి గిరిధారిని మరో గంటకల్లా సిద్ధంగా ఉండమని హెచ్చరించి వెళ్లాడు కృష్ణ. ఆ గంట తరవాత తనే వచ్చి అతన్ని తీసుకు వెళ్లాడు.

కాంతమ్మగారు ఒక పేముబుట్టలో ఏవేవో సర్ది తెచ్చి హాలులో పెట్టింది. అపర్ణ ఒక సూట్‌కేసు తెచ్చి టేబుల్‌మీద పెడుతూ గిరిధారిని చూసి మందహాసం చేసింది.

అప్పుడే తలంటి పోసుకున్నట్లుంది. ఆరీ ఆరని జుత్తు పాయలు పాయలుగా వీపుపై పరుచుకుని ఉంది.

"వచ్చారా? మీ కోసమే చూస్తున్నాం" అం దామె. తెల్లని చీర, చెవులకు పెద్ద పెద్ద రింగులు. దోసగింజంత తిలకంబొట్టూ, కాటుకా.

"రండమ్మాయిగారూ! చిక్కు తీస్తానిప్పుడే! ఆనక మరీ బిగిసిపోతుంది" అంటూ దువ్వెనతో వచ్చింది కస్తూరి.

"ఇప్పుడా?"

"మరి. . . అలాగే విరబోసుకుని వస్తారా! ఎంత సేపు! చిటికె పని" అంటూ అపర్ణను తీసుకుని వచ్చి కూర్చోపెట్టింది. నిడుపాటి వెంట్రుకలు. ఆమె కుర్చీలో కూర్చుంటే చివరలు నేల కానుతున్నాయి. కస్తూరి పని ప్రారంభించింది.

అప్పుడే హాలులోకి వచ్చింది కాంతమ్మగారు.

"అపర్ణా! నీ కీ నడిహాలుతప్ప తలచిక్కు వదిలించు కోవటానికి వేరే తావు దొరకలేదా ఇంత ఇంటిలో" అంది.

అపర్ణ 'ఫిలిప్స్ ఫేర్' తిరగేస్తూ జవాబుకూడా ఇవ్వ లేదు.

"ఏ మమ్మగారూ?" అంది కస్తూరి.

"నీ కైనా బుద్ధి లేకపోయిందే, కస్తూరీ! నే నంటే అన్నదాన్ని లవుతాను. చూస్తూ ఊరుకోలేను."

కృష్ణ గిరిధారివంక చూస్తూ, "మీరు మా ఇల్లంతా చూడనేలేదు గదూ? రండి! చూపిస్తాను" అంటూ లేచాడు.

మారుమాట్లాడకుండా లేచా డతను.

గదులూ, ఇంటిచుట్టూరా తిరుగుతూ అరగంట గడిపేశారు. ఆ తరవాత కస్తూరి వచ్చి, "అంతా అయింది, కిష్టయ్యగారూ. రిక్షాలు పిలవమంటారా?" అన్నది.

"రిక్షాలా? మీరు రిక్షాలో రండి! మేము నడిచి వస్తాం" అన్నాడు కృష్ణ.

"మీ ఇష్టం! పెద్దమ్మగారు రెండు రిక్షాలు తెమ్మన్నారు" అంటూ వెళ్లింది.

● ● ●

ఆ తోట ఊరుకు మైలు దూరంలో ఉంది. కాని ఆ మధ్య జాగాలోకూడా కొత్త కొత్త ఇళ్ళు వెలుస్తున్నాయి. మరికొన్ని ఇళ్లకు తోట ఊరి బయట ఉన్న ట్టనిపించదు.



## జరిగిన కథ

**రాధారాణికి ప్రయాణంలో ఒక చిత్రమైన వ్యక్తితో పరిచయం అయింది. అతడు గిరిధారి. అపర్ణ కథ చెప్పడం ప్రారంభించాడు ... నిరుద్యోగి గిరిధారి. పనిమనిషి కస్తూరి. దిక్కులేని కస్తూరి గిరిధారికి తోడునీడ అయింది. అయినా తాను కేవలం పనిమనిషిని అన్న వ్యథ కస్తూరికి ఉంది. విశ్రాంతికి భంగం కలిగి ఇల్లు మార్చాలనుకొన్నాడు గిరిధారి. అపర్ణ సహాయం మూలంగా ఆ ఇబ్బంది లేకుండా పోయింది అపర్ణ అన్న కృష్ణతో గిరిధారికి పరిచయం అయింది.**

కొబ్బరి, మామిడి, అరిటి, సపోటా, నిమ్మ, నారింజ వగైరా చెట్లన్నీ ఉన్నాయి. రెండు వందల గులాబీ చెట్లు, రకరకాలవి, రంగురంగుల చేమంతులతో నేత్ర పర్వంగా ఉంది. నూతికి కరెంటు మోటారు. అక్కడి నుంచి తోట నలుదిక్కులకూ సిమెంటు కాలువలే ఉన్నాయి. మధ్యగా ఒక ఔట్‌హౌస్ ఉంది. మూడు గదులూ, వాటికి వెనకా ముందూ వరండాలూ ఉన్నాయి. కరెంటు సౌకర్యం ఉంది.

అంతా సుమారు పదిహేనెకరాలు ఉంటుంది.

"రకరకాల చెట్లు సమానంగా ఉండబట్టి కంట్రాక్టు దగ్గర ఇబ్బంది వస్తోంది" అన్నాడు కృష్ణ.

"ఏమిటి?" అనడిగాడు గిరిధారి.

"సంవత్సరం పొడుగూతా ఇక్కడ ఉండి చూసుకునే వారు దొరకాలి. అదే మామిడితోట అయితే సీజన్ బట్టి ఒత్తిడి. పోటీలు పడుతూ వస్తారు."

"నాన్నగారు పొరపాటే చేశా రీ విషయంలో. రకాని కొక చెట్టు మిగిలినవి వేసి మొత్తమంతా మామిడితోట వేయవలసింది" అన్నది అపర్ణ. కాంతమ్మగారూ, ఆ వెనకే కస్తూరీ వస్తున్నారు.

"నాన్నగారు పొరపాటు చేశారంటున్నావా, అపర్ణా?" కాంతమ్మగారు నొచ్చుకుంది. "ఆయన ఎంత ముందు చూపు మనిషి! ప్రతిదీ చక్కని ఏర్పాట్లు చేశారు. అన్ని రకాల చెట్లు ఉండబట్టే నెలజీతం వచ్చినట్లు ఆదాయం వస్తోంది. అంతా ఒకే మామిటితోట అయితే ఎన్ని ఇబ్బందులు— పూత రాలటం, గాలి దుమ్ములు, కాస్త నష్టం వస్తుందనిపిస్తే బయానాలు వదులుకుని పోయే బేరగాళ్లూ..."

"అవు, పిన్నీ. ఆయనగారు సరిగానే చేశారు." విసుగ్గా అంది అపర్ణ.

ఎక్కడి కక్కడికి బాట లున్నాయి. ఆ దారిన నడుస్తున్నారంతా. అందరి వెనకగా నడుస్తున్నాడు పోతరాజు. అతను నూతిదగ్గరలోనే ఒక చిన్న చవురిల్లు వేశాడు. అందులోనే కాపురం. తోట పాలికి తీసుకున్నాక పోతరాజు ఊరివారి బట్టలు ఉతకటం మానేశాడు. నవనీత కృష్ణ ఇల్లుమాత్రమే చేస్తున్నాడు. రైలు స్టేషను దగ్గర ఒక పళ్లదుకాణం తెరిచాడు. తోటలో ఒక దిక్కుగా కూరగాయల మళ్ళు పెట్టాడు. మంగాలు లేవలేకుండా ఉందిట.

"కిష్టబాబుగారూ! సంగీతమయ్యగారికి నికరమైన తావు దొరకలేదంట. ఒంటిగాడు. తమరు 'సరే'నంటే మన తోట ఇంట్లో ఒక గది. . ." అంటూ నీళ్లు నమిలాడు.

"నా దేం లేదు, పోతరాజూ! ఇదంతా అమ్మాయిగారి ఎస్టేటు. ఆమెగారి నడుగు."

"ఏమిటి, పోతరాజూ? మంగాలు సంగీతం కాదే ఇంకా" అంది కస్తూరి.

"ఊరుకో, కస్తూరీ! పెద్దోరిదగ్గర ఏమి టా పెతురు!"



వనస్థలి దృశ్యం
ఫోటో—జి. ప్రభాకరరావు (తిరుపతి)



బూ తదితర ఇన్‌స్టెంట్ కాఫీల్లా కాదు. . జారు మీకు ఎన్నో కప్పుల కాఫీని ఎక్కువగా యిస్తుంది.



బ్రూ చిక్కని కాఫీ సారం కాబట్టి ఓ కప్పుకు చాలా తక్కువ వాడుతారు.



బ్రూ చాలా రోజులు వస్తుంది...కాఫీ పొడి కంటే ఖర్చు బాగా కలిసివస్తుంది.



బ్రూ– బ్రూక్ బాండ్ వారిది– భారత దేశంలో కాఫీ వుత్పత్తిలో అగ్రగణ్యులు

## బ్రూను కాఫీ పొడి కాఫీతో టెస్ట్ చేసి చూడండి.

# కప్పుకు కప్పు లెక్కచూస్తే బ్రూ ఖరీదు చాలా తక్కువ



అంతేకాదు, బ్రూ తదితర ఇన్‌స్టెంట్ కాఫీల కంటే ఎన్నో కప్పుల కాఫీని ఎక్కువే ఇస్తుంది.




బ్రూ పువ్వునాజు జాడివి మళ్లీ మళ్లీ వాడుకోవచ్చు

## బ్రూ– సరసమైన ధరకు చిక్కని, స్ట్రాంగ్ ఇన్‌స్టెంట్ కాఫీ

# మకుటానికి అర్థం తెలుసా?

‘షమైతాంగి’

“అమ్మా!” విసురుగా లోపలికి వచ్చాడు సూర్యం.

హడావిడిగా తన బట్టలు సర్దుకుంటున్న నరసమ్మ గారు దిగ్గున తల ఎత్తి, “ఉత్తరం వచ్చిందా, పెద్దాడి దగ్గర్నుంచి? ఎప్పుడు రమ్మనమని వ్రాశాడు? రేపే ఓ టెలిగ్రావ్ కొట్టు, నేను బయలుదేరి వస్తున్నానని—లేకపోతే కొత్త చోటు, అవస్థపడాలి” అంది ఉత్సాహంతో గబగబా.

“టెలిగ్రావ్ కొట్టే పని లేదులే ఇక.” వ్యంగ్యంగా నవ్వుతూ అక్కడున్న కుర్చీలో చతికిల బడ్డాడతను.

“ఏం? ఎందుకని? వాడే వస్తానని వ్రాశాడా నన్ను తీసుకెళ్ళడానికి?” ఆదుర్దాగా అడిగిందామె.

“వాడొస్తాడని కాదు, నిన్ను పంపించవద్దని ...”

“నన్ను పంపించవద్దనా?” ఆ మాట వింటూనే ఆమె తెల్లబోయింది.

“ఎందుకని?” క్రుంగిపోతూ అడిగిందామె.

“ఎందుకేమిటి? నీకు అక్కడ సదుపాయంగా ఉండదని. వాళ్ళు మేడమీది భాగంలో ఉంటున్నారట. ఆ మెట్లు దిగలేక, ఎక్కలేక నీకు అవస్థగా ఉంటుందని—పైగా అక్కడ చలి బాగా ఎక్కువగా ఉందట. నీకయ్యే మందుల్లాంటి ఖర్చు డబ్బు రూపంలో పంపిస్తాడట నాకు. నిన్ను ఇక్కడే ఉంచమని వ్రాశాడు నీ పెద్ద కొడుకు.” చివరి మాటని వెటకారంగా ఒత్తి పలికాడు సూర్యం.

“నన్ను రావద్దన్నాడా? చలికి తట్టుకోలేనని, మేడమెట్లు దిగలేనని — పాపం, వాడికి నా మీద ఎంత ప్రేమో! పైగా నా తిండి ఖర్చు నీకు పంపిస్తాడా?”



ఏడవలేక నవ్వినట్లు పేలవంగా నవ్విందామె. “అక్కడికి వెళ్ళబోతున్నానని ఈ క్షణం వరకూ ఉవ్విళ్ళూరుతున్నాను. పైగా అందరికీ చెప్పేశాను కూడా— రేపో మాపో ప్రయాణ మవుతున్నాను, మా పెద్దాడి దగ్గరకు హైదరాబాదు అని.” గొణుక్కుంది బాధగా. ఈవేళొస్తుంది, రేపొస్తుంది ఉత్తరం అని తను ఆశగా ఎదురు చూస్తుంటే, తన ఆశల్ని ముక్కలుచేస్తూ వచ్చిన ఉత్తరం తెచ్చిన కబురు అదన్న మాట. నరసమ్మ గారికి నవ నాడులూ క్రుంగిపోయినట్లు ఎంతో బాధ అనిపించింది. ఆఫీసరుగా హోదాతోపాటు, బోలెడంత డబ్బు గడిస్తున్న పెద్దకొడుకు దగ్గర కొన్నాళ్ళు నిశ్చింతగా ఉండచ్చని, అటు పక్కన ఉండే ఊళ్ళన్నీ చూడవచ్చని కలలు



# మీకు ఫ్యాను కావలసినప్పుడు **సింగర్** నే కొనండి.

ఈ వేసవిని చల్లగా వుంచుతుంది—సింగర్ ఫ్యానులతో—శబ్దం చేయవు మరియు నమ్మదగ్గవి. ఎల్లప్పుడు మీ సేవ కొఱకై.

పూర్తి రేంజిని చూడండి మరియు సరిక్రొత్త సింగర్ "మహారాజా" సీరీలు మీ సమీపంలో యున్న షాపులోగాని, డీలరు వద్ద గాని లభించును. ప్రతి సింగర్ ఫ్యానుకు రెండు సంవత్సరాలు గ్యారంటీ యివ్వబడును. మరియు



**సింగర్* మహారాజా టేబుల్ ఫ్యాన్**

అతి వేగంగా తిరుగును—అల్యూమినియం డై కాస్ట్ చేయబడినది—వ్రేలితో నొక్కే పియానో రెగ్యులేటరు—ఆకర్షనీయమైన వెండిపూత.





**సింగర్* మహారాజా సీలింగ్ ఫ్యాన్**

డై కాస్ట్ చేయబడినది. అలంకరణకు అనుకరించు ఆకర్షనీయమైన రంగు-వాలుగు వేర్వేరు సైజులు.



**సింగర్* ఫ్యామిలీ ఫ్యాన్**

ఎప్పటికైన తీసుకొని పోవచ్చు అన్ని విధాల ఉపయోగించవచ్చు—రంగుగల 400 మి.మీ. బ్లేడులు



**సింగర్* మహారాజా మిని ఫ్యాన్**

28 సెం.మీ. మాత్రము ఎత్తు-సరి చేసుకొనుటకు స్టాండు—క్రోమ్ ప్లేటుగల గార్డు—నీలి రంగుగల బ్లేడులు—రెండు వేగముగల రెగ్యులేటర్లు.




*సింగర్ కంపెనీ యొక్క ట్రేడ్ మార్క్.

**సింగర్ మంచి వస్తువులకు పుట్టినిల్లు**

కంటున్న దిన్నాళ్ళూ. ఆ కలలన్నీ కల్లలై పోయాయి నేటికి—అనుకుంది బరువుగా నిశ్వసిస్తూ.

ఉత్తరంలోని వార్త తల్లికి జేరవేశారు కాబోలు పిల్లలు, కోడలు కనకమహాలక్ష్మి అత్తగారి ప్రయాణం ఆగిపోయినందుకు, ఆ బరువు ఇంకా మూణ్ణెల్లు పెరిగినందుకు బాధపడిపోతూ, ఆ బాధని గిన్నెల మీదా, చెంబుల మీదా చూపిస్తూ గట్టిగానే గొణుక్కుంటున్నది — "మాయదారి సంత నా కొచ్చిపడింది" అంటూ.

కోడలి విసుగుదల ఎందుకో, ఎవరి మీదో తెలుసుకోనంత అమాయకురాలు కాదు నరసమ్మగారు. కాని, ఏం చేస్తుంది? భర్త పోతూ పోతూ చేసి పోయిన ఏర్పాట్లవి. 'నలుగురు కొడుకులూ ఒక్కొక్కరు సంవత్సరంలో మూణ్ణెల్లు తల్లిని పోషించా'లని. ఆ లెక్క ప్రకారం ఇక్కడి కొచ్చి మూణ్ణెల్లు పూర్తయి పైన మరో మూడు రోజులు కూడా గడిచిపోయాయి. గుమాస్తాగిరితో, పట్నం బ్రతుకుల్లో, రోజురోజుకీ విపరీతంగా పెరిగి పోతున్న ధరలతో ఉన్నవాళ్ళే మూసుకు బ్రతుకుతుంటే, కరువుకి తోడు అధిక మాస మన్నట్లు మరో మనిషిని పోషించాలంటే ఈ రోజుల్లో చాలా కష్టమే. ఎంత హీనంగా లెక్క వేసినా తన గురించి నెలనెలా ఎంతో కొంత ఖర్చు కాకపోదు. తను లేకపోతే ఆ డబ్బు వాళ్ళకి ఆదాయే కదూ? పైగా కోడలు కనకమహాలక్ష్మి ఏ నెల కానెల, ఇరుగు పొరుగుల దగ్గర — "మా అత్తగారి మూలాన్నే అంత ఖర్చు" అని వాపోతూ ఉండటం తను చూస్తూనే ఉన్నది. ఇక్కణ్ణుంచి తనని ఎంత త్వరగా సాగనంపుదామా అని వాళ్ళు కంగారు పడుతుంటే, తన బరువు ఇంతలో తీరదని వాళ్ళకి బాధ. నిజమే మరి. భృకుటి ముడిచి దీర్ఘాలోచనలో పడిపోయా రామె. ఆవిడ కెటూ పోలుపోవడం లేదు. పోనీ, విష్ణుమూర్తి దగ్గిర కెళితే? తను వెళ్ళాలే గాని తనని పువ్వుల్లో పెట్టినట్లు ఆదరంగా చూసుకొనేది వాడొక్కడేను. "వచ్చావా, అమ్మా? చాలా ఆలస్యం చేశావేం? నువ్వొస్తావనిరోజూచూస్తూనే ఉన్నాను" అని నోరారా నవ్వుతూ ఎదుర్కొంటాడు. గడుపు పూర్తిచేసి ప్రయాణం అవబోతుంటే, "అప్పుడే వెళతావా? మొన్ననే కదూ వచ్చావు? అప్పుడే మూణ్ణెల్లూ అయిపోయాయా! అయితే అయ్యాయి లెస్తూ లెక్క ప్రకారం ఉండాలని నియమమేమిటి? కాసిని రోజులు ఎక్కువుంటేనేం? నీది మరీ చాదస్తం. నాన్నగారు ఏ కొడుకు



**స్త్రీ సంతానం కోసం ఎంతగానో అఱ్రులు చాస్తుంది. పిల్లలకై పూజలు, వ్రతాలు, తీర్థయాత్రలు కూడా చేస్తుంది. తన కడుపున కాచిన కాయల రక్షణకోసం సుఖాన్ని సైతం పణంగా ఒడ్డుతుంది. క్షణ క్షణం కొడుకు ఔన్నత్యం కోసం తపిస్తుంది. పెరిగి పెద్దవాడైన తరవాత తల్లి కన్నీటికి కారకుడు కొడుకే అయితే....**



మనసూ నొచ్చుకో కూడదని ఆ నిర్ణయం చేసి ఉంటారు, అంతమాత్రానికే కట్టుబడి పోవాలా?" అని బాధపడిపోతాడు. దాన్నిబట్టె వాడికి తనంటే ఎంత ప్రేమో గ్రహించుకోవచ్చు.

"నాన్నమ్మా, నువ్వు ఊరెళ్ళడం లేదట కదూ?" సూర్యం చిన్న కొడుకు నరసమ్మ గారి చెయ్యి పట్టుకుని లాగుతూ అడిగాడు. ఉలిక్కిపడిం దామె. ఆలోచనలు చెదిరిపోయాయి. "ఉహూఁ వెళ్ళడం లేదు" అనబోయింది. అంతలోనే తమాయించుకుని — "ఎవరు చెప్పా రలా? లేదు, వెళుతున్నా. మీ విష్ణు బాబయ్య దగ్గిరకి వెళుతున్నా" అన్నా రావిడ నవ్వు నటిస్తూ.

"ఉత్తదే." వాడు నమ్మలేనట్లు చూశాడు.

అంతలోనే పక్కింటి కామాక్షమ్మ హడావిడిగా వస్తూ, "మీ ప్రయాణం ఆగిపోయిందట కదూ, వదినా? మీ శీల మా కోడలితో చెపుతుంటే ఎంతవరకు నిజమో కనుక్కుందామని వచ్చాను" అంది.

"అవును మా పెద్దాడి దగ్గరికెళ్ళడం లేదు. ఆఖరాడి దగ్గరకు వెళదా మనుకుంటున్నాను" అనాలనుకున్నా రావిడ—కాని, ఎదుటి మనిషి చెప్పే జవాబుతో నిమిత్తం లేని కామాక్షమ్మ గబగబా అంది: "అయితే ఇంకేం? ఎలాగూ ప్రయాణం ఆగిపోయింది గనక అలా రామాలయం వరకు వెళ్ళొద్దాము రండొదినా. ఈవేళక్కడ పురాణ కాలక్షేప ముందట."

ఆవిడ పురాణ కాలక్షేపం వంకతో పిలిచినా అది విననివ్వకుండా తన సొంత గాథాయణం కాలక్షేపం చేసే ఆమెతో వెళ్ళడం ఇష్టం లేకపోయినా, ఇంట్లో ఉండి కోడలు రుసరుసలు, కొడుకు విసుగుదల వింటూ బాధపడేకన్న ఆవిడతో బయటికి వెళ్ళడమే ఉత్తమంగా కనిపించి — "సరే, పదండి" అంటూ ఆమట్టున బయలుదేరింది నరసమ్మ గారు, కామాక్షమ్మ వెనకాల. దారిలోనే తన స్వంత రామాయణం మొదలు పెట్టింది కామాక్షమ్మ. చిన్న కొడుకు మళ్ళీ ఉత్తరం రాశాడట తనని రమ్మనమని. కాని, అక్కడికి వెళ్ళడం తనకే ఇష్టం లేదట. పైగా పెద్ద కొడుకు కూడా — ఇప్పుడు ఎందుకు? వెళ్ళచ్చులే తర్వాతెప్పుడో అన్నాడట. ఆ మాట చెపుతూ, "నా కొడుకుల్ని నేను మెచ్చుకో కూడదని, ఏ దానం చేసి ఈ బిడ్డలను కన్నానో గాని, రత్నాల మొలకు కదూ నా పిల్లలు! ఈ కాలంలో ఉండాల్సిన పిల్లలు కాదు నా కొడుకులు. నేనంటే వాళ్ళిద్దరికీ ఎంత ఆపేక్షో! ప్రాణం విడుస్తారు నేనంటే" అంది కామాక్షమ్మ. ఎప్పుడు చెప్పినా ఈమాటలే చెబుతుంది విసుగులేకుండా. కాని, రోజూ ఆ మాటల్నే వింటున్న నరసమ్మ గారికి ఆ రోజు అకారణంగానే ఆమెమీద కోపం, అంత అదృష్టానికి నోచుకున్న ఆమె అదృష్టాన్ని చూసి అసూయా ముంచుకొచ్చాయి. కాని ఏం చేస్తుంది? అదావిడ అదృష్టం. ఇది తన దురదృష్టం మరి. ఆవిడకు ఇద్దరే కొడుకులు. ఆ ఇద్దరికీ తల్లంటే ప్రేమ, అభిమానం, ఆపేక్ష ఉన్నాయి. సంవత్సరంలో పది నెలలు పెద్దకొడుకు దగ్గిరే ఉండి పోతుం దామె. 'ఇంకా వెళ్ళదే' అని కొడుకు గాని, కోడలు గాని విసుక్కోరు. చిన్న చూపు చూడరు. పైగా పెద్దహోదాలో ఉన్న కొడుకు తల్లిని పువ్వుల్లో పెట్టినట్లు చూసుకుంటాడు. "నేనింత ఉన్నత దశలో ఉండటానికి మా అమ్మే కారణం. ఆమె నిరాదరణగా చూస్తే నేనింత ఉన్నత స్థితిలో ఉండేవాడినే కాదు" అని అందరి దగ్గరా తల్లిని పొగుడుతూ ఉంటాడు కూడా. ఇక ఆ కోడలైనా విసుక్కోదు. ఎంతో ప్రేమగా, ఆప్యాయంగా చూస్తుంది అత్తగార్ని. ఏ విషయం లోనూ వెలితిగాని, కొరతగాని

(తరువాయి 39 వ పేజీలో)






నాట్య మండపంలో మధ్యనున్న శిల్ప స్తంభంమీద ఒక ప్రక్క పార్వతీదేవి పరిచారిక కానవస్తున్నది. ఎడమ చేతిలో తామరపుష్వ పట్టుకొని కుడి చేతితో పూమాలను పార్వతీదేవికి ఇస్తున్నది.

మరొక ప్రక్క పార్వతీదేవి నిలుచుండి చేతితో మాలను తీసుకుంటున్నది.

మరొక స్తంభంపై పరమశివుడు నటరాజమూర్తిగా కనబడుతున్నాడు.

ఈ మంటపంలో ప్రతి స్తంభం మీదా అతి సుందర శిల్పం నేత్రానందం కల్పిస్తుంది.

# ప్రొద్దుటి తాజాతనము గంటల గంటలకొద్దీ

ఆ ప్రాతః కాలపు అభినవ చైతన్యాన్ని స్నానం అయిన తరువాతకూడా గంటలకొద్దీ వుంచుకోండి. పాండ్స్ డ్రీమ్ ఫ్లవర్ టాల్కుతో.

భారతదేశంలో విస్తారంగా అమ్ముడయే టాల్కు కోమలమైన పరిమళం వస్తూనే వుంటుంది.

పాండ్స్ డ్రీమ్ ఫ్లవర్ టాల్కు చప్పున తేమను పీల్చుకుంటుంది. సన్నిహితమైన లాలిత్యాన్ని కల్గించి మండు వేసవికాలంలో ఉక్కబెట్టేటప్పుడు కూడా చల్లదనాన్ని నవచైతన్యాన్ని సువాసనను మీకు కలిగిస్తుంది. ఏటికేడాదీ అన్ని కాలాలలోను మీరు వుపయోగించగల టాల్కు.

3 సైజులలో లభిస్తుంది:
ఫ్యామిలీ – లార్జి – మీడియమ్.




## పాండ్స్

### డ్రీమ్ ఫ్లవర్ టాల్కు

మీ తాహతుకు మృదువైన లక్జరీ టాల్కు

చీసబ్రో-పాండ్స్-ఇన్‌కార్పొరేటెడ్.
(పరిమితి బాధ్యతతో U.S.Aలో స్థాపితము)

# ఈ కన్నీటికి...

( 35 వ పేజీ తరువాయి)

లేకుండా చూసుకునే వాళ్ల దగ్గర ఉండ టానికి ఆమెకు బాధేమిటి?

"నీ ప్రయాణం ఆగిపోయినందుకు నాకు చాలా సంతోషంగా ఉంది, వదినా—" నోటినిండా నవ్వుతూ చెప్పింది కామా క్షమ్మ.

పిల్లికి చెలగాటం ఎలకకి ప్రాణ సంకటమట. అలా ఉంది ఇప్పుడు తన ప్రయాణం ఆగిపోయినందుకు. కాని ఈమె కేమో సంతోషంగా ఉందట. ఆ సమయంలో కామాక్షమ్మ మీద ఎప్పుడూ రానంత కోపం వచ్చింది. కోపాన్ని దిగ మింగుతూ, "ఎందుకుటా" అంది వ్యంగ్యంగా చూస్తూ.

"ఎందుకేమిటి? వచ్చేది ధనుర్మా సమా—రామాలయంలో ఎంత సందడిగా ఉంటుందనుకున్నావు! రోజు కో అలం కారం చేస్తారు. పైగా హరికథలకు, పురాణ కాలక్షేపాలకు లోటే ఉండదు. ఆ నెలంతా చాలా సందడిగా, హడావిడిగా ఉంటుందిలే. నువ్వుండవేమో, నాకు తో డెవరుంటారూ అని బాధ పడుతుంటే దేవుడు నా మొర విని నీ ప్రయాణం ఆపేశాడు. పల్లే గాని, అలా ఉన్నావేమిటి, వదినా, దిగులుగా? పాపం, హైదరాబాదు చూడాలని చాలా ఉబలాట పడ్డావుకదూ? కాని, ఏం చేస్తావు? ఒక్కోసారి ఇంతే. ఎంతో ఆశపడితే, ఆశ నిరాశగా మారి పోతుంది క్షణంలో." తన ధోరణిలో తను చెప్పుకు పోతున్నది కామాక్షమ్మ.

కాని, నరసమ్మగారి మనసు మాత్రం పెద్ద కొడుకు ఉంటున్న హైదరాబాదు చుట్టూ పరిభ్రమిస్తున్నది. అది చాలా పెద్ద ఊరట. పెద్ద పెద్ద మేడలు, విశాలమైన రోడ్లు, తోటలు—చూడ వలసిన ప్రదేశాలెన్నో ఉంటాయట. హైదరాబాదు గురించి వాళ్లూ వీళ్లూ అనుకునే మాటలతో మనసులో అంద మైన రూప కల్పన చేసుకుంటూ మురిసి పోయింది ఇన్నాళ్లూ, త్వరలో అక్కడి కెళ్లబోతున్నాను కదూ అనే భ్రమలో.

చిన్నప్పట్నుంచీ కూడా పెద్ద పెద్ద నగరాలను చూడాలనే కాంక్ష వయసుతో పాటు పెరుగుతూ వస్తున్నది కాని, ఊహాలోకాల్లో ఊరించే ఆ నగరాలను తను ఇంతవరకు చూడనేలేదు. పల్లె టూర్లో పుట్టి, మరో పల్లెటూర్లో మెట్టింది. దగ్గిర ప్రయాణం కారు మీద, లేదా ఎడ్లబండి మీద. అంతే. రైలుమీద దూర ప్రయాణం ఎప్పుడూ చేసి ఎరగదు. కొడుకులు ఉద్యోగస్థు లయ్యాకన్నా వాళ్ల దగ్గిర కెళ్లడం పడేది కాదు. ఇపుడంటే భర్త పోబట్టి, భర్త పోతూ పోతూ ఏర్పాటుచేసిన విధంగా తన పొట్టకి ఇంత ముద్దకోసం కొడుకుల దగ్గరకు వెళ్లవలసి వస్తున్నది.

పెద్దకొడుక్కి హైదరాబాదు ట్రాన్స్ ఫరయిందని తెలిసినప్పటినుంచి, పైకి చెప్పక పోయినా లోలోపల ఎంత మురు స్తున్నదో ఎవరికి తెలుసు? ఎప్పుడెళ్లి ఆ ఊరు చూద్దునా అని వేగిర పడుతుంటే, పెద్దకొడుకు ఆ దారినే మూసివేశాడు.

అసలు పెద్దాడు అంత ప్రయోజకు డవడానికి కారణం తనే. ఆ రోజుల్లో తనే గాని వాడి చదువు గురించి పట్టు పట్టకపోతే, వాడూ తమ్ముళ్లలాగే ఏ గుమాస్తాగానో, స్కూలు మాస్టారు గానో బతికే వాడే. కాని, వాడి చదువు కోసం తను మొగుడితో పోట్లాడేది— "వాడిని మీరు బాగా చదివించవలసిందే" అని. తన పట్టుదలకి తగ్గట్టుగానే ఒక్క క్లాసూ తప్పకుండా పాసవుతూ వచ్చాడు. చదువుకి తగ్గ పెద్ద ఉద్యోగం చేస్తున్నా డిప్పుడు. రెండో వాడు, మూడో వాడు ఎస్. ఎస్. ఎల్.సి. తోనే సరిపెట్టుకున్నారు. పెద్దాడి చదువుతోనే గుడ్లు మీదికొచ్చినంత పనయి తలివ్మా వారిని పెద్ద చదువులు చదివించలే నన్నాడు భర్త. రెండో వాడు గుమాస్తా, మూడో వాడు బడిపంతులూ అయ్యారు. ఎటొచ్చీ నాలుగోవాడికే అన్యాయం జరిగి పోయింది, పాపం! "అన్నయ్యల్లా నేనూ చదువుకుంటాను" అని ఎంతో గోల పెట్టాడు కాని, వాడి ఏడుపు తను గాని, భర్తగాని పట్టించుకుంటే కదూ? "అందరూ చదువుకుంటే నాన్నకి పొలం పనుల్లో ఎవరు సాయం చేస్తార్రా" అని వాడిని బ్రతిమాలి, బామాలి ఎలాగైతేనేం వాడి మెడలు విరిచి వ్యవసాయంలోకి దింపింది తనేను. కాని, తనకేం తెలుసు— చదువులు మమకారాలని దూరం చేస్తా యని, డబ్బుకి ప్రాధాన్య మిస్తాయనీను? హఠాత్తుగా ఆమె ఆలోచనలకు సడన్ బ్రేక్ పడింది. కామాక్షమ్మ ఆమె భుజం పట్టుకుని అవుతూ—"ఇక్కడ కొబ్బరికాయ, అగరొత్తులు కొందాము ఆ గోదినా" అంది. "గుడి దగ్గరైతే ప్రియంగా చెబుతారు, నువ్వూ కొంటావా కొబ్బరికాయ? డబ్బులున్నాయా — లేక పోతే నేను తెచ్చాను, తీసుకో.-ఇంటి దగ్గ రిద్దువుగానిలే" అంది.



ప్రసాధనం

చిత్రం—ఆర్. సుమలత (మద్రాసు-23).

తన దగ్గర డబ్బు లేనందుకు ఆ సమయంలో నరసమ్మగారు చాలా సిగ్గుపడింది మనసులో. అసలు తన దగ్గర చిల్లర డబ్బులుంటే కదూ తేవ డానికి? ఎప్పుడన్నా ఇలా గుడికి బయలు దేరుతుంటే, ఆ సమయానికి కొడుకు ఇంట్లో ఉంటే— "ఓ పావలా ఉంటే ఇవ్వరా" అని అడిగి తెచ్చేది కాని, ఏమిటో ఈ రోజు మనసు మొద్దుబారిపోయింది. ఏదీ జ్ఞాపకం రాలేదు తనకి. కామా క్షమ్మ కైతే అడిగే బాధే ఉండదు— జీతాలు రాగానే కొడుకు ఆమె చేతి ఖర్చు కోసం పదో, ఇరవైయో ఇస్తాడట. ఆ మాట ఎంతో గర్వంగా చెబుతుంది కామాక్షమ్మ. చెప్పుకోవడానికి తనకీ గురు కొడుకు లున్నారు కాని, ఒక్కళ తమంత తాముగా — 'ఈ రూపా దగ్గరుంచుకో, అమ్మా' అని ఇవ్వ అడగడం తనకి నామోషీగా ఉంటుం తనకి కొనిచ్చే ఒక్క చీరా కొనిపెట్టడా వాళ్ల కెంతో బాధగా ఉంటుంది "నీ దగ్గర చీరలు మన్న వేమిటమ్మా అని విసుక్కుంటారు. భార్యలకై పండుగ పండుక్కీ కొత్త చీర కొంటూనే ఉంటారు. తమ జన కారణభూతురాలైన తల్లికి ఒంటినిం బట్టా, కడుపునిండా తిండీ పెట్టడా ఈ కొడుకు లింత బాధపడిపోతా రెం కనో?

కామాక్షమ్మ గిసి గీసి బేరమా ఓ కొబ్బరి కాయ తీసుకుంది. "నువ్ కొబ్బరికాయ తీసుకుంటావా, అర పండ్లా?" అడిగింది నరసమ్మగార్ని.

"అరటిపళ్లు చాలులే" అని కామా క్షమ్మ దగ్గర పది పైసలు తీసుక పళ్లు తీసుకుంది నరసమ్మగారు.

"నేను బయటి కెళుతున్నానం చాలు, 'ఈ డబ్బులు దగ్గరుంచుకోం అత్తయ్యా' అని నే వద్దంటున వినకుండా ఇస్తుంది మా కోడలు. చూశావా నా అదృష్టం, నా కోడ లెం మంచిదో? నీకూ ఉన్నారు కోడళ్లు కా ఒక్కళ్లకూ నీ పొడ గిట్టదు, పా అన్నట్లు బడాయిగా చెబుతున్నది కామా క్షమ్మ. ఆవిడ మాటలకు మొహ ముడుచుకుంది నరసమ్మగారు.

మూడో కొడుకు దగ్గరుండగా ఒ సారి ఇలాగే ఎదురింటి శివమ్మగారి కలిసి బజారు వెళ్లింది. ఆ శివమ్మగా ఇంట్లోకి కావలసిన వెచ్చాలన్నీ త తెస్తుంటుంది. అది చూసి కోడ తనని కూడా ఏవో సరకులు తెమ్మ పురమాయిస్తూనే ఉండేది. తన కావలాగా రెండో కూతుర్ని పంపే కూడా. ఓసారి అడుక్కునే వా రెండు పైసలు వేసింది. దాహం వేసింద సోడా తాగింది. ఆ కబురుని తల్లి జాగ్రత్తగా చేరవేసింది కూతురు. అం ఆవిడ సూటీ పోటీ మాటలు విసరడ మొదలు పెట్టింది.

"ఎవర్నే మీ అమ్మ అలా తిడుతున్న దని కొడుకు కూతుర్ని అడుగుతుంటే ఆ కూతురు ఏదో ఘనకార్యం చేసి దానిలా పోజిస్తూ, "ఇందాకా బామ అమ్మఇచ్చిన డబ్బులు మిగిల్చి సోడాతాగింది అడుక్కునే వాడికి వేసింది—అందుక అమ్మకి కోపం వచ్చింది, నాన్నా" అంది "ఏడ్చావులే, నోరుమూసుకో" అ కూతుర్ని కసిరాడు కొడుకు. ఆ మా



ఏ వేళకు ఆ వైపు
ఫోటో—సి. జయదేవరెడ్డి (నంగమంగలం)

ఏంటూనే తను బిక్కచచ్చిపోయింది. తన కొడుకు ముందు అపరాధిలా నిలబడి పోయింది తను.

అంటే, తల్లి కొడుకు సంపాదనలో అర్థణా కూడా ఖర్చు పెట్టుకునే హక్కు లేదా? అని బాధగా మూలిగింది తన మన సప్పుడు. చిన్నప్పుడు పుస్తకాలు పారేసి, పలకలు పగలగొట్టి, పెనిసిళ్ళు, పెన్నులు పారేసి ఆ సంగతి తెలిస్తే తండ్రి ఎక్కడ తన్నుతాడో అనే భయంతో బిక్కమొహం వేసుకుని తన దగ్గర నిలుచుంటే, తన మనసు కరిగి పోయేది. భర్తకి తెలియకుండా వాళ్ళకి డబ్బులిచ్చి పంపేది. అలా ఎన్నిసార్లో, ఎన్ని రూపాయలు ఖర్చు పెట్టిందో అదంతా తన కొడుకులకి తెలియదూ— అనుకునేది బాధగా.

ఓ సారి — అంటే అప్పటికి భర్త బ్రతికే ఉన్నాడు, "ఆడదానికి కూడా తనదంటూ ఇల్లో, పొలమో, బంగారమో ఉండాలి. దానికోసమైనా కొడుకులూ, కోడళ్ళూ వృద్ధాప్యంలో బాగా చూస్తారు. ఏమీ లేకపోతే ఆ ఆడదాన్ని ఎవరూ సరిగ్గా ఆదరించరు కూడా" అని ఎవరో అంటే ఆ మాట మీద తను తనపేరన కొంత భూమి పెట్టమని పోరింది. కాని, భర్త వింటే కదూ? "నీ కెందుకే, పిచ్చి దానా, ఆస్తి! ఆస్తి నువ్వేం చేసుకుంటావు? ఆస్తిని మించిన కొడుకులు నలుగురు ఉండగా, వాళ్ళు నీ కేం లోటు చేస్తారు? నిన్ను పువ్వుల్లో పెట్టి చూసుకోరూ?" అని ఉన్న ఆస్తి కాస్త ఆ నలుగురికే పంచి పెట్టేశాడు. "అదేమిటి, నాన్నా, అమ్మని మేము చూసుకోమా, మా కంతగా చెప్పాలా?" అని ఆ రోజు తండ్రి ముందు గొప్పలు చెప్పుకున్న ఆ కొడు కుతే, ఇప్పుడు తనకి ముద్ద పెట్టడానికి బాధపడిపోతున్నారు.

పుత్రులు లేకపోతే పుట్టగతు లుండ వని, పున్నామ నరకం నుంచి కాపాడేది కొడుకులే, కాని కూతుళ్ళు కాదు అనే మూఢ నమ్మకంతో కొడుకులు పుట్టా లనే కోరుకుంటుంది ఆడది. వృద్ధా ప్యంలో ఆదరించవలసిన కొడుకు, చివ రకు వాళ్ళ కేమిస్తున్నాడు? తీరని అశాం తిని, బ్రతుకుమీద విరక్తిని కలిగి స్తున్నాడు. అంతే. బ్రతికి ఉండగానే నరకాన్ని చవి చూపించే కొడుకు పుట్టినా ఒకటే, పుట్టకపోయినా ఒకటే. కొడు కుల స్వభావాలను తలుచుకుంటూ చింతి స్తున్నది ఇప్పుడు నరసమ్మగారు.

'ఆ కొడుకుల్ని చూసే ఒకానొక నాడు తెగ గర్వపడ్డావు కదూ?' చిలిపిగా అడిగింది మనసు.

'అవును. గర్వపడ్డ మాట నిజమే. ఒక్క కొడుకు పుట్టితేనే బోలెడంత సంతోషం కలిగేటప్పుడు నాకు నలుగురు కొడుకు లున్నారు, నాకు లోటేమిటి? ఒకరితో లెక్కేమిటి అని విర్రవీగిన మాట నిజమే కాని, నాకేం తెలుసు, స్వార్థానికి మారుపేరుగా తయారవుతారు ఈ కొడుకులు అని?' పశ్చాత్తాపంతో తనకి తను సమాధానం చెప్పుకుం దామె—

"ఏమి టొదినా అంత దీర్ఘంగా ఆలోచిస్తున్నావు? ఎన్నిసార్లు పిలిచినా పలకడం లేదు" అంది కామాక్షమ్మ.

"పిలిచావా!" కలవరపాటుని అణుచు కుంటూ పొడిగా అంది నరసమ్మగారు.

"ఈ రోజు నీ మనసు బాగాలేదు. చాలా పరధ్యాన్నంగా ఉన్నావు." నవ్వింది కామాక్షమ్మ.

• • •

పురాణం దగ్గరినుంచి ఇంటికి బయలు దేరుతూ, "రేపు ఇంతకంటే పెందలాడే వద్దాము, వదినా" అంది కామాక్షమ్మ.

"రేపు నే నుండనమ్మా." నిర్లిప్తంగా జవాబిచ్చింది నరసమ్మగారు.

"ఎక్కడి కెళతావూ? నీ ప్రయాణం ఆగిపోలేదూ!?"

"నా ప్రయాణం ఆగదమ్మా—మా ఆఖరి వాడు విశ్వమూర్తి దగ్గరి కెళ తాను."

"మూణ్ణెల్ల క్రితం అక్కణ్ణుంచేగ వచ్చావూ? మళ్ళీ అక్కడికే వెళతావా?" సంభ్రమాన్ని వెల్లడించింది కామాక్షమ్మ.

'అవును, అక్కడైతేనే నాకు సుఖంగా, నిశ్చింతగా ఉంటుంది. చదువు కున్న కొడుకులు ఏదో ఉద్ధరిస్తారని ఆశపడుతూ వచ్చాను కాని, డబ్బు ముందు కన్నతల్లి కనిపించదని ఇప్పుడిప్పుడే తెలుసుకుంటున్నాను' అని పైకి అన కుండా మనసులో అనుకున్నా రావిడ.

అత్తగారికోసం కనిపెట్టుకుని కూర్చున్న కోడలు మొహం చిట్లించి లేచింది, ఆవిడకు ఫలహారం పెట్టడాని కని. భర్త పోయినప్పట్నుంచి ఒంటి పూటే భోజనం చేస్తూం దామె.

కోడలి మొహంలోని విసుగుని, కొడుకు కన్నుల్లో ప్రస్ఫుటమయ్యే కోపాన్ని అర్థం చేసుకున్న నరసమ్మగారు వంట ఇంట్లోకి వెళ్ళకుండా తనకు వేసిన పక్కమీద కూర్చుంటూ, "ఒరేయ్, సూర్యం, రేప్పొద్దున్న ఫస్టు బస్సుకి పాలెం వెళతారా" అంది. ఆ మాటకి కొడుకు — 'అక్కడి కెందుకు? ఆ ఉండేదేదో ఇక్కడే ఉండరాదా' అంటా డేమో అనే ఆశతో. కాని, సూర్యం — "అలాగే, నీ ఇష్టం" అనేశాడు అతి తేలిగ్గా.

అత నలా అనగానే ఆమెకు చాలా ఆశాభంగం కలిగినట్లయింది.

ఆ రాత్రి ఎంతసేపటికీ ఆమెకు నిద్రపట్టలేదు. ఎలా పట్టుతుంది నిద్ర? కొడుకుల అండలో తన చివరి రోజులు నిశ్చింతగా గడిచిపోతాయని గంపె డాశతో ఉంది. కాని, స్వార్థం మూర్తీభ వించిన కొడుకుల ప్రవర్తనకు దుఃఖం వస్తున్న దామెకు.

'ఆడది సంతానంకోసం ఎంతో అర్రులు చాస్తుంది. సంతానంకోసం చేయరాని పూజలు, వ్రతాలు, తీర్థ యాత్రలు కూడా చేస్తుంది. పుట్టిన సంతానం నిలబడటంకోసం ఎంతో సుఖాన్ని పణంగా ఒడ్డుతుంది. ప్రతి క్షణమూ ఆ కొడుకు ఔన్నత్యంకోసమే వెంపరలాడుతుంది—కాని, పెరిగి ప్రయో జకు డైన కొడుకు ఆ తల్లి కేమిస్తాడు బదులుగా? కన్నీరు ... కన్నీరు ... కన్నీరు ... అంతే.' అంతర్గతమైన వేదనతో ఆమె రాత్రంతా జాగరణ చేసింది.

అప్పుడే కాస్త కునుకు పట్టుతున్న దామెకు. కాని, సూర్యం గొంతు హడా విడిగా వినిపించింది. "అమ్మ ఇంకా లేవ లేదూ? ఈ బస్సు దాటిపోతే మళ్ళీ ఏడు గంటల వరకూ బస్సు లేదు కూడా. అమ్మని లేపు, కనకం" అంటున్నా డతను. అంతే. అతి బలవంతంగా లేచి కూర్చుం దామె. 'నే నిక్కడ ఒక్కపూట ఆగినా బరువేనేమో' అనుకోగానే ఆమెకు కన్నీ రాగింది కాదు. అప్పుడే లోపలి కొచ్చిన సూర్యం తల్లి కళ్ళవెంబడి నీరు రావడం చూసి కంగారు పడ్డాడు. "ఏడుస్తున్నా వెందుకమ్మా? అన్నయ్య అలా రాశా డనా?" అడిగాడు కంపిత స్వరంతో.

"కాదురా, పిచ్చీ! రాత్రి కలలో మీ నాన్నగారు కనిపించారు. ఆయన జ్ఞాపకం వస్తే కన్నీ రాగింది కాదు" అన్నా రావిడ, పైకి నవ్వు నటిస్తూ. కాని, మనసులో ఇలా అనుకున్న దామె: 'ఈ కన్నీటికి అర్థం నీ కిప్పుడు తెలియదురా. ఇప్పుడు నువ్వు అపురూపంగా చూసుకునే నీ బిడ్డలు పెద్దయ్యాక వాళ్ళు నిన్ను నిర్లక్ష్యం చేస్తున్నప్పుడు, ఈ కన్నీటికి అర్థం తెలుస్తుంది నీ కప్పుడు.'

"పద, టైమయింది కాబోలు" అంటూ తడి కళ్ళను తుడుచుకుని తూలుకుంటూ బయటి కొచ్చింది నరసమ్మగారు. 

## ప్రమదావనం

# అమెరికా నుంచి ఒక సోదరుని లేఖ



బాగా అభివృద్ధి చెందిన దేశాలలో యునైటెడ్ స్టేట్స్ ఆవ్ అమెరికా ఒకటి. కాని ఈ అభివృద్ధి ఈ దేశంలో ప్రాథమిక అవసరాలకు ఎన్నో ఇబ్బందు లను కలుగచేస్తున్నది.

మనిషికి ముఖ్యావసరమైనది గాలి. పరిశ్రమలు, కార్లు, విమానాలు ఎక్కువ కావడం వల్ల గాలి కలుషిత మైపోయి, పరిశుభ్రమైనగాలిని పీల్చుకోవడానికి నోచుకో లేకపోతున్నాడు అమెరికన్ దేశస్థుడు. ఈ కలుషితమైన గాలిని పీల్చడంవల్ల కాన్సరులాంటి వ్యాధులు ప్రబల మవుతున్నాయి.

దాహమైతే నీళ్ళు తాగడానికి భయపడి సాఫ్ట్ డ్రింక్స్‌తో తృప్తిపడుతున్నారు. ఈ డ్రింక్స్ ఎక్కువ వాడడం ఆరోగ్యానికి ఏమంత మంచిది కాదు. గాలి, నదులు, సముద్రం, భూమి—ప్రతిదీ కలుషితమై పోతు న్నది. అందువల్లే ప్రస్తుతం కాలుష్యం పెద్ద సమస్య అయిపోయింది ప్రభుత్వానికీ, పౌరులకూ.

ఇక ఆహారం తీసుకుందామా అంటే చాలావరకు ప్రీ-కుక్డ్ ఫుడ్స్ ఉపయోగిస్తుంటారు. కాయగూరలు, పండ్లు, మాంసం—ఇలాంటివన్నీ చాలావరకు డబ్బాలలో నిలవ చేసినవే వాడుకుంటారు. ఈ నిలవ చేసిన ఆహారం ఆహారపు విలువను పోగొట్టుకోవడమే కాకుండా ఒక్కొక్క సారి ప్రాసెసింగ్ సరిగాలేని కారణమైతేనేమి, ఇంక దేనివల్లనైనా కావింది విషపూరితమై ప్రాణాపాయానికి దారి తీస్తున్నది.

మన దేశంలో ఆహారం తక్కువై బాధపడుతుంటే, ఇక్కడ ఎక్కువై అవస్థ పడుతున్నారు. ముఖ్యంగా బరువు విపరీతం కావడం, పంటిజబ్బులు రానురాను ఎక్కువైపోతున్నవి.

ప్రేమించడం, ప్రేమించబడడం—ఈ వరం రాను రాను కరువైపోతున్నది. నాకు తెలిసిన ఓ అమ్మాయి "మా అమ్మంటే నా కసహ్యం" అన్నప్పుడు నా కేం మాటలాడాలో తెలియలేదు. ఆ అమ్మాయికే కాదు, చాలామందికి తల్లి అంటే అసహ్యం. మన తల్లితండ్రుల ఆలోచన బిడ్డల భవిష్యత్తుమీద. ఇక్కడ అలా కాదు. పిల్లలకు కొంత వయస్సు వచ్చిన తరవాత వాళ్ల బాగోగులు వాళ్ళు చూసుకోవలసిందే. తల్లితండ్రులు తమ స్వంత ఆనందాన్ని చూసుకొని తరవాతే బిడ్డలను గురించి ఆలోచిస్తారు. సక్రమ మైన తల్లిప్రేమ లేని కారణంగా ఈ దేశంలోని పసిబిడ్డలు మానసికంగా ఎంత అనారోగ్యం పాలవు తున్నదీ ఈ మధ్య 'రీడర్స్ డైజస్ట్'వారు ప్రచురిం చారు. అది చదివి గుండెలు జలదరించాయి.

ఇక డేటింగ్. ఈ పదం వినడానికి ఎంతో అందంగా, తమాషాగా ఉంటుంది. చాలామంది అబ్బాయి లకు పెళ్లి చేసుకొంటే భార్య చేతుల్లో కీలుబొమ్మలమై పోతామని భయం. అందుకనే అబ్బాయిలు అమ్మాయి లతో సరదాగా తిరగడానికి ఇష్ట పడతారు కాని, పెళ్లి దగ్గరకు వచ్చేసరికి మాయమవుతారు. అమ్మాయిలు అబ్బాయిల నాకర్షించడానికి శత విధాల శ్రమపడతారు. కట్నాలు, కానుకల సమస్యలు లేవనే కాని, అమెరికన్ కన్యకూడా వివాహం దగ్గరికి కొచ్చేసరికి ఎన్నో ఇబ్బందు లను, అవమానాలను ఎదుర్కొంటున్నది.

డేటింగ్ ఒకర్ని ఒకరు అర్థం చేసుకొనడానికి. కాని, అది జరగదు. ఈ దేశంలో ఉన్నంత విడాకుల సంఖ్య మరే దేశంలోనూ లేదు. భార్యాభర్తలు ఒకరిమీ ఒకరు విశ్వాసం, ఆప్యాయత లేకుండానే సంసారాల చేస్తుంటారు. ఈ క్షణంలో భార్యాభర్తలుగా ఉంటారు మరో క్షణంలో ఒకరికొకరు ఏమీ కారు. ఇలాంట ఇళ్లలో పెరిగే బిడ్డల భవిష్యత్తు ఏమిటి?

ప్రతి అమెరికన్ ఇలాగే ఉన్నాడని నా ఉద్దేశ్య కాదు. ప్రేమ, దయ, ఔన్నత్యం, నిస్వార్థం, త్యాగబుద్ధి గల స్త్రీపురుషులెందరో ఉన్నారు. అయితే, రోజ రోజుకి వారి సంఖ్య దిగజారిపోతున్నది.

ముసలివారి బ్రతుకులు ఇక్కడ ఎంతో భయంక రంగా ఉంటాయి. ఆ వయస్సులో వాళ్లని శ్రద్ధగ చూడడానికి చిన్నవాళ్లకి టైమ్ ఉండదు. అందుకని వాళ్లకు ప్రత్యేకంగా 'హోమ్స్' ఉంటాయి. వాట దయాదాక్షిణ్యాలమీదే వీళ్ళు ఆధారపడాలి. కొంత శక్తి ఉన్నవారు ఒంటరిగా నివసిస్తూ ఉంటారు.

ఈ దేశంలో డబ్బుకి కొరత లేదు. అందుకని మత్తుపదార్థాలు సేవించడం అధికంగా ఉంటుంది తాగడం తప్పు కాకపోవచ్చు. విపరీతంగా తాగి డ్రైవ్ చేయడం, ఇతరులకు ప్రాణహాని కలిగించడం మాత్ర మహా నేరం. ఏ దినపత్రిక తెరిచినా ఇలాంటి నేరాలత నిండి ఉంటాయి వార్తలు. హీరోయిన్, మారువాన లాంటివి విశృంఖల విహారం చేస్తున్నాయి. లక్షలాద యువకులు వాటికి బానిసలై శారీరకంగాను, మానసిక గాను అధోగతి పాలవుతున్నారు. ఈ వ్యసనం ఉన్న వాళ్ళు చేస్తున్న రకరకాల దుండగాలు మితిమీర తున్నాయి. ముఖ్యంగా న్యూయార్కు లాంటి మహ నగరాల్లో ప్రాణాలు అరచేతుల్లో పెట్టుకొని బ్రతుక తున్నారు ప్రజలు.

వస్తుసంబంధమైన ప్రేమ నిజమనుకుంటారు కాని దానిమీదే చివరివరకు నిలబడలేరు. వాళ్ళకి ఏ కావాలో వాళ్ళకే తెలియడం లేదు. రాను రాను ఈ సంఘం అయోమయమై పోతున్నది.

శుభ్రమైన గాలి, నీరు, ఆహారం కరువు కావడం ప్రేమను వీథుల్లో వెతుక్కోవలసిన దౌర్భాగ్యపు స్థి రావడం, రోజు రోజుకి మానసిక వ్యాధులు విపరీత కావడం, హింసాకాండ, హత్యలు, దౌర్జన్యం ప్రబలడం- ఇదా అభివృద్ధి? ★

దేవళ్ల

## లేడీస్ క్లబ్బులు

ఆ ఊరు వెళ్ళిన కొద్ది రోజులకే ఒక ఆఫీసర్‌గారి భార్యతో పరిచయమయింది. అప్పటినుండి ఆమె అక్కడ ఉన్న లేడీస్ క్లబ్బులో సభ్యురాలిగా చేరమని ఒకటే బలవంతం. సాధారణంగా ఎక్కడయినా తెలిసినవాళ్ళు క్లబ్బులో చేరమని బలవంతం చేస్తే, నా వంతు చందా మాత్రం సెలవెలా పంపిస్తూ ఉంటాను కాని వెళ్ళాలంటే నా కంత ఇష్టం ఉండదు. ఈమెగారి బలవంతంవల్ల ఒక పర్యాయం వెళ్ళివచ్చాను. కాని ఇది కూడా నా అభిప్రాయాలను బలపరిచిందే కాని మార్చలేదు.

ఎందుచేతనంటే సరదాకొద్దీ ఆడవారంతా కలిసి ఏర్పాటుచేసుకొన్న ఈ లేడీస్ క్లబ్బులు అప్పటికి, ఇప్పటికి ఒకే తీరులో సాగుతున్నాయి. ఒక ప్రయోజనం లేదు సరికదా ఇందులో చేరేవాళ్ళంతా పెద్ద పెద్ద ఉద్యోగస్థుల భార్యలు, పెద్ద హోదాలలో ఉన్న వారు తప్ప సామాన్యులు కనిపించరు. ఎందువల్లనంటే మధ్యతరగతి గృహిణికి ఎన్ని సరదాలున్నా, ఎంత ఆర్టిస్ట్ అయినా ఇంట్లో ప్రతి పని ఆమె చేసుకోవలసిరావడంతో కావలసినంత టైమ్ దొరకదు. రెండవది - ఎలాగో వీలు చేసుకొని కొంచెంసేపు శ్రమనంతా మరిచిపోయి ఆనందంగా కాలక్షేపం చేదామని ఇటువంటి క్లబ్బులకు వచ్చినా ఇక్కడకు వచ్చే గొప్పవారి అంతస్తుల ముందు, హోదాలముందు, వారి వ్యంగ్యాలముందు ఆమె నిలువలేక మానసికంగా మరింత బాధపడాలే కాని అనుకొన్న ఆనందం ఇక్కడ లభించదు.

అసలు ఎక్కడైనా నలుగురు ఆడవాళ్ళు చేరితే 'ఈ చీర ఎంత? ఈ నెక్లెస్ ఎక్కడ చేయించారు?' అన్న ముచ్చట్లేతప్ప వేరే ప్రయోజనాత్మకమైన సంభాషణ కనిపించదు. అందులోను ఆర్థికంగా అందరు లోటులేనివారే కనుక ఒకళ్ళకన్న ఒకళ్ళు ఎక్కువన్న ధోరణిలో సాగుతాయి వీళ్ళ సంభాషణలు.

ఆర్థిక దృష్ట్యా తారతమ్యాలు ఏర్పరచకుండా అందరూ సమానమే అన్న భావం వీరిలో కలగాలి. నేడు మధ్యతరగతివారికి ఎన్నో సమస్యలు. ముఖ్యంగా అధిక ధరలు, పొదుపు,




పరిమిత కుటుంబం, నిరక్షరాస్యత — ఇటువంటి సమస్యలు తమకు సాధ్యమయినంతమట్టుకు తమ పరిధిలో నైనా పరిష్కరించడానికి పూను కొంటే ఎంతో సహాయం చేసినట్టు అవుతుంది. ఆ క్లబ్బుల ద్వారా ఏదైనా ఉపయోగకరమైన పనులు చేస్తే అటు తమకు మానసికంగా తృప్తి, ఇటు పేదవారికి సహాయం చేసినట్టూ అవుతుంది.

—వి. సత్యవతీదేవి
(సంగారెడ్డి)

## స్పాంజి బజ్జి

కావలసిన వస్తువులు:—

మినపప్పు — 100 గ్రా.
మైదాపిండి — 50 గ్రా.
పచ్చిమిరపకాయలు — అయిదు.
పచ్చికొబ్బెర, ఉప్పు, జీలకర్ర, బేకింగ్ సోడా.

తయారుచేసే విధానం:—

ముందుగా పప్పు నానబోసి కంట్లో పెడితే కరిగేటంతటి మెత్తగా రుబ్బాలి. అది పలచగా మరుగొచ్చేవరకు రుబ్బాలి. దాంట్లో ముందుగా జల్లించి ఉంచిన మైదాపిండిని బాగా కలపాలి. పిండి ఉండలు ఉండలుగా లేకుండా చూడాలి. దాంట్లో చిటికెడు సోడ, తగినంత ఉప్పు వేసి కలపాలి. దానిని ఒక గంట నానపెట్టాలి. అంతలో పచ్చిమిరపకాయలు చిన్న చిన్న ముక్కలుగా తరిగి ఉంచుకోవాలి. కొబ్బెరనుకూడా చిన్న ముక్కలుగా చేస్తే బాగుంటుంది. పిండి నానిన తరవాత దానిలో జీలకర్ర, పచ్చిమిరపకాయముక్కలు, కొబ్బెరముక్కలు వేసి కలిపి ఉంచాలి. తరవాత స్టౌమీద బాణలి ఉంచి దానిలో నూనె పోసి కాగనివ్వాలి. తరవాత ఈ పిండిని బజ్జీలుగా వేయాలి. అవి దోరఎరుపురంగు వచ్చిన తరవాత తీయాలి. అంతకు ముందు తీసిన బాగుండవు. అవి వేడిగా ఉన్నప్పుడు తింటే చాలా రుచిగా ఉంటుంది. మెత్తగా బన్ ఉన్నట్టు ఉంటుంది. కనక దీనిని పళ్ళులేని పెద్దవాళ్ళుకూడా తినవచ్చును. ఎక్కువ కారం ఉండదు కనక పిల్లలు కూడా తినవచ్చును.

—ఎస్. అరుణకుమారి,
హైదరాబాదు—40



## వంటా-వార్పూ




# ఈ ఏడు
# మీరు వొళ్లు పేలకుండా చేసుకోండి.

చలికాలం తర్వాత వేసం కాలం రాక తప్పనట్లు వేసవిలో వొళ్లు పేలుతుంది.

ఈ వేసం కాలంలో నైసిల్ పౌడర్‌తో వొళ్లు పేలకుండా చేసుకోండి. కారణం వొళ్లు పేలకుండా చేసే అపూర్వ పదార్థం క్లోర్ ఫెనెసిన్ ఒక్క నైసిల్ లోనేవుంది. అది మీ చర్మానికి హాయి నిచ్చి చాకలిదద్దుర్లు, పొపాలగజ్జి తదితర చర్మవ్యాధుల్నించి కాపాడుతుంది.

నైసిల్‌తో ఈ ఏడు వేసం కాలం మీకు సంతోషప్రదమయ్యేటట్లు చేసుకోండి.

# నైసిల్
గ్లాక్సోవారి అంగరక్షక పౌడరు

dCP/GLN/4i





# జవాబులు

**-మాలతీ చందూర్**

## జి. ఎస్. ఎల్., కామారెడ్డి

"నాకు 13 వ సంవత్సరములో వివాహ మయింది. ఇద్దరు మగపిల్లలు. ఆపరేషన్ చేయించుకున్నాను. నా పెళ్లికి పూర్వమే మా వారికి నలభై వేల కట్నముతో పెండ్లి అయినది. విడాకులు తీసుకొనలేదు. ఆమెను వదిలి నన్ను చేసుకున్నారు. ఏడు సంవత్సరములయినది. ఆమెకు పాలము వ్రాసి ఇస్తానంటే, వాళ్లవాళ్లు, ఆమె వద్దన్నారు. నేను ఉన్నాగాని, ఆమెను తీసుకు వెళ్లి ఇద్దరినీ ఏలుకోమంటున్నారు. . . మా వారు మాత్రము 'నీవు సమర్థించుకుంటానంటే తీసుకు వస్తాను' అంటున్నారు. నాకు సాటి స్త్రీకి ద్రోహము చేస్తున్నానేమో అనిపిస్తూ ఉంటుంది. . ."— మీ వారు చేసినది చట్టరీత్యా శిక్షార్హమగు నేరం. అపరాధం మన్నించి సర్దుకు పోదలిచినప్పుడు ఇంక గొడవేమున్నది? అయితే, మీరు మాటలలో చూపించే ఔదార్యం చేతలలో చూపించగలగాలి.

## సి. ఆర్., ఆలగడప

" 'శ్వేత పత్రం', 'బ్లూ ప్రింట్'— ఈ మాటలకు సరియైన నిర్వచనాలు నేను ఎవరి ద్వారా పొందలేక పోయాను. . ."— బ్రిటిష్ ప్రభుత్వం అధికార యుతంగా ప్రకటించే కరపత్రాన్ని 'శ్వేత పత్రం' (వైట్ పేపర్) అంటారు. ఇక 'బ్లూ ప్రింట్' అనేది నీలం కాగితంమీద తెల్ల గీతలతో గీయబడ్డ సాంకేతిక పటం. స్థూల రూపాన ఉన్న నిర్మాణ పథకాలకు కూడా ఈ మాట వాడతారు. శ్వేతపత్రం లాగానే 'బ్లూ ప్రింట్'కి కూడా ఏమైనా తెలుగు మాట ఉందేమో నాకు తెలియదు.

## వి. జి. కె., తాడేపల్లిగూడెం

"1969 లో అంతరాత్మ పేరిట జరిగిన ఆ సంఘటన లన్నీ జాతీయ కాంగ్రెస్ చరిత్రలో ఓ విషాద ఘట్టమని ఒప్పుకోక తప్పదు. మీ అభిప్రాయమేమిటి?"— 'అంతరాత్మ' సంగతి ప్రజ లేనాడో మరిచిపోయారు. పాత సంగతు లెందుకు తవ్వుతా రింకా! జాతీయ కాంగ్రెస్‌లో వచ్చిన భూకంపాలలో అది అయిదవదో, ఆరవదో! పార్టీ శిక్షణకు కట్టుబడటంగాక, పార్టీనే కూడగట్టుకోవడాన్ని 'పార్టిసిపేటరీ డెమొక్రసీ' అంటారు. అది సామాజిక వాస్తవికతకు సన్నిహితంగా ఉంటుందని చెబుతున్నారు వ్యాఖ్యాతలు. అభ్యర్థికి పార్టీ యంత్రాంగం సహాయం చేస్తుంది. కాని, 'పార్టిసిపేటరీ డెమొక్రసీ'లో పార్టీ కంటె అభ్యర్థి ముఖ్యం. పార్లమెంటరీ నుంచి పార్టిసిపేటరీవైపు నడిచే ఈ చారిత్రక పరిణామంలో కాగడా చేబూనవలసిన భారం ఇందిరా గాంధీపై పడినట్లున్నది. అంతే!

## పి. ఎస్. ఎస్, అనంతపురం

"వివాహం లేక, స్వశక్తిపై బతకగల నంటున్నది ఆమె?" — ఆ అమ్మాయి అభిమతం అలా ఉంటే మీ రెవరు కాదనడానికి? తోడు లేని జీవితంలోని సాధక బాధకాలు అనుభవం మీద గాని తెలియవు. చదువుకి తగ్గ ఉద్యోగం లభించడంతో స్వశక్తి సమ కూడుతుందని కొందరి ఉద్దేశ్యం. అయితే, ఆర్థిక స్వాతంత్ర్యమనేది స్వశక్తికి సోపానం మాత్రమే అవుతున్నది.

## ఎస్. వి., వరంగల్

"మనిషికి, మతానికి సంబంధం ఏమిటి? ఏ మతం స్వీకరించకుండా జీవిత సాఫల్యం ఉండదా? మనిషి మనుగడకు మతం ఒక అంతరాయమేమో?"— మతం అనే పదాన్ని ఇంకొంచెం లోతుగా పరిశీలించ గలిగినప్పుడు మీకీ సందేహాలు కలగవు. సామాన్యులు మౌఢ్యాన్నే మతంగా భావిస్తారు. మీలో హేతువుకి అందని పరమార్థమున్నదే, అదే మతం. పేర్లు పెట్టి, రూపాలు ఆపాదించడంవల్ల దేవు డేమయాడో మతమూ అదే అవుతుంది. జనన మరణాల జీవిత వలయానికి దేవుడూ, మతమూ పూర్వార్ధ ఉత్తరార్ధాలుగా మానవ సంస్కృతి మహా సౌధాలు నిర్మించుకుంది.

## పి. బి. ఎల్., కంకటపాలెం

"ఆమె నన్ను ఒక ఆడపిల్లగా చూడదు— తన దృష్టిలో నే నొక హీరోని. ఆ మధ్య ఒక వార్త చదివాను . . . ఆపరేషన్ ఎక్కడ జరిగేదీ, ఎంత ఖర్చయేదీ వివరంగా తెలుప ప్రార్థన. నా కోరిక సఫల మవటానికి మీరు చేయూత నివ్వగలరని..."— విచిత్ర వార్తల చదివి వెర్రి భ్రమను చెందకండి. కళాపూర్ణోదయం, నారద నారదీయం— ఇటువంటివి భావుకతతో కూడిన కల్పిత గాథలు. సృష్టి న్యాయాన్ని ఏ మహాశక్తి కూడా మార్చలేదు. స్త్రీలు పురుషులుగా మారడం, పురుషులు స్త్రీలుగా మారడం లాటివి ఆదివారం పత్రికల ప్రచురించే అద్భుత వార్తలు. వైద్య విజ్ఞానందృష్ట్యా వీటిలో వీసమెత్తు నిజం ఉండదు. కొన్ని లోపాల సరిదిద్దగలంత వరకే సహాయపడుతుంది సర్జరీ.

## ఎస్ ఎమ్. ఆర్, అలుగడ్డబావి

"మన ఆదాయములో ఎక్కువ భాగము ధని వర్గమునకే చెంది, కొద్ది శాతమే ప్రజలు అను వించుట నిజం కాదా?"— ప్రమాదకరమగు 'సగ నిజాల'లో ఇది ఒకటి. వర్గాలూ, తరతమ భేదాలూ ఆస్తిలో, అందంలో, అంతస్తులో, అవకాశంలో ఎక్కు తక్కువలూ—ఇలాటివి అన్ని దేశాలలోను, అన్ని కాలా లోను ఈ నరజాతి పృథ్వీస్థలిపై ఉన్నంతవరకు ఉంటూనే ఉంటాయి. అయితే, ప్రతి ఒక్క

ఎల్. కృష్ణమూ



అంతరంగమనేది ఒక అమూల్యసంపద. ఈ 'అంతరంగం' బయట ప్రపంచంలోని ఎగుడుదిగుళ్ళని సమన్వయ పరిచే మనోదృశ్య పరిమళ గాన పేటిక. సిరిసంపదలనే 'కాపిటల్' అంటారు. ఈ 'కాపిటల్' కొందరి ఇష్టాను సారం గడ్డి కట్టడంగాక, ప్రభుత్వాధీనంలో ఉండటం 'సోషలిజమ్'. ఏ దేశంలోనైనా ఉత్పత్తినిబట్టే ఆదాయం పెరుగుతుంది. పరిశ్రమలు ( భారీవి— మిగతా రెండూ కూడా ) ప్రజకు అవసరమైన దానికంటె ఎక్కువ సరుకుని ఉత్పత్తి చేసి, ఎగుమతిని పెంచడంవల్ల జాతీయాదాయం వృద్ధి పొందుతుంది. రష్యాలో పెళ్లి అయిన పది నెలలకుగాని కాపరం పెట్టేందుకు వాటా దొరకదు. అమెరికాలో అపార్ట్‌మెంటు భవనాలకు రిపేర్లు చేయించలేకా, పన్నులు కట్టలేకా స్వంతదారులు వాటి నలా గాలికి వదిలేసి, కావలిస్తే మునిసిపాలిటీని స్వాధీనం చేసుకోమంటున్నారు. పెద్దపట్నాలలోని ట్రాఫిక్ పాయింట్లవద్ద కారుల క్యూలు మన దేశంలో మనకి అలవాటైపోయాయిగాని, పెకింగ్ మహానగరంలో పది లక్షల సైకిళ్ళ గంటల సంగీతమే తప్ప, కారు హారన్ వినపడటం అరుదు. ఉపన్యాసపు టావేశంలో 'తూర్పున తెల్లబడింది' అని కలగనడంగాక, మన చిన్న ప్రపంచం లోని కాలుష్యాలను మనకు చేతనైనంతలో కడిగివేయ బూనుకుంటే, నవప్రపంచనిర్మాణానికి ఒక రాయి నందించినవార మవుతాం.

**బి. ఆర్. ఆరి., ఖరగ్‌పూర్**

"అనేక విషయాలు తెలుసుకోవటానికి మీరు జరిపే నిరవధిక కృషి ప్రశంసనీయం. 'డోమ్స్ డే బుక్ మేడ్ 1085'—ఇదేమిటో తెలుసుకోవటానికి మీా కీ జాబు వ్రాస్తున్నాను. సంక్షిప్తంగానైనా విషయ వివరణ పొందగలసనే. . ."— అది 1085 కాదేమో, 36 ఏమో! ఒక్క సంవత్సరానిదేముందిగాని, 1066లో నార్మనులు ఇంగ్లాండుపై దాడి సలిపి, 1087 నాటికి సమస్తం తమ వశం చేసుకున్నారు. నేటి ఆంగ్ల చరిత్ర 'నార్మన్ కాన్‌క్వెస్ట్'తో ప్రారంభమవుతుంది. నార్మండీ ప్రభువే విలియమ్ ది కాన్‌కరర్‌గా ఆంగ్ల సింహాసన మధిష్ఠించి, సాక్సన్ పాలకుడు హెరాల్డ్‌ని 1069 నాటి హేస్టింగ్స్ యుద్ధంలో సంహరిస్తాడు. వ్యతిరేకశక్తులను నేలరాచి, తమ పద్ధతులు, తమ పాలనా విధానం, తమ మతవిశ్వాసం ఇంగ్లాండులో ప్రవేశపెడతారు నార్మనులు... డూమ్స్ డే వేరు; డోమ్స్ డే బుక్ వేరు. డూమ్స్‌డే అనగా మానవులు చేసిన పాపపుణ్యాలకు దేవుడు తీర్పు చెప్పే రోజు — ది డే ఆఫ్ జడ్జిమెంట్. డోమ్స్ డే బుక్ అనగా నార్మన్ విజేతలు 11వ శతాబ్ది నాటి ఇంగ్లాండ్‌ని తమ పాలనాసౌకర్యం కోసం ఆయా 'షైర్స్'గా ( రాష్ట్రాలు లేక మండలాలు ) విభజించిన మీదట ఏయే 'మానార్'కి (సంస్థానం లేక జాగీరు) ఎంత భూసంపద, జనసంపద, మృగసంపద ఉన్నదీ క్రోడీకరించి తెలిపే ఆస్తిలెక్కల పుస్తకం. విలియమ్ రాజు తాను విధించబోయే పన్నుల కోసం దీనిని తయారు చేయించాడు. 1066కి పూర్వం భూస్వాములు రాజుకి చెల్లిస్తున్న పన్ను ఎంతో, 1086 నుంచి ఎంత హెచ్చు చెల్లించాలో, బంగారం ధర పెరుగుదల మొదలైనవన్నీ సవిస్తరంగా ఈ పుస్తకంలో చేర్చారు. ఆధునిక ఆంగ్ల చరిత్రకు 'డోమ్స్ డే బుక్' ప్రారంభ వాచకం వంటిది.

★

# సంపూర్ణ రామాయణము

రామాయణ గాథ ఎన్ని మారులు చూసినా, వినినా తనివితీరదు. ఎప్పటికప్పుడు దానిలో కొత్తదనము గోచరిస్తూనే ఉంటుంది. ఆ గాథలో ఉన్న గొప్ప విశేషం ఇది. లక్ష్మీ ఎంటర్‌ప్రైసెస్‌వారు రంగులలో భారీ ఎత్తున నిర్మించిన 'సంపూర్ణ రామాయణము' నవరసభరితంగా ఉంటూ, అత్యంత ఆకర్షణీయంగా ఉంది. రామాయణ గాథలోని ముఖ్య ఘట్టాలను ఏర్చి కూర్చి ఒక రమణీయ దృశ్యకావ్యంగా దీనిని రూపొందించారు. ప్రతి ఘట్టాన్ని నిండుదనంతో వెల్లివిరిసేటట్లు శ్రద్ధ తీసుకున్నారు. సంభాషణలు ఉన్నతస్థాయిలో తూచి వాడబడినాయి. ఈ ఘనత శ్రీ ఆరుద్రకు, శ్రీ ముళ్లపూడి వెంకటరమణకు దక్కుతుంది. శ్రీ కె. వి. మహదేవన్ సంగీతం అద్యంతం ఆహ్లాదకరంగా ఉంది. టైటిల్స్‌వద్ద "రఘువంశ సుధాంబుధి చంద్రశ్రీ" బ్యాక్‌గ్రౌండ్ పాటగా వేసి ప్రేక్షకులకు చిత్రమహిమను ఆస్వాదించే మనఃస్థితి కల్పించారు. ఇది బాగుంది. శ్రీ కె. ఎస్. ప్రసాద్ ఛాయాగ్రహణం, శ్రీ రవికాంత్ తాంత్రిక ఛాయాగ్రహణం చిత్రానికి మంచి పరిపుష్టిని చేకూర్చినాయి. శ్రీ ఎ. కె. శేఖర్ కళా దర్శకత్వం కనువిందుగా ఉంది. ఇతర సాంకేతిక విలువలు మెచ్చుకోదగిన స్థాయిలో ఉన్నాయి. శ్రీ బాపు దర్శకత్వం ప్రతి ఒక్కరి ప్రశంసలందుకుంటుందనుటలో సందేహం లేదు.

యుద్ధంతో చివ... రావణుని ఆత్మవిలాపం, కుంభకర్ణుని నిద్ర లేపటం వంటి ఘట్టాలు దర్శకుని ప్రతిభావ్యుత్పత్తులకు తార్కాణాలుగా భాసిస్తున్నాయి.

శ్రీరాముడుగా శోభన్‌బాబు ... పాత్రపోషణ చూడముచ్చటగా ఉన్నాయి. రావణుడుగా రంగారావు ప్రదర్శించిన నటనా చాతుర్యం ప్రతి ఒక్కరిని ఆకట్టుకుంటుంది. దశరథుడుగా గుమ్మడి, కైకగా జమున, భరతుడుగా చంద్రమోహన్, లక్ష్మణుడుగా నాగరాజు, హనుమంతుడుగా అర్జా జనార్దనరావు ప్రతిభావంతంగా నటించారు. సీతగా చంద్రకళ విగ్రహం తగినంతగా లేకపోయినప్పటికీ చక్కని అభినయంతో ఆ పాత్రను గొప్పగా పోషించింది. ఇతర ముఖ్యపాత్రలలో హేమలత, జూనియర్ శ్రీరంజని, ధూళిపాళ, సత్యనారాయణ, కృష్ణకుమారి, మిక్కిలినేని, ఛాయాదేవి, నాగయ్య, మాధవపెద్ది సత్యం, జి. ఎస్. స్వామి, పండరీబాయి, వల్లం నరసింహారావు ఎంతో బాగా రాణించారు.

పండితులను, పామరులను విశేషంగా ఆనందింపజేయగల ఈ చక్కని చిత్రానికి నిర్మాత శ్రీ నిడమర్తి పద్మాక్షి. లక్ష్మీ ఫిలిమ్స్ ద్వారా ఈ చిత్రం ఆంధ్ర అంతటా విడుదల అయింది.

— వెంకట్



హరికృష్ణా ఫిలిమ్స్ 'రాజమహల్'లో జ్యోతిలక్ష్మి

# వంశోద్ధారకుడు

ఒంట్లో నలతగా ఉంటోందని, అన్నం సహించడం లేదని చెప్పటానికి గౌరి డాక్టరు జంబులింగం ఆస్పత్రికి వెళ్లింది. అప్పటికే డాక్టరు జంబులింగం లక్ష్మి అనే పేషంటుని పరామర్శిస్తున్నాడు. గౌరి బెంచి మీద కూర్చుంది.

"మొన్నే పెళ్లయింది కదా, అప్పుడే ఏమొచ్చింది, చిట్టి తల్లీ, నీకు?" అని అన్నాడు డాక్టరు చనువుగా, లక్ష్మిని పరీక్షిస్తూ.

"ఒళ్లంతా బరువుగా ఉంటోందండి."

"అన్నం సహిస్తోందా?"

"లేదండి."

"నాకు తెలుసు. ఎలా సహిస్తుంది? చింతకాయలు, మామిడికాయలు తినాలనిపిస్తోందా?"

"అవునండి." అమాయకంగా అన్నది లక్ష్మి.

ఆ లక్షణాలే తనకూ ఉండటంతో గౌరి గతుక్కుమంది.

"వాంతులో?"

"చాలా అవుతున్నాయండి."

తన లక్షణాలన్నీ డాక్టరు ఎలా పసిగట్టాడా అని ఆశ్చర్యపోయింది లక్ష్మి. గౌరి గుండెల మీద చెయ్యి వేసుకుంది.

"వెరీ గుడ్." అని అన్నాడు డాక్టరు పరీక్ష ముగిస్తూ.

"వాంతులంటే వెరీ గుడ్ అంటారేమిటండీ ..."

"ఎందుకా, చిట్టితల్లీ, తెలీదూ ... సరేలే. ఈ జబ్బుకి కావలసింది మందులు కాదు—పుష్టిగా మంచి టానిక్కులు. నువ్వు తల్లివి కాబోతున్నావ్."

లక్ష్మి ఆనందంతో ఉక్కిరిబిక్కిరయితే, గౌరి భయంతో కంపించిపోయింది. తల్లి కాబోయే లక్షణాలు

తవకే ఉన్నాయి. పెళ్ళయిన పిల్ల తల్లి కాబోతుంటే అయిన వాళ్ళందరూ ఆనందంతో అడుగులకు మడుగు లొత్తుతారు. అదే తనలాంటి పెళ్ళికాని పిల్ల తల్లి కాబోతుందంటే సమాజం కాకిగోల పెట్టి, ఇనుప ముక్కులతో పొడుస్తుంది. వచ్చిన పని గుమ్మంలోనే అయిపోవటంతో దడదడలాడే గుండెలతో, కంపించే కాళ్ళతో బైటికి నడిచింది గౌరి.

మాధవీ ఆర్ట్స్ ప్రొడక్షన్స్ వారి 'వంశోద్ధారకుడు' చిత్రంలో ఒక ముఖ్యమైన సన్నివేశం ఇది. ఈ విశిష్ట మైన చిత్రం త్వరలో ఆంధ్ర అంతటా లక్ష్మీ ఫిలిమ్స్ ద్వారా విడుదల కాబోతున్నది. సంభాషణలు శ్రీ ఎస్. ఆర్. నంది. సంగీతం శ్రీ ఘంటసాల వెంకటేశ్వరరావు. దర్శకత్వం శ్రీ పి. సాంబశివరావు. నిర్మాత శ్రీ ఎ. ఎస్. ఆర్. ఆంజనేయులు.

## మానవుడు - దానవుడు

మెడికల్ కాలేజి విద్యార్థి, విద్యార్థినులందరూ తమ ప్రిన్సిపాల్ చెప్పిన ఆఖరి సందేశాన్ని నెమరు వేసుకుంటూ వెళ్ళిపోయారు. కాని, వేణు ఒంటరిగా కూర్చుండిపోయాడు. రాధ అతని వెనకగా వచ్చింది.

"వేణూ! బయటికి నీ వెంత నిశ్శబ్దంగా ఉన్నా, నీ మనసు చేస్తున్న చప్పుడు వినిపిస్తూనే ఉంది. మాట్లాడు, వేణూ, ఏమిటో నీ మనసులో బాధ ... నేను వినదగ దాన్ని కానా ..."

"వినలేవు, రాధా ... నా హృదయంలో ప్రజ్వలిస్తున్న అగ్ని పర్వతాల శబ్దాన్ని నువ్వు తట్టుకోలేవు."

"అది హృదయానికే సంబంధించినదైతే దాన్ని భరించగలిగింది నే నొక్కదాన్నే. అవును, వేణూ! నీ హృదయంలో నాకే స్థానముంది ... నువ్వు నన్ను ప్రేమిస్తున్నావు?"

"రాధా!"

"అబద్ధమాడడానికి ప్రయత్నించకు, వేణూ! చెప్పు .... నన్ను ప్రేమిస్తున్నావా? ఒక్కసారి చెప్పు, వేణూ!"

"నే నంటూ ఉంటే నాకు చివరకు మిగిలేది నీవే, రాధా! కాని, ఆ అవకాశం లేదు..."

"వేణూ!"

"అవును, రాధా! నా ధ్యేయం అలాంటిది ... ఆ ప్రయత్నంలో నా ప్రాణాలు పోవచ్చు. ఒక వేళ బ్రతికినా ఉరికంబానికి బలి కావచ్చు. నన్ను మరిచిపో, రాధా ... మరిచిపో!"

"మరిచిపోవడమా? ఎంత తేలికగా చెప్పావ్, వేణూ! ... వేణూ! నీ వెడల నన్ను చేరనీ! నీ సుఖ దుఃఖాలలో నన్ను పాలు పంచుకోనీ! నిన్ను పూజించి, ఆరాధించి, నీ బిడ్డలకు తల్లినై నన్ను తరించనీ!"

"రాధా! నీకు తెలియదు, నా జీవితంలో స్త్రీకి స్థానం లేదు."

"నీ హృదయంలో నాకు స్థానముంది. జీవితంలో స్థానం ఏనాటికైనా వస్తుంది. నాకా నమ్మకం ఉంది. అంతవరకు నిరీక్షిస్తాను. అది సంవత్సరాలే కానీ, జన్మలే కానీ ..."

పవిత్ర ప్రేమజీవుల సహృదయాల పటుత్వం పరిపక్వత చెందిన ఈ సన్నివేశంలో రాధగా శారద, వేణుగా శోభన్‌బాబు ఎంతో విశిష్టంగా నటించారు. చిత్రాతి చిత్రమైన కథాసంవిధానం గల ఉషశ్రీ వారి 'మానవుడు — దానవుడు' చిత్రం త్వరలో నవయుగ ద్వారా విడుదల కాబోతున్నది. సంభాషణలు శ్రీ మోదుకూరి జాన్సన్. సంగీతం శ్రీ అశ్వద్ధామ. దర్శకత్వం శ్రీ పి. చంద్రశేఖరరెడ్డి. నిర్మాత శ్రీ పి. చిన్నపరెడ్డి.

## నీతి - నిజాయితీ

భుజంగరావు భవనంలో పెద్ద హాలు ... ఎంతో కోలాహలంగా ఉంది. ఆ రోజు భుజంగరావు పుట్టిన రోజు. బెంగుళూరు ఆఫీసు భాగస్వామి కృష్ణకాంత్, భుజంగరావును రోజా మాలతో సత్కరిస్తాడు. భుజంగరావు రెండవ కుమారుడు ఆనంద్ ఒక పెట్టెను తండ్రిచేతి కందించి కాళ్ళకు నమస్కరిస్తాడు. మాటలతో చెప్పలేని ఆనంద్ ఇచ్చిన పెట్టె తెరిచిచూస్తే, 'నాన్నా! మీ పుట్టిన రోజు పండుగ నాడు మీకు నా కానుక ఇది' అని వ్రాసి యుంచిన కాగితం, ఒక పేనా ఉంటాయి. భుజంగరావు కళ్లల్లో నీళ్ళు నిండుతాయి. మనసు పులకరిస్తుంది. తన కొడుకుని కౌగిలించుకుంటాడు. తన కొడుకు ఆనంద్ కలిగించిన ఆనందం మాటల్లో చెప్పలేనని పొంగిపోతాడు.

"తుంబా సంతోష భుజంగరావు. అభినందన. ఇక్కడ మీ చిన్నకొడుకు మీకంటి కెదురుగా ఆనందం! అక్కడ మీ పెద్దకొడుకు దొడ్డ వ్యాపారం"

"మా రమేష్!"

"హౌదు. లక్ష రూపాయ వ్యాపార. టోకియోకి పదివేలు తక్కువైతే నే ఇచ్చాను."

"పదివేలా!"

రమేష్ గుర్రపు పందాలలో పదివేలు పోగొట్టుకున్నాడని లోగడ పుణ్యకోటి చెప్పినది నేడు కృష్ణకాంత్ మాటల వల్ల యథార్థమైనదని తెలుసుకొని గుండె బాధతో భుజంగరావు కుర్చీలో కూలిపోయాడు

"పుణ్యకోటీ! పెద్దబ్బాయిని వెంటనే రావల్సిందని టెలిగ్రాం ఇవ్వు."



పూర్ణిమా పిక్చర్స్ 'శ్రీ కృష్ణాంజనేయ యుద్ధం'లో రామారావు, వాణిశ్రీ

భానూ మూవీస్ 'కన్నతల్లి'లో శోభన్‌బాబు, చంద్రకళ





మాధవీ ఆర్ట్ ప్రొడక్షన్స్ 'వంశోద్ధారకుడు'లో
కాంచన, రంగారావు, బేబీ డాలి, మాలతి

శ్రీ సంజీవి మూవీస 'నీతి-నిజాయితీ'లో
గుమ్మడి, కృష్ణంరాజు

గంభీరమైన ఈ సన్నివేశం శ్రీ సంజీవి మూవీస్ వారి 'నీతి నిజాయితీ' చిత్రంలోనిది. త్వరలో ఈ చిత్రం శ్రీ ఫిలిమ్స్ ద్వారా విడుదల కాబోతున్నది. సంగీతం శ్రీ ఎస్. రాజేశ్వరరావు. దర్శకత్వం శ్రీ శింగీతం శ్రీనివాసరావు. ఎక్జిక్యూటివ్ ప్రొడ్యూసర్ శ్రీ ఎస్. శంకరరెడ్డి.

## అన్నపూర్ణ ఆర్ట్ పిక్చర్స చిత్రం

కోపం మనిషిని గుడ్డివాణ్ణి చేస్తుంది. ఆవేశం పిచ్చివాణ్ణి చేస్తుంది. సహజమైన మానవ బలహీనతలకు అతీతుడైన వ్యక్తి కూడా క్షణికావేశం కలిగించిన ఉన్మత్తతలో చెయ్యరాని తప్పు చెయ్యటం మానవ నైజం. తప్పుచేయటం మానవ సహజం అయితే, చేస్పిన తప్పును దిద్దుకోవటానికి ప్రయత్నించటం మానవులకు దైవత్వాన్ని ఆపాదించి పెడుతుంది. తను హారతి కర్పూరంలా హరించుకుపోతూ తనవల్ల అపకారం జరిగిన వారి బాటను వెలుగుల మయం చెయ్యటానికి తన సర్వస్వాన్ని త్యాగం చెయ్యటానికి సిద్ధపడ్డ ఉదారమూర్తి పవిత్ర గాథ అన్నపూర్ణ ఆర్ట్ పిక్చర్స్ వారు ఈస్ట్‌మన్ కలర్‌లో నిర్మిస్తున్న రెండవ చిత్రం. శ్రీమతి యద్దనపూడి సులోచనారాణి నవల 'విజేత' ఈ చిత్రానికి ఆధారం.

ముఖ్య పాత్రలలో నాగేశ్వరరావు, వాణిశ్రీ, అంజలీదేవి, గుమ్మడి, పద్మనాభం, రాజబాబు, నాగయ్య, అల్లు రామలింగయ్య, రమాప్రభ, లీలారాణి, వై. విజయ, సూర్యకాంతం, రాధాకుమారి, మాస్టర్ ఆదినారాయణ, మాస్టర్ రమేష్ బాబు ఉన్నారు. అతిధినటుడు ఎస్. వి. రంగారావు. సంభాషణలు ఆచార్య ఆత్రేయ. సంగీతం శ్రీ కె. వి. మహదేవన్. ఛాయ శ్రీ సెల్వరాజ్. కళ శ్రీ జి. వి. సుబ్బారావు. సహదర్శకుడు శ్రీ కె. రామిరెడ్డి. దర్శకత్వం శ్రీ ఆదుర్తి సుబ్బారావు. సహ నిర్మాతలు శ్రీ జి. ప్రసాద్, శ్రీ పి. గంగాధరరావు. నిర్మాత శ్రీ దుక్కిపాటి మధుసూధనరావు. విశాలాంధ్ర అంతటా అన్నపూర్ణ ఫిలిమ్స్ ద్వారా ఈ చిత్రం విడుద లవుతుంది.

## కిలాడీ బుల్లోడు

లీలం అనే అమ్మాయి, శేఖర్ వద్దకు వచ్చి గుడ్ మార్నింగ్ చెప్పింది.

"వెరీ గుడ్‌మార్నింగ్. . . ఏమిటి విశేషం?"

"రేపు నా బర్త్‌డే. . ."

"అట్లాగా. . . కంగ్రాచులేషన్స్!"

"థాంక్ యూ. . . ఊరికే కంగ్రాచులేషన్స్ చెప్పడం కాదు. బర్త్‌డే పార్టీకి రావాలి."

"తప్పకుండా. . . ఎక్కడ పార్టీ?"

"ఒన్‌నైన్‌టేఫైవ్—గిండీ హైరోడ్. . . తప్పకుండా వస్తారుకదూ. . ."

"ఓ యస్. . ."

"మీ కోసం ఎదురు చూస్తుంటాను."

ఇంతలో చంద్ర అక్కడికి వచ్చింది. శేఖర్ ఆమెను లీలకు పరిచయం చేశాడు.

"మీట్ మిస్ చంద్ర. . . ఈమె. . ."

"లీల. . . గుడ్‌మార్నింగ్. . . రేపు నా బర్త్‌డే. . . శేఖర్‌తోపాటు మీరుకూడా పార్టీకి రావాలి."

లీల వెళ్లిపోయిన తరవాత, ఎవ రా అమ్మాయి అని చంద్ర అడిగింది.

"అవునూ. . . ఎవ రా అమ్మాయ్?"

"ఓహో. . . ఎవరో తెలియకుండానే అంత దగ్గరైందా?"

"దానిదేముంది. . . నువ్వు మాత్రం మొదట్లో నాకు తెలిశావా?"

"అంటే నీకు నేనూ, ఆ అమ్మాయి ఒకటే నన్నమాట."

"నో నో. . . అది ఇది కాదు. ఇది అది కాదు. అక్కడే ఉంది తమాషా. నువ్వు నువ్వే. ఆ అమ్మాయి ఆ అమ్మాయే. . . నువ్వు నాకు హృదయం ఇచ్చావ్. నేను పుచ్చుకున్నాను. నేను ఆ అమ్మాయికి ఏమీ ఇవ్వలేదు. ఆ అమ్మాయి నా కేమైనా ఇస్తుందేమో ఇంకా తెలియదు."

"చాలు చాల్లే నీ నంగనాచి కబుర్లు. . . నీ గోపాలకృష్ణుని లీలలు నాకు బాగా అర్థమైపోయాయి. నువ్వింత మోసగాడివని తెలిసుంటే అసలు నీతో స్నేహం చేసేదాన్ని కాదు."

"అరెరే. . . ఈ కాస్తలోనే ఇంత ఇదై పోతావేం . . . ఆ అమ్మాయి ఎవరో, నే నెవరో. . . ఈ హోటల్లో పరిచయమే. . . అంతకుమించి నే నేమీ ఎరగను."

"అదే. . . హోటల్లో పరిచయమే. . . ఏమీ ఎరక్కపోతేనేం? పాపం, ముద్దుకూడా పెట్టుకుంది మరి. . ."

"ఓ అదా ... అవన్నీ ఇంగ్లీషు పద్ధతులోయ్. . . కావాలంటే నువ్వుకూడా. . ."

"పెట్టుకుంటా. . . పెట్టుకుంటా. . . నీ ఇంగ్లీషు పద్ధతులేంటో, తెలుగు పద్ధతులేంటో తేల్చేస్తాను."

కమనీయమైన ఈ సన్నివేశం చిత్రకళా ఫిలిమ్స్ వారి పూర్తి రంగుల చిత్రం 'కిలాడీ బుల్లోడు'లోనిది. ఆకర్షణీయమైన ఈ చిత్రం త్వరలో ఆంధ్ర అంతటా విడుదల కాబోతున్నది. రచన శ్రీ టి. పి. మహారథి. సంగీతం శ్రీ టి. చలపతిరావు. దర్శకత్వం శ్రీ నందమూరి రమేష్. నిర్మాత శ్రీ నందమూరి సాంబశివరావు.

## రాజమహల్

లత ఫోన్‌లో మాట్లాడుతున్నది.

"హలో! ఆ! నేనే లతను. . . ఇక మీ కార్యకలాపాలు నిరభ్యంతరంగా కొనసాగించండి. మనం ఏమాలించినట్టు ఈ లౌకికం మెడికల్ ఏజెంటు

కాదు. ఇతను గోపికి అసిస్టెంటుగా అప్పాయింట్ చేయబడ్డ డిటెక్టివ్ శ్రీధర్. ఇతని సంగతి నేను చూసుకుంటాను. ఇతని వలన మన కే ఆటంకమూ ఉండదు. ఈ విషయం వెంటనే డాడీకి తెలియజెయ్! ఉంటా!"

లత మాట్లాడటం పూర్తిచేసి టెలిఫోన్ పెట్టేసింది. వెనకగా ఆమెకు తెలియకుండా లోకికం వచ్చాడు.

"ఉండటానికి వీల్లేదు. . . నువ్వు నా సంచన క్షణం నిలుచోడానికి వీల్లేదు, అమ్మా. . . అనాథవని ఉద్యోగమిస్తే అందల మెక్కావ్!"

"బాస్!"

"గాన్! నేను నీకు బాసును కాదు, పీసునూ కాదు. చెప్పు. ఎవరు నువ్వు?"

"మీరే దైవమని, నా జీవిత భాగస్వామివని ఎంచుకున్న ఒక అభాగ్యురాలిని. . . మిమ్మల్ని ప్రతి రోజూ కలలో ప్రేమిస్తూ నా ఆశ తీర్చుకుంటున్నాను, సార్! ఆ ఆశకూడా లేకుండా చేస్తారా?"

"మ ర్విప్పుడు ఫోన్ చేసిందెవ్వరికో చెప్పకపోతే, ధనాధన్. . . ఒక్కటే గుండు. . . ఆడదానివి కాబట్టి అరగుండు చాలు. . . చెప్పు."

"ఆహా! అంతకంటే నా జీవితానికి కావలసిందేముంది? ఎవర్నయితే సర్వస్వంగా ఎంచి జీవిస్తున్నానో వారే నన్ను కాల్చి చంపితే అంతకన్నా మోక్షమింకోటుంటుందా?. . . పోబోయేముందు నా దో చిన్న కోరిక. . . పిస్టల్‌తో కాల్చిన తరవాత నన్ను పూడ్చిపెట్టండి కాని, దహనం చెయ్యకండి. రెండు సార్లు కాలిపోయిందన్న నింద నాకు రానీయకండి."

"డార్లింగ్! రాత్రేమైనా సతీ అనసూయ సినిమా చూశావా? లేకపోతే ఇంత పేథాస్ డైలాగులు నీ కెలా వచ్చాయి. . ."

"స్వామీ! మీరు కన్నీళ్లు కార్చకండి. అనాడు పాచిక దెబ్బతిన్న ధర్మరాజు రక్తపు బొట్టు రాల్చడం గమనించిన పాంచాలి ఎంతగా విలపించి పోయిందో, అంతకంటే ఎక్కువగా మిమ్మల్ని నమ్ముకున్న ఈ లత కుమిలిపోతుంది."

"లతా. . . కుమలకు. . . కుమిలితే ఈ అందం పోతుంది. నువ్వు నిజంగా ఆ పాంచాలికన్నా పతివ్రతవే! నిన్ను నా గుండెల్లో చేర్చుకుంటాను."

"ఏమండీ. . ."

"ఏమండీ. . . ఒక చిన్న సందేహం. . ."

"ఏమిటది?"

"పాంచాలికి అయిదుగురు భర్తలు కదా! మరి నువ్వు పాంచాలికన్నా పెద్ద పతివ్రతవని చెప్పావే. నీకు నాతో కలిపి పది మంది భర్తలుంటారా. . .?!"

హాస్యభరితమైన ఈ సన్నివేశం హరికృష్ణ ఫిలిమ్స్ వారి 'రాజమహల్' చిత్రంలోనిది. త్వరలో ఈ చిత్రం రాజశ్రీ ద్వారా ఆంధ్రలో విడుదలవుతుంది. సంగీతం శ్రీ టి. వి. రాజు. దర్శకత్వం శ్రీ బి. హరినారాయణ. నిర్మాత శ్రీ బి. వి. కృష్ణమూర్తి.



పగ ప్రతీకారాలతో జ్వలించే డాక్టర్ వేణు పగ తీర్చుకోవాలంటే వృత్తిధర్మం మాటి మాటికి అడ్డు వస్తోంది. డాక్టర్‌గా ప్రాణం తీయలేక, పగ పట్టిన మానవుడిగా ప్రాణం పోయలేక కుమిలిపోయే డాక్టరు వేణు. . . తాను కోరిన ప్రతిఫలమిస్తే పచ్చి నెత్తురు తాగే కసాయి జగన్. . . తనపై పగబట్టిన వేణుపై జగన్ నిప్పులు కక్కుతూ కోరిన కార్యం తీర్చుకోవాలని చూసే భుజంగం. . .

ఉషశ్రీవారి 'మానవుడు— దానవుడు' లో శోభన్ బాబు, సత్యనారాయణ, శోభన్‌బాబు. దర్శకత్వం శ్రీ పి. చంద్రశేఖరరెడ్డి. నిర్మాత శ్రీ పి. చిన్నప రెడ్డి. విడుదల నవయుగ

# శ్రీ కృష్ణాంజనేయ యుద్ధం

శ్రీ కృష్ణ పరమాత్ముడు భాగవతోత్తముడు. ఆంజనేయుడు పరమ భక్తాగ్రేసరుడు. అనన్యమ్య లీలామానుషుడు. ఈ భక్తాగ్రేసరుడు పవిత్ర హృదయుడు, అమేయ సంకల్పబలుడు. గోపికాలోలుడైన శ్రీకృష్ణుడు వివిధ ప్రవృత్తుల అధిపతి. వాయు పుత్రుడు చిత్తశుద్ధికి ప్రతినిధి. ఈ రెండు పాత్రల తత్వప్రవృత్తులను ఆధారంగా చేసుకుంటూ, ఆ పాత్రల విశిష్టతను సోదాహరణంగా వివరిస్తూ పూర్ణిమా పిక్చర్స్‌వారు 'శ్రీకృష్ణాంజనేయ యుద్ధం' పేరిట నిర్మిస్తున్న విశిష్టమైన పౌరాణిక చిత్రం షూటింగ్ చాలా వరకు పూర్తి అయింది. త్వరలో ఈ చిత్రం ఆంధ్ర అంతటా విడుదల కాబోతున్నది.

ముఖ్యపాత్రలలో ఎన్. టి. రామారావు, ఎస్. వి. రంగారావు, కాంతారావు, రాజనాల, రాజబాబు, ధూళిపాళ, మిక్కిలినేని, ముక్కామల, నాగయ్య, అర్జా జనార్దనరావు, వాణిశ్రీ, దేవిక, శాంతకుమారి, హేమలత సంధ్యారాణి ఉన్నారు. రచన శ్రీ సముద్రాల జూనియర్. పాటలు శ్రీ నారాయణరెడ్డి, శ్రీ దాశరథి. సంగీతం శ్రీ టి. వి. రాజు. ఛాయ శ్రీ జి. కె. రాము. కళ శ్రీ గోఖలే. కూర్పు శ్రీ జోషీ. నృత్యాలు శ్రీ వెంపటి. దర్శకత్వం శ్రీ సి. ఎస్. రావు. నిర్మాత శ్రీ డి. ఎస్. రాజు. ఈ చిత్రం ఆంధ్రలో తారకరామా ద్వారాను, నైజాంలో ఉషా ఫిలిమ్స్ ద్వారాను, రాయలసీమలో జయలక్ష్మి పిక్చర్స్ ద్వారాను, మైసూరులో ఉమా ఎంటర్‌ప్రైజెస్ ద్వారాను విడుదలవుతుంది. రాముడే దేవుడన్న భావన మంచి నైదొలగని ఆంజనేయునికి, రాముడే కృష్ణుడు, కృష్ణుడూ దేవుడేనన్న తలంపు తలపునకు రావటం ఈ చిత్రకథలోని కీలకం.

# యంగ్ టర్క్స్ ప్రొడక్షన్స్

ప్రొడక్షన్ నిర్వాహకులుగా 15 సంవత్సరాల అనుభవముగల శ్రీ ఎమ్. కె. నాయుడు, శ్రీ చిట్టిబాబు యంగ్‌టర్క్స్ ప్రొడక్షన్స్ సంస్థను నెలకొల్పి ఒక చక్కటి సెంటిమెంటల్ క్రయిమ్ థ్రిల్లర్ నిర్మాణానికి సన్నాహాలు పూర్తిచేశారు. ఏప్రిల్‌లో షూటింగ్ ప్రారంభమవుతున్నది. చిత్రంలో కీలకమైన కొత్త తరహా పాత్రలో మాస్టర్ ప్రభాకర్ కనిపిస్తాడు. నాయకీ నాయకులుగా విజయలలిత, విజయచంద్రులు నటిస్తున్నారు. ఇతర ముఖ్యపాత్రలలో జ్యోతిలక్ష్మి, విజయశ్రీ, జయకుమారి, త్యాగరాజు, ప్రభాకరరెడ్డి, రామదాసు, అర్జా జనార్దనరావు, రాజబాబు, అల్లు రామలింగయ్య మున్నగువా రుంటారని తెలుస్తున్నది. రచన శ్రీ దాసం గోపాలకృష్ణ. సంగీతం శ్రీ పుహళేంది. ఛాయ శ్రీ దేవరాజ్. కూర్పు శ్రీ ఏరప్ప. దర్శకత్వం శ్రీ కె. వి. ఎస్. కుటుంబరావు. నిర్మాతలు శ్రీ చిట్టిబాబు, శ్రీ కె. ఎమ్. నాయుడు. సమర్పణ శ్రీ ఈదర వెంకట్రామయ్య. ★

# అతనంటే నాకు ప్రాణం. అతన్తో ఎట్లా చెప్పేది?

నెల రోజుల క్రితం, ఇల్లొదిలి, ఆఫీసుకైనా ఒరే, రమేష్ బయటకు వెళ్లట మంటేనే రాధకు దుర్భరంగా ఉండేది. ఇప్పుడు, అతని నోటి దుర్వాసన వల్ల, అతనికి దగ్గర్లో ఉండటమే సహించ లేక పోతోంది.


















అమెకు తప్పకుండా తెలుసు బినాకా గ్రీన్ వారిని ఒకరి నొకరికి అత్యంత సన్నిహితులుగా చేసింది.

50g. Bi Binaca®



Binaca Green

రోజంతా, మీ శ్వాసను తాజాగా మధురంగా ఉంచగల, ప్రకృతి యొక్క–స్వకీయ దుర్గంధ నివారిణి క్లోరోఫిల్ బినాకా గ్రీన్‌లో గలదు.

C I B A Cosmetics

mcm/cg/13a tel




గ్రహ గమనాలు, మానవ జీవితంపై వాటి నిరంతర ప్రభావం మున్నగు విషయాలను తెలియజేసే ఖగోళ శాస్త్ర పరిజ్ఞానం భారత దేశానికి బహు ప్రాచీన కాలం నుంచీ ఉంది. ఒక విధంగా ఖగోళ శాస్త్రానికి భారత దేశం పుట్టిల్లు. మన దేశంలో పరాశరుడు, ఆర్యభట్టు, వరాహ మిహిరుడు, భాస్కరాచార్యుడు మొదలైన ఎందరో ఖగోళ శాస్త్ర పరిశోధనలో ప్రఖ్యాతి గాంచారు. ఏ యంత్ర సామగ్రి సహాయం లేకుండా కేవలం గుణించి గ్రహ గమనాలను ప్రజలకు చెప్పగలిగేవారు మన శాస్త్రజ్ఞులు. మనకు ఇప్పటికీ అమలులో ఉన్న పంచాంగాలు ఇందుకు చక్కటి నిదర్శనాలు. సూర్య చంద్రాది గ్రహ గమనాలు, భూగోళంపై వాటి ప్రభావాలు, గ్రహణాలు మున్నగునవి ఇప్పటికీ ఈ పద్ధతి ననుసరించే లెక్కకట్ట బడుతున్నాయి.

మానవ పరిజ్ఞానంతోపాటు ఖగోళ శాస్త్ర పరిశోధన కూడా పురోగమించసాగింది. గ్రహ గమనాలను ఉజ్జాయింపుగా లెక్క కట్టడం వలన నిర్దుష్టత ఎంత లోపించడం గమనించి వీలైనంత నిర్దుష్టతను సాధించడానికి గాను ప్రాచీన శాస్త్రవేత్తలు మన దేశంలో కొన్ని పరిశోధనాలయాలు నిర్మించారు.

మన రాజధానీ నగరం ఢిల్లీలోని 'జంతర్ మంతర్' అట్టి పురాతన పరిశోధనాలయాలలో ప్రసిద్ధి చెందిన నక్షత్ర వేధశాల. దీనిని జైపూర్ మహారాజా జయసింహుడు (2వ సవాయి జైసింగ్–1686—1743) క్రీ.శ. 1724 లో నిర్మించాడు. మన దేశంలో అయిదు ప్రధాన నగరములలో (ఢిల్లీ, జైపూర్, ఉజ్జయిని, కాశీ, ఉత్తర మధుర) వేధశాలలు నిర్మించి, నిర్దుష్టమైన ఖగోళ శాస్త్ర పట్టికలను తయారు చేయుటకు అవిరళ కృషి చేసిన విజ్ఞాన జిజ్ఞాసువు జయసింహుడు. జైపూర్ నగరానికి రూపు రేఖలు దిద్దింది కూడా ఈయనే. ఈ వేధశాలలను నిర్మించడానికి ప్రాతిపదికగా జయసింహుడు చేసిన కృషి కొంత తెలుసుకోవలసి ఉంది. చిన్నప్పటినుండి ఆయనకు ఖగోళ శాస్త్ర పిపాస ఎక్కువ. అప్పటికి వాడుకలో ఉన్న ఖగోళ శాస్త్ర పట్టికలు దోషభూయిష్ఠములని గ్రహించి నిర్దుష్టమైన పట్టికలను తయారు చేయవలెనని పట్టుదలతో పరిశోధనలు సాగించాడు. తనకు లభ్యమైన దేశ, విదేశ శాస్త్ర గ్రంథాలను సేకరించి వాటి నన్నిటిని నిష్పాక్షికంగా, క్షుణ్ణంగా చదివాడు. హిందూ, మహమ్మదీయ, పాశ్చాత్య పద్ధతులను బాగా పరిశీలించాడు. కొన్ని విదేశ గ్రంథాలను తన ఆస్థాన విద్వాంసుడు, ఆంధ్రుడు అయిన జగన్నాథ సామ్రాట్టుచే సంస్కృతంలోనికి అనువదింపజేశాడు. జయసింహుడు అప్పటి ఢిల్లీ చక్రవర్తి మహమ్మద్ షా ప్రోత్సాహ సహకారాలతో మొదట ఢిల్లీలోని 'జంతర్ మంతర్'ను నిర్మించి, దానిపై ఏడు సంవత్సరాలు పరిశోధన చేసి ఆ తరవాత జైపూర్, ఉజ్జయిని, కాశీ, మధుర వేధశాలలను నిర్మించాడు.

ఢిల్లీలోని 'జంతర్ మంతర్'లో సామ్రాట్ యంత్రం, జైప్రకాశ్ యంత్రం, రామయంత్రం, మిశ్ర యంత్రం, నియత చక్రం అనే కట్టడాలు ఉన్నాయి.

'సామ్రాట్ యంత్రం' ఒక ఎత్తైన సూర్య గమన సూచిక. 68 అడుగుల ఎత్తుగల ఈ యంత్రం ఎండగా ఉన్నప్పుడు దీనిపై పడే నీడ సహాయంతో స్థానిక కాలాన్ని తెలుపుతుంది. దీనికి దక్షిణంగా అర్ధగోళాకారంగా ఉన్న రెండు కట్టడాల కలయిక 'జై ప్రకాశ్ యంత్రం'. ఇది జయసింహుని స్వయంసృష్టి. ఇది సూర్యుని స్థానాన్ని సూచిస్తుంది. 'రామయంత్రం' రెండు వర్తులాకారపు పెద్ద కట్టడాలతో నక్షత్ర గమనాలను వివిధ కోణాలలో విశదపరుస్తుంది. 'మిశ్ర యంత్రం' నాలుగు రకాల పరికరాల సముదాయపు కట్టడం. దీని మధ్యలో ఉన్న 'నియత చక్రం' సహాయంతో ఢిల్లీలోని స్థానిక కాలంతో పోల్చి చూస్తే గ్రీన్‌విచ్ మొదలైన ప్రపంచ పట్టణాలలో కాలం ఎంతైందో తెలుసుకోవచ్చు.

విశాలమైన మైదానంలో మనోహరమైన ప్రకృతి సౌందర్యంతో విలసిల్లే ఈ 'జంతర్ మంతర్' ఢిల్లీ సందర్శించే వారికి ముఖ్యమైన దర్శనీయ ప్రదేశాలలో ఒకటి. రెండున్నర శతాబ్దాల క్రిందట రాజా జైసింగ్ నిర్మించిన ఈ 'జంతర్ మంతర్' భారతీయ విజ్ఞాన ప్రతిభ కొక ప్రత్యక్ష నిదర్శనం. ★

రచన, ఫోటో:
ఎ. వి. రమణారావు

నటరత్నాలు

# కడియాల రత్తయ్య

ఆనాడు గుంటూరులో — అంటే 1912 ప్రాంతంలో — పాతూరు హనుమంతరావు, బండారు రామస్వామి నాయుడు, పాదర్తి సోమయ్య, ప్రత్తి సుబ్రహ్మణ్యం మొదలైన వారు మూన్ థియేటర్‌ను స్థాపించారు.

ఈ సమాజంవారు అనేక చారిత్రక నాటకాలనూ, పౌరాణిక నాటకాలనూ ప్రదర్శించారు. 1916 లో గుంటూరులో 'ప్రసన్న యాదవ' నాటకానికీ, రాజమండ్రిలో 'బొబ్బిలి యుద్ధం' కాంపిటీషన్ నాటకానికీ ట్రూపు కప్పును గెలుచుకున్నారు. ఈ సమాజంలో పాత్రలు ధరించిన ప్రముఖ నటులు గోవిందరాజుల వేంకట రామయ్య, అరణి సత్యనారాయణ, కడియాల రత్తయ్య మొదలైనవారు.

కడియాల రత్తయ్యగారు గుంటూరు వాస్తవ్యులు. చిన్నతనం నుంచీ నాటకాల మీద, సంగీతం మీద ఆసక్తి ఉండి మూన్ థియేటర్‌లో ప్రవేశించి బాల పాత్రలు ధరించి, ఆ తరవాత ఆ సమాజం ఆడిన నాటకా లన్నింటిలో స్త్రీ పాత్రను అద్భుతంగా అభినయించి పేరు ప్రఖ్యాతులు సంపాదించుకున్నారు. ఆనాడు అంత అందమైన స్త్రీ పాత్రధారి గుంటూరు నాటక రంగంలో మరొకరు లేరనే కీర్తిని గడించారు.

రాజమండ్రిలో జరిగిన 'బొబ్బిలి యుద్ధం' కాంపిటీషన్ నాటకంలో స్త్రీపాత్ర ధరించిన కడియాల రత్తయ్య





© First Features

## బెలూన్ నుంచి...

బెలూన్ నుంచి గాలిగుమ్మటంతో తొలిసారి నేలమీదికి దిగిన వాడు ఫ్రెంచి బెలూనిస్టు ఆండ్రీ జె. గర్నానిన్. ఫ్రెంచి విప్లవ సమయంలో ఆస్ట్రియన్‌లకు బందీగా ఉన్నప్పు డితను గాలిగుమ్మటం తయారు చేశాడు.

1797 అక్టోబరు 22 వ తేదీన ఇత నో చిన్న బక్కెట్ లాంటి కారులో ఎక్కి, దాని నో గాలి గుమ్మటానికి కట్టి దానిని బెలూన్‌కు తగిలించి పారిస్‌లో ఒక పార్కునుంచి పైకి ఎగిరాడు.

3,000 అడుగుల పైకి వెళ్లాక బెలూన్ తాడు కత్తిరించాడు. అది ఎగిరి పోయింది. వెంటనే 30 అడుగుల ( పారచూట్ ) గాలి గుమ్మటం తెరుచుకుంది. అది అటు ఇటు ఊగిసలాడకుండా ఉండడానికి నేటి పారచూట్‌లకు పైన రంధ్రం ఉంటుంది. దాని కది లేదు కనుక అటూ ఇటూ కొట్టుకొని కొట్టుకొని కడకు అతను తా నెగిరిన తావుకు కాస్త దూరంలో అపాయం లేకుండా కిందికి దిగాడు.

క్షకుల దృష్టిలో చెరగని ముద్ర …రు. ప్రతిభావంతులైన స్త్రీ పాత్ర … అని పేరు గడించారు. ఆ నాట… దర్శించిన సత్యవోలు గున్నేశ్వర …వుగారు రత్తయ్య గారిని వారి చింతా…ణి నాటక సమాజంలో స్త్రీ పాత్ర …రణకు ఆహ్వానించారు.

ఆనాడు చింతామణి నాటక సమాజం …కి కృష్ణా, గోదావరి జిల్లాలలో సమర్థు…వ నటులందరూ ఆకర్షించబడిన …రే. ఈ సమాజంవారు నాటకాలను …త్రమంగా ప్రదర్శించడమే కాకుండా, …రి సమాజాన్ని చక్కని క్రమశిక్షణా …యుంగా తయారు చేశారు. గున్నేశ్వర …వుగారు నాటకాలను వ్యాపార సరళిలో …దర్శించే వారు. నటులకు, సాంకేతిక …వుణులకు జీతాల నిచ్చేవారు. గున్నేశ్వర …వుగారు వారి కున్న యావదాస్తిని …టక కళకే వినియోగించారు. …రు ప్రదర్శించిన నాటకాలన్నీ జన…ంజకాలు. మంచి మంచి పాశ్శీ మట్లతో …టలు, పద్యాలతో నాటకాన్ని చక్కగా …యారు చేసేవారు.

ఇంత గొప్పగా నడిచిన సమాజం …రొకటి లేదని చెప్పవచ్చు. అలాంటి …త్తమ నాటక సమాజంలో స్త్రీపాత్ర …న్నింటినీ రత్తయ్యగారే ధరించేవారు. …త్తయ్యగారు మంచి అందగాడు. …ంద్రని కళ్లు, పెసరకాయ లాంటి ముక్కు, అందమైన చెక్కిళ్లు. ముమ్మూర్తులా స్త్రీ పాత్రకు తగిన అవయవ సౌష్ఠవం కలిగి చూపరుల నిట్టే ఆకర్షించగల స్త్రీ పాత్రధారిగా వెలుగొందారు.

రత్తయ్యగారు అందచందాలకు తోడు శ్రావ్యమైన కంఠం గలవారు. సముచితమైన సంగీత విద్వత్తు గల వారు. ఆ రోజుల్లో ముఖ్యంగా నటులకు రంగస్థలానికి అనువైన అంగ సౌష్ఠవం, చివర కూర్చున్న ప్రేక్షకునికి వినపడగల గొంతు, పద్యాలు పాడగలిగిన శక్తి ఉంటే చాలు. హావ భావ ప్రకటన కొంచెం తగ్గినా, ఆ నటుడు రంగస్థలంలో ఉత్తీర్ణుడైనట్లే.

అంతేకాదు, పురుషుడు ముమ్మూర్తులా స్త్రీలా కనిపించడమే ప్రేక్షకులకు అమితానందాన్ని కలిగించేది. అచ్చం … ఆడదాని మాదిరే ఉన్నాడురా అని ప్రేక్షకులు చెప్పుకుని అబ్బురపడేవారు.

ముఖ్యంగా ఆయన ధరించిన స్త్రీ పాత్ర లన్నింటిలోనూ ఆయా పాత్రలను సాధ్యమైనంత సమర్థనీయంగా నటించేవారట. ఆయన ధరించిన పాత్రలన్నీ — సావిత్రి, రుక్మిణి లాంటి పతివ్రత పాత్రలూ, సాత్విక ప్రధానమైన పాత్రలనే ధరించారట. రత్తయ్య గారి స్త్రీ పాత్ర రంగస్థల ప్రవేశంతోనే ప్రేక్షకుల ఆదరాభిమానాలు పొందేరట. ఆయన మృదుమధురమైన గానానికి ప్రేక్షకులు ఊగిపోయేవారట, స్త్రీ పాత్రలు ధరించే పురుషులకు ఉండ వలసిన సుగుణాలన్నీ ఉన్నాయికాని, శబ్దోచ్చారణలో అప్పుడప్పుడు ఒత్తు అక్షరాలు వచ్చినప్పుడు వాటికోసం వయంలో కొంచెం బాధపడుతూ ఉండేవారట. ఈ ఒక్క లోపం తప్పితే, నాటి ఉత్తమ నటుల సరసను దీటుగానే నిలిచి, తమ స్త్రీపాత్రల కొక ప్రత్యేక స్థానాన్ని సంతరించుకున్నారు కడియాల రత్తయ్యగారు. ఈ వ్యాసంలో ప్రచురించిన ఆయన సావిత్రి స్త్రీ పాత్రను తిలకిస్తే, ఎంత ముగ్ధమోహనంగా ఉందో విదితమౌతుంది. ఆ ముఖారవిందమూ, పాతివ్రత్యం ఉట్టిపడే ఆ భంగిమా ఎవరినైనా ఆకర్షించకుండా ఎలా ఉండగలదు? ఇంతటి విశిష్ట పాత్రలను అభినయించిన కడియాల రత్తయ్యగారిని గురించి తెలిసినవారే లేరు వారి ఊరూ పేరూ, బాల్య చరిత్రా, పూర్వాపరాలూ చెప్పిన వారి సమకాలికులు కూడా చాలా మంది కాల గర్భంలో కలిసి పోయారు. ఇలాంటి మరు…డిపోయిన మాణిక్యాలూ, నటరత్నాలూ ఎందరో… వారిని ఒక్కసారైనా సంస్మరించడం నేట నటుల కనీస ధర్మం. ★

మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి

# బినాకా® వ్యానిషింగ్ క్రీమ్

బినాకా ప్రవేశపెడుతోంది
సహజ సౌందర్యదాయకమైన
ఆడంబరరహితమైన సౌందర్య సాధనం

CIBA Cosmetics

మీ ముఖముపైనను, మెడపైనను, ముఖ్యముగా తళుకు ఎక్కువగా ఉన్న భాగాలపైనను. దీనిని మెల్ల మెల్లగా రుద్దండి. రాసుకున్న జాడే లేకుండా అది మాయమై పోతుంది మీ ముఖములోని తళుకును పిలి పిడలను తనతో పాటే దాచి ఉంచుతుంది మీ ముఖమును నున్నగా, తళుకు లేకుండా స్వభావ సిద్ధంగా ఉంచుతుంది. మీ ముఖముపై రోజంతా ఉన్నా. తేలికగా హాయిగా ఉంటుంది. మీ మేకప్ ఎండి పోకుండా దారిక లేర్పడకుండా చేస్తుంది. మీ ముఖముపై తిరిగి జిడ్డు మరకలు తలెత్తకుండా చేస్తుంది. మీ ముఖానికి ఇంత మేలు చేస్తుంది. కాని తాను మాత్రం బయటకు కనిపించదు ఇదే ఆడంబరరహితమైన మేకప్ యొక్క ప్రత్యేకత. స్వాభావిక రూపము యొక్క సౌందర్యత.

## బినాకా® వ్యానిషింగ్ క్రీమ్




mcm/cv/'6a tel

# 'కళావాహిని' కార్యక్రమం

మద్రాసులో 'కళావాహిని' సంస్థ ప్రతి నెలా ఏదో ఒక సాంస్కృతిక కార్యక్రమం నిర్వహిస్తున్నది. ఈ పరీధావి ఉగాదికి మూడు రోజుల కార్యక్రమాలు నిర్వహించింది. ఉగాదినాడు శ్రీ కృష్ణ గానసభ మందిరంలో తమిళనాడు గవర్నర్ శ్రీ కె. కె. షా ఈ మూన్నాళ్ల వినోద కార్యక్రమాలకు ప్రారంభోత్సవం చేశారు. ఆంధ్రబాంకు డివిజనల్ మేనేజరు, 'కళావాహిని' సారథి అయిన శ్రీ బి. కృష్ణమూర్తి తమ కార్యకలాపాలను వివరించారు. తొలినాడు శ్రీ చిట్టిబాబు వీణ కచ్చేరి జరిగింది. చిన్నవయస్సులోనే వైణిక సార్వభౌమ, వైణిక శిఖామణి, వీణాగాన ప్రవీణ బిరుదులు సంపాదించి, రెండు సార్లు విదేశాలు పర్యటించి వచ్చిన శ్రీ చిట్టిబాబును గురించి, వారి మధుర సంగీత ఝురుల్ని గురించి ఎంత వ్రాసినా కొంచెమే అవుతుంది.

రెండవనాడు బేబి రాజారమణి 'బంగారు పాప' నృత్యనాటిక ప్రదర్శించింది. ఈ చిరంజీవి ఇప్పటికే చాలా బహుమతులు పొంది, పేరు గడించింది. ఆనాడు నాట్యాచార్య వెంపటి శిక్షణలో రాణకొచ్చిన కుమారి ఎ. వి. రాధ కూచిపూడి నృత్యం విశేష ప్రదర్శన. శ్రీ వెంపటి ఢిల్లీలో సిద్ధేంద్ర కళాక్షేత్రం స్థాపించి, కూచిపూడి నాట్యంలో నూరు మందిని తీర్చి దిద్దారు. పదహారేళ్ల సుకుమారి రాధ నూరుకు పైగా ప్రదర్శనలిచ్చి, అనేక బహుమతులు సంపాదించింది.

మూడవనాటి ప్రదర్శన తెనాలి ఆంధ్ర ఆర్టిస్ట్స్ అసోసియేషన్‌వారి 'గయోపాఖ్యానం'. శ్రీ పీసపాటి జగమెరిగిన కృష్ణ పాత్రధారి. ఆయన్ని కృష్ణ పాత్రలో ఎన్నిసార్లు చూచినా తనివి తీరదు, తమి తీరదు. 'కళావాహిని' వారి నిర్వహణలోనే కొద్ది రోజుల క్రితం పీసపాటివారి 'ఉద్యోగ విజయాలు' చూచే అవకాశం మద్రాసు ఆంధ్రులకు కలిగింది. అప్పటికంటే 'గయోపాఖ్యానం'లో కృష్ణుడుగా శ్రీ పీసపాటి ఎక్కువ మనోరంజకంగా నటించారు. నాటకంకూడా బాగా రక్తి కట్టింది. శ్రీ పీసపాటి తరవాత గయుడుగా నటించిన శ్రీ ఉప్పులూరి రాజారావు ప్రశంసావహంగా నటించారు.

'కళావాహిని' కృషి అభినందనీయం. ముఖ్యంగా ప్రెసిడెంట్ శ్రీ బి. కృష్ణమూర్తిగారి కళాభిరుచి, కృషి మెచ్చదగ్గవి—



'సత్యాగ్రహి'లో చంద్రమోహన్, విజయరాధిక

# ఉగాది ఉత్సవాలు



కళావాహిని ఉత్సవాల్లో 'వీణ' చిట్టిబాబు

# 'సత్యాగ్రహి' ప్రదర్శనం

తెలుగు ఉగాదినాడు మద్రాసు మహానగరంలో ఏ పేటకు వెళ్లినా, తెలుగు సంస్కృతి గుబాళింపుల కమ్మదనం కనిపించింది. ఒక నాటకమో, సంగీత కచ్చేరియో, మరొక సాంస్కృతిక సదస్సో తెలుగు వారిని ఆహ్వానించింది. నగరంలో నాలుగు చెరగులా తెలుగుతనం విడిగి విప్పారి, ఇది తెలుగు నగరమే అనిపించింది.

శాస్త్రి భవన్‌లోని ప్రభుత్వోద్యోగులలోని తెలుగు వారంతా కలిసి తెలుగు కల్చరల్ అకాడెమీ స్థాపించి మూడేళ్లు దాటింది. వారు ప్రతి పండగకి, పబ్బానికి ఏదో ఒక సభ, లేక ప్రదర్శన ఏర్పాటు చేస్తూ ఉన్నారు.

ఈ ఉగాదికి ముందు రోజున వాణీమహల్‌లో డాక్టర్ గాలి బాలసుందరరావు వ్రాసిన 'సత్యాగ్రహి' నాటకం మధుర కళానికేతన్‌వారు శాస్త్రి భవన్ తెలుగు కల్చరల్ అకాడెమీ వారి కోసం ప్రదర్శించారు.

'సత్యాగ్రహి' నాటకం మద్రాసులోనే లోగడ రెండు సార్లు ప్రదర్శించడం జరిగింది. ఒక చోట ఒక నాటకం మూడు ప్రదర్శనలు పొందడం విశేషం అని చెప్పవచ్చు. ఈనాటి ప్రదర్శనలో పాత్రధారుల్ని సినిమా నటీనటులు. చంద్రమోహన్, సాక్షి రంగా...

పొట్టి ప్రసాద్, సుబ్బారావు, కుమారి విజయరాధిక, మమత, విజయభాను ప్రధాన పాత్రలను పోషించడం మరొక విశేషం. అందరూ ప్రశంసనీయంగా నటించి రక్తి కట్టించారు. నాటకానికి దర్శకత్వం వహించిన పొట్టి రంగారావు కృషి ప్రతి పాత్రను మలచిన తీరులో ప్రస్ఫుటమైంది. నాటకానికి సంగీతం సమకూర్చిన కె. బాబూరావు, నేపథ్య గాయని విజయబాల, ప్రత్యేకంగా ఆర్కెస్ట్రా బృందం కృషి ప్రేక్షకుల ప్రశంసలు పొందాయి.

చక్కని నటన ప్రదర్శించిన ఒకరికి, జైహింద్ నిత్యం ఒక వెండికప్పును బహూకరించారు. ఆ బహుమతిని వర్తమాన నటి కుమారి మమత గెలుచుకున్నది. న్యాయనిర్ణేతగా శార్వరి వ్యవహరించి, బహుమతి నిర్ణయం చేశారు.

# జనార్దన్ సితార్

దక్షిణాదిని 'వీణ'కు ఎంతటి ఆదరం ఉన్నదో, ఉత్తర భారతంలో 'సితార్'కు అంతకు మించిన ఆదరణ ఉన్నది. సితార్ అనగానే పండిట్ రవిశంకర్ విలాయత్‌ఖాన్ జ్ఞాపకానికి రావడం సహజం. పాశ్చాత్య దేశాలలో సితార్‌కు మరో పేరు రవిశంకర్ అన్నా అతిశయోక్తి కాదు. అటువంటి రవిశంకర్ వద్ద అంతేవాసిగా ఉండి సితార్ వాద్యంలో పాండిత్యం గడించి గురువుకు తగిన శిష్యుడనిపించుకున్న జనార్దన్ మనవాడు. ఈ నాడు దక్షిణ భారతంలో జనార్దన్ సితార్‌కు గౌరవం, ప్రతిష్ఠ ఉన్నాయి.

ఇటీవల మద్రాసులో మధుర కళానికేతన్ వారి మినీ థియేటర్‌లో జనార్దన్ సితార్ వినే అదృష్టం కలిగింది. నిరాడంబరంగా, నిగర్వంగా ఉన్న ఆ వ్యక్తిని చూస్తే, నివురు కప్పిన నిప్పు అనిపించదు. కానీ సితార్ శ్రుతి చేసుకుని, అయిదు నిమిషాలలో శ్రోతల, ప్రేక్షకుల హృదయాల్ని రసప్లావితం చేయగలగడం సామాన్యం కాదు.

జనార్దన్ ఆంధ్రరాజధాని హైదరాబాదులో సంగీత కుటుంబంలో జన్మించారు. కుటుంబంలో సంప్రదాయంగా వస్తున్న సంగీతాభిరుచి జనార్దన్‌కు కలిగింది. వీరికి శాస్త్రీయ సంగీతం అంటే ఇష్టం. ఒకరి సలహా, మరొకరి శిక్షణ లేకుండానే సాధన ప్రారంభించారు. పండిట్ రవిశంకర్ కచ్చేరీలు వినడంవల్ల జనార్దన్‌లో సితార్‌పట్ల ఆసక్తి కలిగింది. తరవాత రవిశంకర్ శిష్యులైనారు. అటు ఇంజనీరింగ్ విద్య చదువుతూ, ఇటు సితార్ అభ్యసించి, కచ్చేరీలు చేసే సామర్థ్యం సంపాదించుకున్నారు.

జనార్దన్ సితార్ వింటూంటే అది రవిశంకర్ వాద్యమేమో అనిపిస్తుంది. గురువుగారి కళలను పుణికి పుచ్చుకుని, మెలకువలను గ్రహించారు. రాగప్రస్తారంలో ఈ యువకుడు అగ్రస్థానం సంపాదించారు.

జనార్దన్ కేవలం గురుకులవిద్యతో, పాండిత్యంతో తృప్తి చెందలేదు. కొన్ని ప్రయోగాత్మక చలన చిత్రాలకు కొత్త బాణీలతో సంగీతం కూర్చారు. ఆ చిత్రాలు అనేక బహుమతులు, అవార్డులు సంపాదించాయి. స్వంత బాణీలు సృష్టించి, సంగీతంలో తన స్థానం సుస్థిరం చేసుకున్నారు జనార్దన్. కర్ణాటక సంగీతంలో ఘనపరిశ్రమ చేసి, వీణతో పోటీగా సితార్ (యుగళం) ను ప్రయోగించి కలకత్తా, బొంబాయి, మద్రాసు నగరాలలో సంగీత కోవిదుల మన్ననలు పొందారు.

సంగీత సభలలో, రేడియోలలో జనార్దన్ సితార్ విననివారు ఉండరు. దాదాపు పదేండ్లు ఈయన చిర పరిచితులే. జనార్దన్ కీర్తి మన దేశంలోకంటే విదేశాలలో బాగా వ్యాపించింది. 1967 లోనే యూరపులో పర్యటించి సితార్ కచేరీలు చేశారు. మొన్న మొన్న అమెరికా, కెనడా దేశాలలో అనేక కచ్చేరీలు జరిపి వచ్చారు. చిట్టిబాబు వీణ వింటున్నప్పుడు కలిగే అనుభూతి, ఆనందం జనార్దన్ సితార్ వింటున్నప్పుడు కలుగుతాయి. పరవశం కలుగుతుంది. కళ్లు చెమర్చి, ఒళ్ళు పులకరిస్తుంది. ప్రతి ఒక్కరికీ యోగానుభూతి కలుగుతుందంటే అతిశయోక్తి కాదు.

జనార్దన్ గురువును మించిన శిష్యుడై, తెలుగు వారి కీర్తిని దశదిశలా వ్యాపింప చేయాలని ఆకాంక్షిస్తున్నాను.

'సితార్' జనార్దన్



# దక్షిణ రైల్వే ఆంధ్ర కళామండలి

రైల్వేలో పనిచేసే తెలుగువారు అందరూ సుమారు 28 సంవత్సరాల క్రిందట స్థాపించుకొన్న సాంస్కృతిక సంస్థ 'ఆంధ్ర కళామండలి'.

ఈ మండలి పరీధావి ఉగాది వేడుకలను శ్రీ ఎల్లోరా అధ్యక్షతను మద్రాసులోని రైల్వే ఎన్. జి. ఓ. హాలులో అత్యుత్సాహభరితంగా జరుపుకొంది.

రేడియో బావగారుగా ఆంధ్రప్రజలకు పరిచయమయిన శ్రీ ప్రయాగ నరసింహశాస్త్రి ఉగాది విశేషాలను గురించి ప్రసంగిస్తూ, తెలుగు జానపద కవితలలోని మాగడ తరగలను పాటల ద్వారా రుచి చూపించారు.

ఉగాది పండుగ విశేషాన్ని, వేపపచ్చడి తినడంలోని ఆశయాన్ని వివరించారు. మద్రాసులో రైల్వే ఉద్యోగులు అందరూ ఇలా చేరి తెలుగు ఉగాది వేడుకలు జరుపుకొనడం చాలా బాగుందని అభినందిస్తూ, పరీధావి అందరికీ ఆనందమయం కావాలని ఆశీర్వదించారు.

శ్రీ ఎల్లోరా ప్రసంగంలో ఈ నూతన వత్సరం అందరికీ ఆనందతుందిలం కావాలని ఆశీఃప్రవచనం చేస్తూ, కళామండలి ఓపెన్ ఎయిర్ థియేటర్ నిర్మాణం కొనసాగించగలరన్న ఆశాభావాన్ని వ్యక్తపరిచారు.

రైల్వే శాఖ అధికారి శ్రీ ఎ. ఎస్. జాకీయస్ ప్రసంగంలో కళామండలి సాంస్కృతిక ప్రదర్శనలకు తన సహకారం ఉంటుందని హామీ ఇచ్చారు.

దక్షిణ రైల్వే ఆంధ్ర కళామండలి అధ్యక్షులు, రైల్వే అధికారి శ్రీ సి. వెంకటేశ్వర్లు ఉగాది వేడుకలను ప్రారంభించారు.

కార్యదర్శి శ్రీ ఎ. రాధాకృష్ణయ్య స్వాగతం పలికి, అతిథి పరిచయం చేశారు. కార్యక్రమం శ్రీ జి. సి. కృష్ణయ్య ప్రార్థనతో ప్రారంభమయింది.

శ్రీ రాధాకృష్ణయ్య వందన సమర్పణ చేశారు. ★

విషయమంతా విన్నాక, సాలెపురుగు మనసు జాలితో నిండిపోయింది.

"నక్కగారూ! మీరు బాధపడకండి. ఒక మంచి కార్యం తలపెట్టినప్పుడు దుష్టత్వం దాని పక్కనే పొంచి ఉంటుంది! అది లేకపోతే మంచికి విలువ ఉండదు. తోడేలు నీతిమాలినతనాన్ని మరిచిపోండి. మీ పక్కన నే నున్నాను. అహింసా సిద్ధాంతాన్ని నేను త్రికరణ శుద్ధిగా ప్రచారం చేస్తాను. మీరు నిశ్చింతగా వెళ్లి రండి" అన్నది సాలెపురుగు.

"మీరు అన్యజాతీయులు. మాతో ఎలా పొత్తు కుదురుతుంది?" అన్నది నక్క సంశయంగా.

"అదే పొరపాటు! ఈ జాతి, ఆ జాతి ఏమిటి? అహింస అనేది సర్వజీవులకు సంబంధించిన విషయం" అన్నది సాలెపురుగు.

"భేష్! మీ లాంటివారే స్వచ్ఛంద సేవకులు! ఇక వెళ్లి వస్తాను" అంటూ నక్క బయలుదేరింది.

అప్పటికి మిట్టమధ్యాహ్నం కావస్తున్నది. సూర్య తాపం విపరీతంగా ఉంది. నక్క ఎండకు తట్టుకోలేక ఆ పక్కగా ఉన్న పాడుపడిన దేవాలయం దరికి

## చవట పని

తన తెలివితేటలన్నీ భార్య ముందు వెల్లడి చేసేవాడు ఒట్టి నాప, చవట. అంతటి బుద్ధిహీనపు పని మరొకటి ఉండబోదు.

—థామస్ ఫుల్లర్

## స్వర్గంనుండి

మిగత వస్తుచయం అదృష్టాన్ని బట్టి ఒనగూడుతుంది. భార్య మాత్రం స్వర్గం ప్రసాదించిన ఒకే ఒక్క కానుక.

—పోప్

చేరుకున్నది. అక్కడ కొన్ని అడవికోళ్ళు గింజలు ఏరుకుతింటూ కనిపించాయి. నక్క దృష్టి అనుకోకుండా వాటిపై పడింది. మనసును దిట్టపరుచుకొని దృష్టిని ఇటు మళ్లించింది. కాని, లాభం ఏమీ కనిపించలేదు. నక్క మనసు అడవికోళ్ల చుట్టూ గిర్రున తిరుగుతూనే ఉంది. చేతితో పొట్ట తడిమి చూసుకుంది. పొద్దుటి నుంచీ ఏమీ తినకపోవడం వల్ల కడుపులో ఎలుకలు పరుగెడుతున్నాయి.

నక్కకు ఏం చేయాలో పాలు పోవడం లేదు. వ్రత భంగం చేయాలా, వద్దా? అన్న మీమాంసలో పడింది.

ఇంతలో అటు పక్కగా సింహగర్జన వినిపించింది. నక్క దృష్టిని అటు సారించింది. ఏముంది? అధ్యక్షోపన్యాసం ఇచ్చిన సింహరాజు ఒక లేడిని నోట కరుచుకొని పోతూ కనిపించాడు!

అది చూడగానే నక్కకు మతి పోయింది!

'కంచే చేను మేస్తే ఇక చెప్పేదేముంది! ఈ రోజు ఇటువంటి ఘోరాలు చూడవలసి వచ్చింది! ఈ అహింసా వ్రతాన్ని రేపటివరకూ వాయిదా వేస్తేనే బాగుంటుంది. ఈ రోజు తిథి, వారం మంచివి కావు. రేపు అడవి యావత్తూ చాటింపు వేయించి, కట్టుదిట్టమైన ఏర్పాటు చేయకపోతే, అహింసా సిద్ధాంతం అడుగంటి పోతుంది' అనుకొంటూ తిత్తులమారి నక్క అటు ఇటు చూసి ఎవరూ లేరని నిర్ధారణ చేసుకొని, అమాంతం అడవికోళ్లపై దూకి, ఒక కోడిని నోట కరుచుకొని, దిక్కులు చూడకుండా పిక్కబలంకొద్దీ పరుగుతీసింది!

ఇదంతా చెట్టుకొమ్మపై నుంచి సాలెపురుగు చూడనే చూసింది.

'అరే! ఇదా నక్కగారి బడాయి కబుర్లు! తోడేలు ఏదో చేసిందని మొసలి కన్నీరు కార్చింది. ఎంత వంచనాచితనం! ఛీ! ఎంత స్వార్థపరులు వీళ్లు! వీళ్లా ఈ అడవిని స్వర్గంగా మార్చేవాళ్ళు. గాంధీగారి సిద్ధాంతమని. . . పాపం! ఆయన నెవరో గాని ఆయన లక్ష్యాన్ని వీళ్ల గంగలో కలిపేశారు. నేను చిన్న కీటకాన్ని! పెద్ద కబుర్లు చెప్పి, వాటుగా గోతులు తీసే తత్త్వం కాదు నాది. ఈ అహింసను నేను తు. చ. తప్పక ఆచరిస్తాను. ఈ అరణ్యంలో నీతిమాలినవారికి నేను ఆదర్శప్రాయమవుతాను' అనుకున్నది సాలెపురుగు.

చెట్టుకింద ఏదో చప్పుడైంది. తన అంతఃపురంలో నుంచి ఓరగా తొంగి చూసింది. పెద్దపులి ఒకటి అడవి దున్నపై పడి చంపి, నెత్తురు ఓడుతున్న దున్నను మెడ పట్టుకొని ఈడ్చుకుపోతూ కనిపించింది. దారి పొడుగునా రక్తం చారలు కట్టింది.

సాలెపురుగు అసహ్యంతో ఆ దృశ్యం చూడలేక, కళ్లు మూసుకుంది భయంతో!

మిట్టమధ్యాహ్నం ఎండకు సాలెగూడు వెండిలా, జలతారు పోగుల్లా, మిలమిల మెరిసిపోతున్నది. ఆ మధ్యాహ్నపు వేళ ఇంటిలో గాలి లేక అలా షికారుగా వెళదామని మనసుపడి, ఒక అందమైన ఈగ స్వేచ్ఛగా ఎగురుతూ అటుగా వచ్చింది. వచ్చి సొగసుగా ఉన్న సాలెగూడును చూసింది. చూసి అదేమిటో తెలుసుకోవాలని మోజ పడింది. అంతే! ఆ అంతఃపురంలో బందీ అయిపోయింది. అందమైన జలతారుపోగులు యమపాశాలై రెక్కలూ, కాళ్లూ బంధించేశాయి!

చూసిన భయంకర దృశ్యం మనోవీథిలో అదృశ్యం కాగానే కళ్లు తెరిచిన సాలెపురుగుకు తన రాజ్యం పరిధిలోనికి వచ్చి బంధింపబడిన అందమైన ఈగ కనిపించింది. సాలెపురుగు మనసు సంతోషంతో పరవళ్లు తొక్కింది. బద్ధకంగా ఒళ్లు విరుచుకుంది. ఇతరులు ప్రవేశించకుండా అంతఃపురం సింహద్వారాన్ని మూసేసింది.

'దీనికి పోయే కాలం కాకపోతే ఎగురుకొంటూ నా అంతఃపురానికే ఎందుకు రావాలి. . . అది దాని కర్మ! ఏమిటో జీవహింస చేయకూడదు అనుకుంటాం కాని, భగవంతుడు కొన్ని ప్రాణుల్ని భోజ్యాలుగాను, కొన్నిటిని భోక్తలుగాను సృష్టించాడు. అతని సృష్టిలోనే లోపం ఉంది. అసలు భగవంతుడే జీవహింస చేశాడు. మన మొక తిక్కా! ఆకలి వేసినప్పుడు ఏదో ఒకటి తిని పొట్ట నింపుకోవడం తప్పెలా అవుతుంది! అహింసావ్రతం అంటావా? కడుపు నిండిన తరవాత, ఇలాంటివి ఎన్నైనా ఆచరించవచ్చు' అనుకుంటూ నెమ్మదిగా వెళ్లి, అందమైన ఈగను నోట కరుచుకొని తన అంతఃపురానికి చేరుకుంది! ★

విరోధికృత్ సంవత్సరం విరోధాలను, అశుభాలను తెగనరికి వేయగా, పరీధావిలో దిగులు బెంగలు చిక్కులు, కష్టాలు ధావితమైపోయి, శుభాలు, స్నేహాలు పరుగు పరుగున వస్తాయనడానికి సూచనగా పరీధావి సంవత్సరం అడుగు పెట్టీపెట్టగానే శ్రీ పి. వి. నరసింహారావుగారు రాష్ట్రప్రభుత్వనేతగా ఎన్నికావడంతో జంటనగరాలలో ఉగాది పండుగ విందులు— వినోదాలు, కావ్యాలాపాలు— కథా కాలక్షేపాలు, సంగీతం గోష్ఠులు కొత్త ఆనందాలతో జరిగాయి.

ఆదర్శనగర్‌లో ఉగాది సాయంకాలం జరిగిన సమావేశంలో సుప్రసిద్ధ ప్రవచనకారులు శ్రీ మల్లాది చంద్రశేఖరశాస్త్రిగారు పంచాంగశ్రవణం జరిపి, పరీధావి విశేషాలు తెలిపారు. శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారు భారతీయ సంస్కృతి విశిష్టత గురించి వివరించారు. ఆంధ్ర మహిళా సభ మహిళా కళాశాలలో జరిగిన కవి సమ్మేళనానికి అధ్యక్షత వహించిన డాక్టర్ దివాకర్ల వేంకటావధానిగారు, కవిత ఏ రూపంలో ఉన్నా, ఏ భాషలో ఉన్నా, రసానందప్రదానదక్షం కావాలన్నారు. ఏ కళ అయినా ఉదాత్త ప్రయోజనాత్మకతతోపాటు రస నిష్యందిగా ఉండడం అవసరమన్నారు. డాక్టర్ ఆరిపిరాల విశ్వం కాలానికి అవధి కల్పించని కవిత అంటూ, 'ఉరి' అనే శీర్షిక గల కవిత చదివారు. శాంతికపోతాని కళ్ళు పీకేసిన నాకూ, మసి పూసిన మీకూ ఉరి అన్నారు. శ్రీయుతులు కప్పగంతుల లక్ష్మణశాస్త్రి, శశాంక, శారదా అశోకవర్ధన్, ఉత్పల సత్యనారాయణాచార్యులు, ముదిగొండ వీరభద్రమూర్తి పాడిన, నవ రీతుల కవితలతో శ్రోతలను ఆనందపరిచారు. ప్రారంభంలో కళాశాల ప్రిన్సిపాల్ వి. స్వరాజ్యలక్ష్మిగారు స్వాగతం చెప్పారు. శ్రీమతి మొగలి సరస్వతీదేవి కృతజ్ఞత తెలిపారు.

కేంద్ర ప్రభుత్వం క్షేత్రప్రచారశాఖ ప్రాంతీయాధికారి శ్రీ బి. ఎన్. మూర్తిగారు కృష్ణదేవరాయాంధ్ర భాషానిలయంలో ఏర్పాటు చేసిన కవితా గోష్ఠిలో శ్రీయుతులు తుంగతుర్తి విశ్వనాథశాస్త్రి, గంధం జోయెల్, సిహెచ్. శాంత, వై. శ్రీభారాణి, కె. మాధురీదేవి, ఎస్. ఉమ మొదలయిన పలువురు 'చైతన్య చైత్రం' అనే విషయమై కవితాగానం చేశారు. శ్రీ జె. బాపురెడ్డి అధ్యక్షత వహించారు.

విద్యుత్శాఖాభారతివారు విద్యుత్సౌధ ఆవరణలో డాక్టర్ సి. నారాయణరెడ్డి అధ్యక్షతలో జరిపిన కవిసమ్మేళనంలో శ్రీయుతులు ఉత్పల సత్యనారాయణాచార్య, మిరియాల రామకృష్ణ, పోతుకూచి సాంబశివరావు, ఆచార్య రాఘవ, ఆర్. ఎస్. ఎన్. మూర్తి, శ్రీమతి శారదా అశోకవర్ధన్ కవితాగానం చేశారు. 'రాజీనామా' ఏకాంకిక ప్రేక్షకులకు చాలా ఆనందం కలిగించింది.

కవితాలాపాలేకాక సంగీత నృత్యవినోదాలు పండుగ నాడు తియ్యగా జరిగాయి. త్యాగరాజ గానసభవారు ఉగాదినాడు ఆంధ్ర మహిళాసభ ఆడిటోరియమ్‌లో శ్రీ ఈమని శంకరశాస్త్రిగారి వీణావాద్యం విందు చేశారు శ్రోతలకు. శ్రీ కోలంక వేంకటరాజుగారి మృదంగం ఈమనివారి వీణకు ఆమని శోభ కలిగించింది. ఈమని వీణానాదం ఆమనికి శోభ చేకూర్చింది.

* * *

యువ కళాకారుడు శ్రీ హెచ్. హెచ్. చౌధరీ మూర్తి మొదటి వారంలో కళాభవన్‌లో ప్రదర్శించిన అమూర్త

చిత్రావళి యువభావనాస్రవంతికి, అనిరుద్ధ, విశృంఖల భావనాస్రవంతికి నిదర్శనమని చెప్పవచ్చు. విశృంఖల మంటే, దారీ తెన్నూ లేనిదని కాదు; అనియంత్రిత, అవరోధా సహభావన అని నే ననుకుంటాను.

చౌధరి వృత్తిరీత్యా సివిల్ ఇంజనీరు. మైసూరు ప్రభుత్వం నీటి సరఫరా శాఖలో పనిచేస్తున్న సహజా వర్సీను యువకుడు. బీజాపూర్ వాస్తవ్యుడు. చిత్రకళ లోను పట్టాలు పుచ్చుకొన్నవారు. అమూర్త చిత్రకళ, గ్రాఫిక్ చిత్రకళ చాలా ఇష్టమన్నారు. పెక్కు ప్రదర్శనా లలో బహుమతులు పొందినవారు. 'నిరుద్యోగ రుదితం' మొదలయిన 31 చిత్రాలు అమూర్తాలయినా, సులభ బోధకంగా ఉన్నాయి. మూర్తకళకన్నా అమూర్తకళను ప్రదర్శించడం కష్టమన్నది కళావేదులకు తెలిసిన సంగతే.

• • •

శ్రీనివాస సాహితీ సమితి ఆ మధ్యన తెలుగు అకాడెమీ ఆవరణలో ఏర్పాటు చేసిన గోష్ఠిలో ప్రముఖ కవి, విమర్శకుడు శ్రీ అవంచ సోమసుందర్ 'తెలుగు కవిత్వము— ఆధునికత్వము' అనే విషయమై అత్యంత సహేతుకంగా ప్రసంగించారు. తెలుగు అకాడెమీ డైరెక్టరు డాక్టర్ పి. ఎస్. ఆర్. అప్పారావు అధ్యక్షత వహించారు. సమితి కార్యదర్శి శ్రీ తుంగతుర్తి విశ్వనాథశాస్త్రి పరిచయానంతరం శ్రీ సోమసుందర్ ఎంత వ్రాసినా తనివితీరనిదీ, ఎంత చదివినా పాఠం తెలియనిదీ కవిత అంటూ, మాట తప్ప మరొక ఉపకరణం లేని కళ కవిత అని, కళ ఉపదేశం కావచ్చు గాని, ఉపదేశం కళ కాదని అన్నారు. కవిత్వం తీరని

## ఉగాది వేడుకలు

తపమన్నారు. 1942 లో గోల్డ్వాయిన్, ఆంగ్రీ నీలో మొదలయినవారు చేసిన తిరుగుబాటు ప్రభావం ప్రపంచ సాహిత్యంపై ఎలా పడిందీ వివరించారు. మన దేశంలో జరిగిన ప్రతి తిరుగుబాటులోనూ కవిత ఎలా లోగొని పున్నమై, నవీనతను చిత్రించిందీ వివరించారు. చివర తమ కవితలు వినిపించారు.

• • •

కొందరు ఎంత వయస్సు వచ్చినా తమ పాత్రలద్వారా నిత్యయౌవనులుగానే ఉంటారు. పండిట్ నెహ్రూకు ఎనభైయవ పడి వచ్చిందీ అన్నప్పుడు— "హా! అన్ని ఏళ్ళెక్కడ? ఆయన యువకుడు!" అనిపించింది ప్రపంచానికి. శ్రీ మునిమాణిక్యం నరసింహారావుగారిని మార్చి 15 వ తేదీన శ్రీ కృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయంలో జరిగిన సమావేశంలో పలువురు ప్రముఖులు అభినందించినప్పుడు "ఇదేమిటి ఈయనకు 74 వ పుట్టినరోజు పండుగా?" అనిపించింది. నా వరకు నాకు ఆయన కాంతావల్లభుడైన నవయువకులే.

ఈ సమావేశానికి అధ్యక్షత వహించిన శ్రీ దేవులపల్లి రామానుజరావుగారు మునిమాణిక్యం అమృత హృదయుడు, నవనీతహృదయుడు అని ప్రశంసించారు. డాక్టర్ ముదిగొండ వీరభద్రశాస్త్రి మునిమాణిక్యంవారి రచనలలో జీవితానుభవం గురించి, శ్రీమతి పరిమళా సోమేశ్వర్ సాంసారిక రచనల గురించి, శ్రీ పోరంకి దక్షిణామూర్తి మునిమాణిక్యం వారి హాస్యసిద్ధాంతం గురించి, శ్రీ మొగలి నాగభూషణశర్మ మునిమాణిక్యం వారి నవలలు ('వక్రరేఖ', 'తిరుమాళిగ', 'రుక్కు తల్లి', 'దీక్షితులు' ) గురించి పరిశోధన వ్యాసాలు చదివారు.




ఆచార్య గంటి జోగి సోమయాజి, డాక్టర్ బూదరాజు రాధాకృష్ణ, శ్రీయుతులు బోయి భీమన్న, హరి ఆదిశేషు, తురగా కృష్ణమోహనరావు, కృష్ణదేవరాయాంధ్ర భాషానిలయం కార్యదర్శి శ్రీ ఎం. ఎల్. నరసింహారావు మునిమాణిక్యంగారిని అభినందించారు. శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రి పద్యోపహారం అందజేశారు.

శ్రీ మునిమాణిక్యం కృతజ్ఞత తెలుపుతూ, "వచన రచన చేసిన వారిలో నా వంటి అదృష్టవంతుడు లేడు. చలం ఇంటి వెలుపలనే సౌందర్యాన్వేషణ చేశారు. నేను ఇంట్లో సౌందర్యాన్వేషణ చేశాను" అన్నారు.

ఔను, ఆ మధ్యన 'అమెచూర్ ఫొటోగ్రఫీ' అనే పత్రిక పాత సంచిక తిరగ వేస్తున్నాను. బాబ్ కాలిన్ వ్రాసిన ఒక వ్యాసంలో ఫొటోలు తీయడానికి ఇంటికన్నా సుందరమయిన స్థానం మరొకటి లేదన్నాడు.

• • •

పిల్లలకు కథలు చెప్పడం, అందులోను ఆకాశవాణిలో— మనిషి కనపడక గొంతుమాత్రమే వినిపించేఆకాశవాణిలో- చెప్పడం గొప్ప కళగానే వినిస్తుంది. మార్చి ప్రారంభంలో గ్రామ వెలుగు నాట్యమండలివారు రేపాక గ్రామంలో జరిపిన ఉత్సవాల చివరినాడు ప్రసంగించిన శ్రీమతి వి. రతన్ప్రసాద్‌గారు ఈ కథాకథన కళను వేలాది జనం ముందు ప్రదర్శించి ఆశ్చర్యపరిచారు పులి వస్తున్న దంటే గాండ్రుమనడం, కంటి పనిని చెవులకు కలిగించడం వంటి పద్ధతి బాలురకు చాలా ఆనందం కలిగించింది. శ్రీమతి రతన్ప్రసాద్‌గారి ఈ కళ గొప్పది.

• • •

రామాయణ మహామాలా రత్నం వందే నిలాత్మజం —అని హనుమంతుని రామాయణ మాలకు నాయక మణిగా కీర్తిస్తున్నారు గాని, నిజానికి భారతదేశమనే మహామాలకు నాయకమణి రాము డనిపిస్తుంది. వాల్మీకి ఏ శుభ ముహూర్తంలో రామాయణ పాత్రలను సృష్టించాడో కాని, మానవమాత్రునికి ఆ పాత్రలు అందుబాటులో ఏ నాటికీ ఉండవు గనక కలకాలానికీ ఆదర్శాలుగానే ఉంటూ జనతను పై అంతస్తుకు తీసుకొని పోవడమేకాక, భారతదేశాన్ని ఏకం చేయడంలో అనితర సాధ్యమైన కృషి చేస్తున్నాయి. ఆసేతు శీతనగం ప్రచారంలో ఉన్న రామకథా కీర్తనను పరిశీలించినా, రామాయణానికి తామరతంపరగా ఉన్న కావ్య సంతతి చూచినా ఈ సంగతి స్పష్టమవుతుంది. మన కనుచూపుమేరలో ఎవ్వరూ రామాయణ పాత్రల స్థాయికి రాలేరన్నది చెప్పనే అక్కరలేదు. కనక వాటి పై నానాటికీ గ్లామర్ ఎక్కువవుతుంది; ఉత్సవాలూ పెరుగుతాయి. జంట నగరాలలో ఇటీవల జరిగిన రామ నవమి ఉత్సవాలు నా నమ్మకాన్ని మరింత బలపరిచినట్లు భావించకుండా ఉండలేకపోతున్నాను.

త్యాగరాజ గానసభ వారు విద్యానగర్‌లోని ఆంధ్ర మహిళా సభ ఆడిటోరియమ్‌లో రామనవమి సందర్భంగా జరిపిన ఉత్సవంలో సంగీత కళానిధి శ్రీ చిత్తూరు సుబ్రహ్మణ్య పిళ్లే గాన కచ్చేరి జరిగింది. శ్రీ నేతి శ్రీరామమూర్తి ఫిడేలుతో, శ్రీ యల్లా వేంకటేశ్వరరావు మృదంగంతో అనుసరించారు. ఎనభయ్యో పడిలో పడినా శ్రీ పిళ్లేగారి కంఠం కించిత్తయినా జీరపోలేదంటే, ఆయన సాధనను, ఆరోగ్యాన్ని ప్రశంసించాలి. శత మానం వరకూ అవి చెక్కు చెదరకుండా ఉండాలని మనం కోరాలి.

ఆయన గాన పరమాన్నం ఆరగిస్తున్నప్పుడు, రామాయణంలో పిడకల వేటలాగ ఒక్క సంగతి జ్ఞాపకం వచ్చింది. ఛీ! ఛీ!— అనుకున్నాను. మనస్సును పెద్దలు మర్కటమన్నారు ఇందుకేనేమో ననిపించింది. ఒక మారు చిత్తూరులో అడిగాను, "మీరు పదహారణాల — కాదు కాదు — నూరు నయాపైసల ఆంధ్రులు కదా, మీ పేరుకు ఈ బిళ్ల ఏమిటి?" అని. ఆయన ఒక నవ్వు నవ్వారు. అది కూడా నాకు మధ్యమావతి రాగం సంగతి వలె వినిపించింది. "అదేమీ లేదు. మేము నాయుళ్లం. కాని, మా గురువుగారు తమిళులు. ఆయన పిళ్లే — అబ్బాయి — అని పిలిచేవారు. అదే నాకు పట్టంగా పేరుకు అతికింది. నేను కులాలు, మతాలు పద్దనేవాడినే. కులం ఉంటే పేరుకు అతికించుకోవడం ఎందుకు చెప్పండి? కాని, నా పరిస్థితి ఏమిటయిందంటే, సుబ్రహ్మణ్యం పిళ్లే అంటే తప్ప నే నెవరో తెలియని దయింది. పేరు మార్చుకుందామని రిజిస్ట్రారుగారితో

## భారతవర్ష మహామాలా రత్నం

మాట్లాడాను. అయ్యా, మీరు ఇప్పుడు మార్చుకొన్నా, రికార్డులలో ఉండిపోతుందేకాని, జనం ఎవరూ కొత్తపేరుతో పిలవరు. జనాన్ని ఎవరు శాసిస్తారు చెప్పండి? మద్రాసులో చైనాబజారుకు నేతాజీ సుభాష్ చంద్రబోస్ రోడ్డు అని మార్చారు. ఎవరన్నా అంటున్నారా?— అని ఆయన అన్నారు. పేరు మార్చుకొనే ప్రయత్నం మానుకొన్నాను" అన్నారు.

ఆదర్శనగర్‌లో జరిగిన రామనవమి ఉత్సవాలలో ఐదు రోజులపాటు శ్రీ మల్లాది చంద్రశేఖరశాస్త్రి గారు వాల్మీకి రామాయణం ప్రవచనం చేశారు. ఆయన ప్రవచనంలో విశిష్టత ఉంది. ఆయన స్వతః శ్రావ్యమైన కంఠం కలవారు. వివిధ పురాణాలలోని రామకథాంశాలను పరిశీలనాత్మకంగా జోడించి చెబుతారు. పురాణాలపై విశ్వాసం లేనివారికి కూడా సాహిత్య విమర్శన దృష్టితో రంజకంగా ఉంటుంది. యువకులకు సాహిత్యంలోను అభిరుచి కలిగిస్తుంది. పట్టాభిషేకం నాడు శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రి గారు రామాయణ విశిష్టతను, వాల్మీకి కవితా పారమ్యాన్ని గురించి వివరించారు. ఈ ఉత్సవాలను ఆదర్శనగర్ వెల్‌ఫేర్ సొసైటీ వారు ఏర్పాటు చేశారు. ఈ సంఘం అధ్యక్షులు శ్రీ నారాయణ శెట్టిగారు ( రిటైరయిన ఐ. ఎ. ఎస్. ఆఫీసరు ), కార్యదర్శి శ్రీ వేంకటేశ్వర్లు గారు.

ఆనందనగర్ వెల్‌ఫేర్ అసోసియేషన్ వారు రామ నవమి నుంచి తొమ్మిది రోజులు జరిపిన శ్రీ సీతారామ కల్యాణ మహోత్సవం వైభవోపేతంగా జరిగింది. నాలు



దీపనృత్యం
చిత్రం—బి. వి. ఎస్. హనుమంతరావు
(హైదరాబాదు—37)

సభలు, నృత్యాలు, నాటకాలు, హరికథా కాలక్షేపాలు, బుర్రకథలు, ప్రసంగాలు జరిగాయి. విద్యాశాఖ డైరెక్టరు శ్రీ వి. రామచంద్రన్, శ్రీ కప్పగంతుల లక్ష్మణ శాస్త్రి, డాక్టర్ దివాకర్ల వేంకటావధాని, టౌన్ ప్లానింగ్ డైరెక్టర్ శ్రీ జి. వెంకటరమణారెడ్డి, మంత్రి శ్రీ ఎం. ఆర్. శ్యామ్‌రావు, శ్రీ వాగం కృష్ణరావు గార్లు ముఖ్యాతిథులుగా ఉండి ప్రసంగాలు జరిపారు. శ్రీ పార్వతీ పరమేశ్వర నాట్యమండలి వారు శ్రీకృష్ణ రాయబారం నాటకం ప్రదర్శించడంతో ఉత్సవాలు సమాప్తమయ్యాయి.

జంట నగరాలలో పెక్కుచోట్ల ఉత్సవాలను సీరులు మహోత్సాహంగా జరపడం చూడగా, రామో ద్విర్నాభి భాషతే, రామో విగ్రహవాన్ ధర్మః, అనే వాల్మీకి వాక్యాలు,

"స్నేహం దయాంచ సౌఖ్యంచ
యదివా జానకీ మపి,
ఆరాధనాయ లోకస్య
ముంచతో నాస్తిమే వ్యథా."

అనే రాముని ప్రతిజ్ఞ నగరాంబర వీథిలో ప్రతిధ్వనించడం వినగా, ఇవి మన నాయకుల చెవుల్లోను పడకపోయి ఉంటాయా అనే తలపు కలిగింది.

* * *

శ్రీ తాపీ ధర్మారావుగారి వంటి వారిని ఎవరు, ఎప్పుడు, ఎందుకు సన్మానించినా జనం సంతోషిస్తారు. అలాటి సంతోషం ఇటీవల ప్రముఖ న్యాయవాది శ్రీ వి. వెంకటరమణ, న్యాయవాదిని శ్రీమతి లక్ష్మి వెంకట రమణ కలిగించారు, శ్రీ ధర్మారావుగారికి మెహదీ పట్నం లోని తమ నివాసంలో. జంట నగరాల ప్రముఖ కవి పండిత విమర్శకులు ఈ సంతోషాన్ని పంచుకొన్నారు.

శ్రీ వార్ల వేంకటేశ్వరరావుగారు శ్రీ ధర్మారావుగారి అభ్యుదయ దృష్టిని, నవనవోత్సాహాన్ని ప్రశంసించగా, శ్రీ బోయి భీమన్నగారు ప్రసంగిస్తూ శ్రీ ధర్మారావు గారు తన పట్ల దయాతరంగిత దృష్టితో చూడకపోయి ఉంటే, తను గుమాస్తాగా పడి కొట్టుకొంటూ ఉండే వాడినని, పత్రికా రచనారంగంలోగాని, కవితా సాహిత్య రంగాలలోగాని అడుగే పెట్టి ఉండనని అన్నారు. డాక్టర్ పి. నారాయణరెడ్డిగారు ప్రసంగిస్తూ, ధర్మారావుగారు తమ హృదయోల్లాస వ్యాఖ్యలో చేమకూరకవి హృదయాన్ని తెలిపి రసికులకు హృదయోల్లాసం కలిగించారని అన్నారు. శ్రీ జె. బాపురెడ్డిగారు ప్రసంగిస్తూ ధర్మారావుగారు సాహిత్యవేత్తలే కాక తత్త్వవేత్తలు, సంఘసంస్కర్తలు కూడా అన్నారు. శ్రీ కె. రామగోపాలరావుగారు ప్రసంగిస్తూ పత్రికా రచనను విస్తరింప జేయడంలో ధర్మారావుగారి సేవను కొనియాడారు. శ్రీ గుంటూరు శేషేంద్రశర్మగారు ప్రసంగిస్తూ విశ్వవిద్యాలయాలలో ధర్మారావుగారి విమర్శ గ్రంథాలు పాఠ్యవిషయాలు కావాలన్నారు.

శ్రీమతి తాపీ సరోజిని, రాజకుమారి శ్రీమతి ఇందిరా దేవి మొదలయినవారు హాజరయ్యారు.

ప్రారంభంలో శ్రీ వెంకటరమణగారు అతిథులకు స్వాగతం చెప్పారు. శ్రీమతి లక్ష్మి రమణగారి ధన్యవాదాలతో సాహిత్యపు ఆమెత ముగిసిందని తెలియవచ్చినప్పుడు చేమకూరకవే అన్నట్టు అరునాసామెత (అసంపూర్ణమైన విందు) అయిందేమిటా అని మనస్సు చివుక్కుమంది.

హైదరాబాద్ షికార్ క్లబ్బువారు మార్చి 20వ తేదీన శాస్త్రీయమైన కథక్ నృత్యం రవీంద్ర భారతిలో చూపించి ప్రేక్షకులను ఉర్రూతలూగించారు. సుప్రసిద్ధ చలనచిత్ర నర్తకి, కథక్ నాట్య నిపుణ కుమారి గీతాంజలి తన గురువు శ్రీ పాండ్యా తబలాకు అనుగుణంగా నర్తించినప్పుడు ఎవరు గొప్పో చెప్పడం కష్టమయింది. శ్రీ పాండ్యా తబలామీద తాండవ లాస్యాదులను ప్రదర్శించి ప్రేక్షకులకు, శ్రోతలకు రమ్యాలోకాలు చూపించారు.

## ఉపశ్రుతి

నిజామియా జనరల్ ఆస్పత్రిలో లిఫ్టు ఎక్కి వెళ్తున్నాను. లిఫ్టు దాదాపు ఏభై మంది నిలబడ దగినంత విశాలంగా ఉంది. పాత నిజాం నవాబుల శాన్ను (వైభవాన్ని) తెలిపేదిగా ఉంది. పక్కన డాక్టర్ కె. ప్రభాకరశాస్త్రిగారున్నారు. మీ ఆస్పత్రి వైభవానికి ఈ లిఫ్టే దృష్టాంతం అన్నాను. ఆయన నవ్వుతూండగా లిఫ్టు బాలకుడు అబ్దుల్ కరీముూ నవ్వాడు. అతనిని అడిగాను, ఎంతకాలంగా ఉన్నావు?-అని. ముప్ఫై సంవత్సరాలుగా— అన్నాడు. అయితే, చాలా గొప్ప గొప్ప విషయాలు ఈ లిఫ్టులో చూచి ఉంటావు. గొప్పవారిని చూచి ఉంటావు!— అన్నాను. అతడు వంగి సలాం కొట్టి "సాహెబ్, ఆప్ బడేహై. అల్లా జానే క్యా క్యా దిఖాయేంగే. క్యా క్యా దేఖనా హై?"—(అయ్యా మీరు గొప్పవారు. మీరు ఏమేమి చూపుతారో, ఏమేమి చూడాలో అల్లాకే తెలును)—అన్నాడు. అతని సద్యస్ఫురణకు నవ్వుకుంటూండగా అతడు మరొక సలాం కొట్టాడు.

* * *

ఉగాదినాడు మునజ్జంజాహీ మార్కెటు దగ్గ నిలుచున్నాను. ఒక గృహస్థు పూవులు కొంటున్నారు. మూడేళ్ల పాప ఆయన పక్కన నిలబడి ఏదేదో పురమాయిస్తున్నది. నీకు ఏం పూలు ఇష్టం?— అడిగాను. గులాబి— అన్నది. మల్లెపూవులు ఇష్టం లేదా?— అడిగాను. చేదు— అన్నది. మొగలిపూవులో— అన్నాను. చేదు, ముళ్ల— అన్నది. కమ్మ వాసన కదమ్మా— అన్నాను. ఏం వాసన? చేదు అన్నది ముఖం చిట్లిస్తూ. గులాబీలో!— అని అడిగాను. ఎర్రగా, ముద్దుగా, అందంగా ఉంటాయి. తియ్యగా ఉంటాయి. తినచ్చు — అన్నది.

అదా సంగతి! చేదు అనేదాని అర్థం అదా! కళకు ప్రయోజనాత్మకత అంటే ఇదేగా, తల్లీ! ఇప్పటికి అర్థమయింది. తన్నుకు చస్తున్నాను ఇంత కాలమూ— అన్నాను. ఏమిటి, సార్, ఏమిటో మాట్లాడుతూ దిల్లగి చేస్తున్నారు పాపతో— అన్నారు పాప తండ్రి. పేరు శ్రీ పెరవలి నరసింహమూర్తి. పాపపేరు వసంతలక్ష్మి. ఆహా! అదీ విషయం! నీవు పెరవలి వంశందానివా? అందుకనే మూడేళ్లకే మమ్మటుని సిద్ధాంతం అర్థం చేసుకొన్నావు— అంటూ పాపను అభినందించాను. గులాబీలు తినచ్చు అంటే ఇంత గోల చేస్తున్నాడేవీడు— అన్నట్టు వసంతలక్ష్మి పెద్ద కళ్లతో అబ్బురంగా చూచింది.

—తిరుమల రామచంద్ర

# ఉత్తరాలు

(2 వ పేజీ తరువాయి)

సహజముగా ఉంటున్నాయి. 'రేపటి వెలుగు' లో శారద భవిష్యత్తు మంచి మలుపులోకి వచ్చి ఆగింది. 'కొత్త పుస్తకాలు'లో 'హారు' గురించిన విమర్శ సున్నితంగా నిర్మాణాత్మకంగా ఉన్నది.

—హనుమంతు పార్వతీశ్వరరావు (తమ్మయ్యపేట)

• • •

ఈ వారం 'ముఖచిత్రం' (హలం) మళ్ళీ మళ్ళీ చూడాలనిపించింది.

ఈసారి 'జోక్స్' -ముఖ్యంగా 'సార్థకనామధేయులు' చదివి నవ్వాపుకోలేక పోయాము.

'అన్వేషి'లోని కస్తూరి మనస్తత్త్వం వింతగా కనిపిస్తూంది. 'రేపటి వెలుగు' సాఫీగా సాగిపోతూంది. శారద పై చదువులకు వెళ్లటంతోపాటు అనిల్‌తో స్నేహంకూడా పెరుగుతూంటే సంతోషంగా ఉంది. శారద కొన్నిసార్లు మాధవి ( 'ఎక్కవలసిన రైలు' )ని గుర్తుకు తెస్తూంది.

—ఆర్. విజయమోహన్‌రెడ్డి (వనపర్తి)

• • •

అందే గోపాలకృష్ణమూర్తిగారి 'మృత్యువు నీడన' కథ బాగుంది. దారిద్ర్యం ఎంతటి అఘాయిత్యానికయినా దారి తీస్తుందనే సత్యాన్ని కథారూపంలో చక్కగా తెలియజేశారు.

'బాంగ్లాదేశ్'విశేషాలు కళ్లకు కట్టినట్లు ఫోటోల ద్వారా మా కందజేస్తున్నందుకు మీకు అభివందనలు.

కల్పనగారి 'అతిథిసత్కారాలు' 'ప్రమదావనం' వ్యాసం సమంజసంగా ఉంది.

—వై. ఎస్. కుమార్ (విజయవాడ—3)

• • •

ఈ వారం 'సంపాదకీయం'—'పెరుగుట పెరుగుట కొరకా?' చాలా వాస్తవముగా ఉన్నది. మీతో నే నేకీభవిస్తున్నాను.

శర్మగారి కవిత 'పడవలు—తెరచాపలు' సొంపుగా ఉన్నది.

—మల్యాల ప్రేమకుమార్ (దక్షిణ లాలాగుడ)

• • •

'మృత్యువు నీడన' (అందే గోపాలకృష్ణమూర్తిగారి కథ) అతి వాస్తవంగా ఉంది. పెద్ద పెద్ద పట్నాలలో ఎటువంటి మనుషులున్నారో. . . రచయిత తన భాషలో పదిమందికీ అర్థమయ్యేటట్లు చెప్పారు.

పోలీసులు— డాక్టర్లు— నర్సులు కొందరు— తమ బాధ్యతలను విస్మరించి ఎదుటి మనిషి బాధను పట్టించుకోకుండా ఎలా ప్రవర్తిస్తారో పైడయ్య చెప్పే తీరు కథలో అతి వాస్తవంగా ఉంది— అయితే పైడయ్య, పైదులు వంటివాళ్ళు ప్రజలవద్ద ఎటువంటి నాటకం ఆడుతున్నారో. . . ప్రజలు కొందరు వాళ్ళను గుడ్డిగా ఎలా నమ్ముతున్నారో. . . అందరూ గమనించవలసిన విషయం, మొత్తంమీద పొట్ట కోసం పడే పాట్లు అతి చక్కగా వర్ణించిన రచయితకు నా ధన్యవాదాలు.

'వింతలు—విడ్డూరాలులో' 'వీరవనితల' జీవితాలు ఎలా నాశనమయ్యాయో! ! ! బాంగ్లాదేశ్ ప్రభుత్వం మరి ఆ వనితలని ఏం చేయాలనుకొంటుందో. . .! ! ! ఏమైనా వాళ్ల జీవితాలు నవజీవితాలు కావడానికి ప్రభుత్వం మంచి పథకం ఆలోచిస్తే బాగుంటుంది.

డాక్టర్లు, ఏక్టర్లు, సార్థక నామధేయులు — కార్టూన్లు జోక్స్. . . మన కార్టూన్‌లోకం ప్రగతి మరో మెట్టు పైకెక్కింది అనిపిస్తుంది.

'కడుపు తీపి' కథారచయిత 'మంజుశ్రీ'గారు, వేటూరి వారి పూర్వరచనను చక్కగా వివరించారు.

—జోగిమహంతి సుధాకరరావు (రాయిగర్‌మధ్యప్రదేశ్)

• • •

ఈ వారం 'ముఖచిత్రం' ఏం బాగులేదు. దయచేసి అలాటి అర్ధనగ్న ముఖచిత్రాలు మాత్రం వేయవద్దు. కథలలో 'మృత్యువునీడన' కథ మాకు చాలా నచ్చింది.

—జి. ప్రేమ్‌చంద్ (వేమూరు)

• • •

29—3—72 సంచిక 'ముఖచిత్రం' సెక్సీగా ఉంది. 'బాంగ్లాదేశ్'వ్యాసం విజ్ఞానదాయకంగా, సర్వజనోపయోగకరంగా ఉంది. ఫోటోలు ఆసక్తికరంగా ఉన్నాయి. విశ్వంగారికి చేజోతులు. 'మృత్యువు నీడన' కథ చాలా బాగుంది. ప్లాట్‌లో నూతనత్వం ఉంది. చిన్న బిట్‌ను తీసుకుని ఎలాబరేట్ చేసి వ్రాసిన తీరు హర్షదాయకం. 'పైడయ్య మరి పాడెదిగలేదు' కాస్త ఎక్స్‌ట్రా ఆర్డినరీగా ఉంది. ఇలాంటి వెరైటీ కథలు ప్రచురిస్తున్న సంపాదక వర్గానికి నమోవాకాలు.

—బి. శ్రీహరిరావు (సాలూరు)

• • •

29—3—72 సంచిక 'వింతలు విడ్డూరాలు' శీర్షికలో 'వీరవనితలు' చదువుతూంటే ఒళ్లు జలదరించింది.

'శ్రీరామనవమికి' ముందుగా విశ్వవ్యాప్తమైన శ్రీరామ కథ వెయ్యడం చాలా బాగుంది.

—బి. పి. ఆచారి (విశాఖపట్నం—1)

• • •

మొదట్లోనే అందరిని ఆకట్టుకొంది రాధారాణిగారి 'అన్వేషి'. కస్తూరి పాత్ర చాలా బాగుంది. మీరు మంచి మంచి సీరియల్స్‌ను ప్రచురిస్తున్నందుకు చాలా సంతోషం.

కథలలో మంజుశ్రీ రచన 'కడుపు తీపి' కథ చదువుతుంటే ఎంతో బాధ వేసింది.

—పి. శ్రీప్రియ (కందుకూరు)

• • •

ఈ వారం (29—3—72) ప్రభలో గుంటూరు శేషేంద్రశర్మగారు రచించిన 'పడవలు— తెరచాపలు' గేయం సన్నమితంగా ఆకర్షించింది.

'కడుపు తీపి' కథానిక నా హృదయంలో చెరగని ముద్రగా నిలిచిపోయింది.

—ఎమ్. డి. ఖాదర్‌హుసేన్ (కావలి)

• • •

ఈ వారం మీ 'సంపాదకీయం' 'పెరుగుట పెరుగుట కొరకా?' ప్రశంసనీయంగా ఉంది. ఔను— మరి! పెరగడం పెరగడం గానే ఉన్నది. కాని ఏ మాత్రం తగ్గే సూచనలు పేదలకు ఏకోశానవో లేవు. మరి కొత్త కాంగ్రెస్ 'పేదతనం ఫో' అన్న మంత్రంతో ఎన్నికలలో పాల్గొని అఖండ విజయం సాధించింది. ఎందుకు? ఇలా ఊరికే వీటిని పెంచుతూ జనజీవనాన్ని మరింత దుర్భరం చేయడానికా?

అందే గోపాలకృష్ణమూర్తిగారి కథ 'మృత్యువు నీడన' ఉత్తమంగా ఉంది.

—సపారె ఆనందరావు (ద్రోణాచలం)

• • •



జోతులు

చిత్రం—ఎస్. జె. నరసింహారెడ్డి (సికిందరాబాదు)

'అరుణకాంత్'గారి 'మయసభలో జారిన ముత్యాలు' కథ చక్కని భాష, శైలితో సాగిపోయింది. చాలా రోజుల తరవాత హృదయాలను ఆకట్టుకునే కథ చదవగలిగానని తృప్తి కల్గింది.

గనిశెట్టి (మద్రాసు) గారి యొంకిచిత్రం, డి. లలిత (వరంగల్)గారి నృత్యం చిత్రం చాలా బాగున్నాయి.

సంచిక బోలెడు కథలతో బరువుగా ఉంది. ఏది ముందు చదువుదామని తర్జన భర్జన పడ్డాను.

—పరిమి శ్యామల రాధాకృష్ణ (మదనపల్లి)

• • •

'మృత్యువు నీడన' కథ చాలా ఇంటరెస్టుగా ఉంది. నేటి పరిస్థితులలో డబ్బు కొరకు యాచకులు ఎన్ని రకాల యుక్తులు పన్నుతూ తమ జీవనం గడుపుకుంటున్నారో ఈ కథలో చెప్పినారు. పాపం పైడయ్య తనకు తానుగా శవంగా నటించబోయి శవంగా మారిపోయినాడు. చివరి క్షణాలలో తన స్నేహితులకు పుష్కలంగా డబ్బు అందించి పోయినాడు.

ఈ వారం 'సంపాదకీయం' చాలా సున్నితంగా ఉంది.

—ఎన్. యుగంధర్ (కరీంనగర్)

• • •

ఉగాది సంచికలో ఎత్తిచూపటానికి లోపాలంటూ ఏమీ లేవు. సంవత్సరమంతా అల్లాగే మా చేతులని అలరిస్తుందనుకొన్న మాకు 29—3—72 సంచిక 'ముఖచిత్రం' ఆశాభంగం కలిగించింది.

ఏమైనా, 'పారిజాతాలు' పంచిన ఎల్లోరాగారికి, 'బాంగ్లా'విశ్వంగారికీ నా కృతజ్ఞతలు.

—బిలే (గురజాడ) ★

# (క్రిందటి సంచిక తరువాయి)

## 31

మార్చి రెండో వారంలో రామస్వామి దగ్గరనుండి ఉత్తరం వచ్చింది శారదకి — రాజ్యలక్ష్మి వెళ్ళిపోయిందనీ, అనసూయ ఇంకా అక్కడే ఉందనీ.

శారదకి క్రిందటి సెలవుల్లో అక్కగారి ఇంట గడిపిన రోజులు, ముందు గదిలో బావగారు నడిపే ప్రేమ కలాపాలు గుర్తుకొచ్చేయి. అక్క ఇంట్లో లేకపోతే అతడికి మరీ మంచిది. ఆపాటి తెరచాటుకూడా అవసరం ఉండదు. భార్య పుట్టింట ఎంతకాలం ఉంటే మాత్రం ఎందుకు పట్టించుకోవాలి— అనుకొంది.

"అమ్మకి కాస్త నయంగా ఉంటే అనసూయక్కని కూడా పంపేయండి. పాపం, బావగారు ఎంతకాలమని చేతులు కాల్చుకుంటారు" అని జవాబు రాసింది.

ఆ ఉత్తరం రాసేక, ఇరవై రోజులు అయినా తండ్రి దగ్గరినుంచి మళ్ళీ ఉత్తరం రాలేదు. నాన్న ఇలా ఉత్తరాలు రాయకుండా ఎందుకు ఊరుకొన్నారు? అమ్మకి మళ్ళా జబ్బు తిరగబెట్టలేదు కదా? కంగారు పడింది శారద. "నా కేమిటో బెంగగా ఉంది. అమ్మ కెలా ఉంది? వెంటనే ఉత్తరం రాయండి" అంటూ ఇంకో కార్డు రాసి పడేసింది.

దానికి మూడోనాటికే జవాబు వచ్చింది. కాని, ఆ జవాబు రాసింది తండ్రి కాదు; అనసూయ. అనసూయ దస్తూరీతో వచ్చిన ఆ ఉత్తరం చదవబోతూ, 'ఇది ఇంకా ఇక్కడే కూర్చుంది. అయినా, అమ్మకి బుద్ధిలేదు. వారి ఇంట పది రోజులు ఉండి అల్లుడి వ్యవహారం చూసింది కదా? దీన్ని ఎందు కిలా నెలల తరబడి అట్టే పెట్టుకోవడం? అవసరం తీరిపోగానే పంపేస్తే సరిపోదూ?' అనుకొంది.

కవరు చింపుతుంటే తండ్రికి బదులుగా అక్కకీ ఉత్తరం రాయవలసిన అవసరం ఏమొచ్చిందా అనే సంశయం శారద మనసులోకి వచ్చింది. ఆ ఉత్తరంలో ఉన్నవి రెండే రెండు మాటలు — "నువ్వు వెంటనే బయలుదేరి రా. చాలా అవసరం" అంటూ. ఆ మాటల్ని అటునుంచి ఇటు, ఇటునుంచి అటు ఎంతగా, ఎన్నిసార్లు తిప్పి చూసినా అంతకుమించిన వివరణ వాటిలో దొరక లేదు. అదే మాట తల్లో, తండ్రో రాసి ఉంటే మళ్ళా ఏమైనా పెళ్ళిచూపుల వ్యవహారం ఏమో అనుకొనే అవకాశం ఉండేది. కాని, అక్క అలా తలా తోకా లేకుండా— "వెంటనే బయలుదేరి రా. చాలా అవసరం" అని రాస్తే దానికి కారణం ఏమిటో ఎంత ఊహించుకొన్నా శారదకి తోచలేదు.

"ఎందుకు రాసిందో — ఒక సారి వెళ్ళి రావడమే మంచిది" అంది మాలతి.

"మీ వాళ్ళకి బుద్ధిలేదు. చదువుకొంటున్న పిల్లని ఇలా మాటి మాటికి ఇంటికి రమ్మంటూ ఉత్తరాలేమిటి? ఆ తంటా లేమిటో మిగిలిన వాళ్ళు చూసుకోవాలి కాని" అంది అరవింద.

అందిన మొదటి రైలు పట్టుకొని ఇల్లు చేరింది శారద. అప్పటికి కొద్దిగా చీకటి పడింది. వీథిలో దీపాలు వెలిగేయి. తమ ఇంటి గుమ్మం ముందు నిలిచి లోపల ఏమి చూడవలసి వస్తుందో, ఏ మాట వినవలసి వస్తుందో అన్నట్టు క్షణకాలం గుమ్మంలో ఆగి మూసి ఉన్న తలుపుల వేపు చూసింది. మెల్లగా మనసు దిటవు

---

### జరిగిన కథ

రేపల్లో కనుపించే ఎన్నో ఆశల మీద మేడలు కట్టే బాలిక శారద. శారద అక్క అనసూయ పెళ్ళి అయింది. దానితో రామస్వామి ఇల్లు విక్రయించవలసి వచ్చింది. పరీక్షలో తప్పాడు వాసు. ఇల్లు విడిచి పోయాడు. రాజ్యలక్ష్మి నగ ఇచ్చి తండ్రిని ఆదుకొంది; అత్తవారి ఆగ్రహానికి గురి అయింది. రామస్వామి పెద్ద తల్లి కూతురు మాలతి ఇంట చేరింది శారద. కాలేజీలో చేరింది. అనిల్‌ను ఆమె అభిమానించసాగింది. అన్నపూర్ణ ఆకస్మికంగా వచ్చి, కుమార్తెని దోషిని చేస్తూ మాట్లాడింది. శారదకోసం ఒక సంబంధం చూసింది తల్లి. కాదన్నది శారద. శారద పరీక్షలో ఉత్తీర్ణురాలయింది. అనసూయ ఇంటికి వెళ్ళింది శారద. అక్కడ ఉండి చదువుకొనే అవకాశం లేదని గ్రహించింది. బావగారి ప్రవర్తన ఆమెకు అసహ్యం కలగజేసింది. శారద బాల్యస్నేహితుడు విశ్వం తండ్రి మరణించాడు. శారద ప్రవర్తనను తల్లి అధిక్షేపించింది. అలాగే అనిల్‌తో స్నేహాన్ని శంకించింది. శారద తిరిగి వెళ్ళింది; అనిల్ అక్కను కలుసుకొనడం ఆమె కొక చిత్రమైన అనుభవం. అనిల్, శారద ఒండొరుల మనసు అర్థం చేసుకొన్నారు. జబ్బుపడిన అన్నపూర్ణని చూసివచ్చింది శారద. రాజ్యలక్ష్మి కాపురం చక్కబెట్టడానికి మోసం చేసినట్లు చెప్పాడు రామస్వామి.

---

పరుచుకొని, దగ్గరగా వేసి ఉన్న తలుపు తోసి లోపలికి అడుగు పెట్టింది.

ఎదురుగా వంట ఇంటి వసారాలో లైటు వెలుగుతున్నాది. గడపని ఆనుకొని తల్లి కూర్చుంది. అనసూయ వంటపనిలో ఉన్నట్టు ఇటూ అటూ తిరుగుతున్నాది.

'అమ్మ ఆరోగ్యం సరిగానే ఉంది.'

తల్లిని క్షేమంగా చూసేక శారద మనసులో బెంగ తీరినట్లయింది. చేతి సంచీని పక్కనే ఉన్న అరుగుమీద పడేసి, ముందుకి నడుస్తూ—"అమ్మా!" అని పిలిచింది.

ఆ పిలుపుకి పక్కనే ఏదో పిడుగు పడినట్లు అదిరి పడింది అన్నపూర్ణ. అటు ముఖం తిప్పుకుని అనసూయతో ఏదో మాట్లాడుతున్నదల్లా ఇటు తిరిగి, ఎదురుగా శారదని చూడగానే బావురుమంటూ ఏడుస్తూ రెండు చేతులతో ముఖం కప్పుకొంది.

తల్లి ఆ ఏడుపుకి కారణం ఏమిటో ఊహించుకోలేక పోయింది శారద. ఎవరి కేమయింది? ఎంత కష్టంలో ఉన్నా ధైర్యాన్ని కోల్పోని తల్లి, ఎందు కింతలా ఏడుస్తున్నాది?

"ఏమయిందమ్మా? ఎందుకే అంతలా ఏడుస్తున్నావు? చెప్పవే, అమ్మా" అంటూ తల్లి ముందు కూలబడి, ముఖాన్ని కప్పుకొన్న ఆమె చేతులు తొలగించింది. అన్నపూర్ణ ఉప్పెనలా పొంగి వస్తున్న దుఃఖాన్ని ఆపుకోవడానికి ప్రయత్నిస్తూ, "మీ నాన్నే, నా తల్లీ... మీ నాన్నగారు" అంటూ వెక్కసాగింది.

శారద కళ్ళముందు ఉన్న వస్తువులన్నీ గిరగిర తిరగడం మొదలు పెట్టేయి. ఎదురుగా వెలుగుతున్న ఎలక్ట్రిక్ దీపం కాంతి ఎర్రగా రక్తంలా మారి, క్రమంగా నల్లబడ సాగింది. తన మీద ఎవరో బండెడు నిప్పులు కుమ్మరించినట్లు అనిపించింది.

"అమ్మా!" అంటూ కొయ్యబారి తల్లి ఒడిలోకి వాలిపోయింది.

ఆ స్థితిలో కూతుర్ని చూసి హడిలిపోయింది అన్నపూర్ణ.

"శారదా ... శారదా ... ఏమిటే, నా తల్లీ!" అంటూ కంగారుగా కేకలు పెట్టింది.

కేకలు రావడం చూసి పొయ్యి కింద మంట తగ్గించి అక్కడికి వచ్చిన అనసూయ, శారద ఉన్న పరిస్థితి గ్రహించింది. వెంటనే ఇన్ని నీళ్ళు తెచ్చి, ముఖం మీద చిలకరించి, "శారదా ... శారదా" అంటూ ఆప్యాయంగా పిలిచింది.

కొంతసేపటికి శారద మెల్లగా కళ్ళు తెరిచింది. ఎదురుగా అనసూయ.

"అక్కా!" అంటూ ఆమెని కౌగిలించుకుని ఏడవ సాగింది.

"కంగారుపడకు, శారదా! నాన్నకేం కాలేదు... క్షేమంగా ఉన్నారు" అంటూ ఆమెని ఓదార్చింది అనసూయ.

"అక్కా! నాన్న క్షేమంగా ఉన్నారా... ఎక్కడ ... ఎక్కడ ఉన్నారు నాన్న? నాకు చూపించు, అక్కా!"

"చూపిస్తాను, అమ్మా! కాని, నువ్వు ముందు కొంచెం కోలుకో ... నిన్ను ఇలా చూసేరంటే నాన్న బాధపడతారు."

"మరి .. మరి ... అమ్మ ఎందుకలా ఏడ్చింది?"

"బుద్ధిలేక."

"నిజంగా నన్ను హడల కొట్టేశావు, అమ్మా! నాన్నకి బదులుగా అనసూయ ఉత్తరం ఎందుకు రాసిందా అనే అనుమానంతో నే చస్తుంటే, ఇంట్లో కాలు పెట్టగానే నీ ఏడుపు ఒకటి..."

తండ్రికి ఏమీ కాలేదు అని తెలుసుకొన్నాక ఆ కష్టం ఇంక ఎటువంటిదైనా ఎదురుకోవడానికి సిద్ధమే అన్నట్టు శారద కోలుకొంది. మరి కాస్త సమయం గడిచి శారద స్థిమితపడ్డాక అసలు విషయం చెప్పింది అనసూయ.

"నిజమా ... ఇది నిజమేనా?" అంది శారద ఆశ్చర్యంతో.

"నిజమో, కాదో ఎలా తెలుస్తుంది? నిజం కాదని బుజువైతే నాన్నని విడిచి పెడతారట."

"నాన్న ఇటువంటి పని చేస్తారంటే నువ్వు నమ్మగలవా, అక్కా!"

"మనం నమ్మడం, నమ్మకపోవడం వల్ల లాభమేమిటి, శారదా! నాన్న ఆఫీసులోంచి ఆ సొమ్ము తీయలేదని, ఏదో లెక్కల పొరపాటు వల్ల ఆ కొరత ఏర్పడిందని, లేక ఇంకెవరో కాజేసి ఆ నేరం నాన్నమీదికి తోసేరని ... ఇలాగ ఏదో ఒకటి తేలితే వదిలిపెట్టేస్తారుట, లేకుంటే శిక్ష పడుతుంది అంటున్నారు."

ఆ రాత్రంతా తల్లీ కూతుళ్ళు ఏం చెయ్యడం, ఎలా ఈ ఆపద నుంచి బయట పడ్డం అని తర్జన భర్జన చేస్తూనే ఉన్నారు. తెల్లవారేసరికి శారద ఒక నిశ్చయానికి వచ్చింది — తమకి ఆ ఆపద సమయంలో ఎవరైనా సహాయపడే వాళ్ళు ఉన్నారా అంటే వాళ్ళు—మామయ్య, మాలతి అత్త మాత్రమే అని.




## దైవ క్షమ

ప్రాచీన కాలంలో ఇంగ్లండు దేశాన్ని ఒక రాజు ఏలెను. అతడు రాజుగ ఏలటం కొంతమందికి ఇష్టంలేక ఆయనకు ఎదురు తిరిగారు. అయితే ఆ రాజుగారి అనుచరులు ఎదిరించిన వారిని ఓడించారు. వారంత దగ్గిరలో ఉన్న కొండ ప్రదేశాలకు పారిపోయ్యారు. అయితే కనికరం గల ఆ రాజు గారు ఒక బ్రహ్మాండమైన కొవ్వొత్తిని వెలిగించి, రాజగృహంలో పై అంతస్తుల్లోని కిటికీలో ఉంచి, అక్కడ అది ఎంత సేపు వెలుగుతుంటుందో, ఆ సమయంలో రాజధానికి తిరిగి వచ్చిన వారిని క్షమించి విడుదల చేస్తామని చాటింపు చేశాడు. ఆ కొవ్వొత్తి వెలుగుతున్న కాలంలో తిరిగి వచ్చిన వారంతా క్షమింపబడ్డారు.

ఈ లోకంలోని మానవులంతా రాజులకు రాజైన దేవునిపై తిరుగుబాటు చేసినవారే! గొర్రెలవలె త్రోవ తప్పి ప్రతివాడూ తన కిష్టమైన మార్గంలో తొలగిపోయిన వారే! దైవాజ్ఞలను వారి పాదముల క్రింద త్రొక్కివేసి, ఈ రాజు మమ్ములను ఏలుట మాకిష్టం లేదని పలికినవారే! అయితే యేసుక్రీస్తు తనకుతానై మానవు లందరి కొరకు సమర్పించిన విమోచన క్రయ ధనాన్ని స్వీకరించి, ఆ దయ గల దేవుడు, మమ్మును ఈ పాపపు బానిసత్వం మంచి విడుదల చేయదలచి "భ్రష్టులైన పిల్లల్లారా! తిరిగి రండి. మీ పాపాలు రక్తంవలె ఎర్రని వైనా అవి హిమంవలె తెల్లబడుతాయి" అని చెయ్యిచాచి పిలుస్తున్నాడు.

భగవంతుని గూర్చి తెలుసుకొనటానికి వాయిదాలు పనికిరావు. 'రేపు' 'రేపు' అని రేపటి వరకు వాయిదా వేయవద్దు. ఆ రేపటిని గూర్చి తలంచుచూ, ఆ 'రేపు' ను చూడకుండానే ఎంతో మంది మరణించారు.

'దైవకృప' 'దయ' 'క్షమ' అనే కొవ్వొత్తి గడిచిన 1900 సంవత్సరముల నుంచి వెలుగుతూనే వుంది. అది కొంతకాలానికి ఆరిపోవచ్చు. ఆనాడు 'క్షమ'కు బదులుగా ఆయన "ఉగ్రతను" ఎదుర్కొన వలసి ఉంటుందేమో. యేసుక్రీస్తు తన రెండవ రాకడను ఆలస్యం చేస్తున్నాడు. ఎందుకనగా, ఏ ఒకరూ నశించి నరకాన్ని చేరటం ఆయన ఇచ్ఛగించక అందరూ మనస్సులో మార్పు పొంది నిత్య జీవనానికి వారసులవాలని కోరుతూ, అందరి యెడల ఆయన దీర్ఘ శాంతము గలవాడై యున్నాడు.

మీ హృదయ క్షేత్రంలో ఏ విత్తనం విత్తుతున్నారు? మంచి విత్తనం విత్తుటకు ప్రాతఃకాలమే అనువైన సమయం. మధ్యాహ్నం వేడిగ ఉంటుంది. సాయంకాలం నీరసంగా, అశాంతిగా, అలసటగా, చికాకుగా ఉంటుంది. ఇంక చీకటి ఆవరించే కొద్దీ కంటికి మబ్బు కమ్మి ఏవీ కానరావు. ప్రాతఃకాలమందున్న ఉత్సాహం నశించి నడక కుంటుబడుతుంది. అందుకే "దుర్దినాలు రాక మునుపే ... ఇప్పుడు వీటియందు నాకు సంతోషం లేదని నువ్వు చెప్పుకొనే రోజులు రాక మునుపే ... నీ బాల్య దినమునందు నీ సృష్టి, కర్తను స్మరణకు తెచ్చుకొను" మని మహాజ్ఞాని ఒకడు బైబిలు ద్వారా సెలవిస్తున్నాడు.

ఈనాడే మిక్కిలి అనుకూలమైన సమయం. మరి ఈనాడే మీ రక్షణ కొరకు రక్షకుడైన యేసుక్రీస్తును గూర్చి మీరెందుకు తెలుసుకొనకూడదు?

కదలబాత చంద్రమతీదేవి.



తన అభిప్రాయాన్ని తల్లికి, అక్కకి చెప్పి ఆ పది గంటల బండికే బయలుదేరింది.

"బావలకి కూడా ఉత్తరాలు రాసేము. వాళ్లూ ఈ పూట వస్తారేమో ... వాళ్లు వచ్చేదాకా ఉండి వెళ్లకూడదూ?" అంది అన్నపూర్ణ.

"ఇటువంటి విషయాల్లో బావలు చెయ్యగలిగింది ఏమీ ఉండదమ్మా. ఏమైనా చెయ్యబడితే మామయ్యే చెయ్యాలి. వెంటనే ఆయన సలహా తీసుకుని ఎలా చెయ్యమంటే అలా చేద్దాం. బావలు వస్తే మిగిలిన విషయాలను గురించి మీరు ఆలోచించండి" అంది శారద.

శారద ఆశించినట్లే రఘునాథరావు, మాలతి ఆమెకి ధైర్యం చెప్పి, "చెయ్యవలసింది ఏమిటో మేము చూస్తాము. నువ్వు నీ చదువు సంగతి చూసుకో" అన్నారు.

### 32

రఘునాధరావు స్వయంగా వెళ్లి రిమాండులో ఉన్న రామస్వామిని కలుసుకొన్నాడు. తగిన ప్లీడర్ని పెట్టి వాదింపిస్తానని, జామీను మీద అతన్ని విడిపిపుచ్చేలా చూస్తానని ధైర్యం చెప్పేడు.

"నాకోసం మీరు అనవసరంగా శ్రమపడకండి, బావగారూ! ఆ సొమ్ము నేను వాడుకొన్నాను. చేసిన నేరానికి శిక్ష అనుభవించక తప్పదు" అన్నాడు రామస్వామి.

రామస్వామి అటువంటి పని చేసేడంటే రఘునాథరావు నమ్మలేకపోయేడు. కోర్టుకి వెళ్లితే సొమ్ము ఖర్చు అవుతుందని, తమ కుటుంబం ఆ ఖర్చుని భరించే స్థితిలో లేదని అతడు అలా అని ఉంటాడు అనుకొన్నాడు.

"ఖర్చు విషయం మీ రేం ఆలోచించకండి. అవన్నీ నేను చూసుకొంటాను. మీరు చెయ్యవలసినదల్లా ప్లీడరుతో సహకరించి జరిగింది జరిగినట్లు, విషయాలన్నీ వివరంగా తెలియజెయ్యండి. మళ్లా నే వస్తాను" అని చెప్పి తిరిగి వచ్చేడు.

"నాన్న అటువంటి పని ఎన్నటికీ చెయ్యరు, మామయ్యా! హఠాత్తుగా మీద విరుచుకుపడ్డ ఈ ఆపదతో అతని మతి చలించి ఉంటుంది. లేక, ఇంకె వర్నో రక్షించడానికి ఈ నేరం తన మీద వేసుకొని ఉంటారు" అంది శారద.

రామస్వామి కేసు వాయిదాలు పడుతూ మూడు నాలుగు నెలలపాటు కింది కోర్టులో నడిచింది. రఘునాథరావు నియమించిన ప్లీడరు ఎంత గట్టివాడైనా, సాక్ష్యం అటువైపు బలంగా ఉండడంచేత, ఆ సొమ్ము తను వాడుకొన్నాడు — అన్న మాటకి మినహా ఇతరమైన వివరాలేమీ రామస్వామివల్ల తెలియకపోవడం వల్ల శిక్ష పడక తప్పలేదు.

ఈ మాట విన్న మాలతి—"హైకోర్టుకి అపీలు చేస్తేనో?" అంది.

"కావాలంటే చెయ్యచ్చు. కాని, నెగ్గుతామనే నమ్మకం నాకు లేదు, మాలతీ! నా అనుమానం ఏమిటంటే ఏ అవసరానికో ఆ సొమ్ము నిజంగా మీ అన్నయ్య వాడుకొని ఉంటాడు."

మామయ్య అత్తతో అన్న ఆ మాట వింది శారద. అందువల్లనే ఆటు తరవాత అతడు శారదకి ధైర్యం చెపుతూ—"ఇక్కడ ఓడిపోగానే అయిపోయిందా? హైకోర్టుకి అపీలు చెయ్యడానికి వీలుందేమో కనుక్కొందాం"

అంటే, "ఇంక అటువంటివేం పెట్టుకోకండి, మామయ్యా! గెలిచే అదృష్టమే ఉంటే ఇక్కడే గెలిచి ఉండేవారిమి ... ఇప్పటికే మీరు మాకోసం అన్నివిధాలా శ్రమపడ్డారు. కాలం కలిసిరావప్పుడు అన్నీ ఇలాగే తయారవుతాయి" అనేసింది విరక్తిగా.

మామగారికి శిక్ష పడింది అన్న విషయం తెలియగానే పెద్దల్లుడు అప్పారావు వచ్చి అన్నపూర్ణని, గోపిని తన ఇంటికి తీసుకుపోయేడు. ఆ ఏడు వారి భూములు బాగా పండేయి. ఇంట్లో పాడి, దొడ్లో కూరానారా ఉన్నాయి. తల్లీ, కొడుకూ ఇంత తిని ఇంట్లో పనిపాట్లు చేస్తుంటారు. వారికోసం తను పెద్దగా పెట్టవలసిన ఖర్చు ఉండదు. ఆపదలో ఆదుకొన్నాడు అన్న పేరు దక్కుతుంది.

ఏ మనసుతో చేసినా పెద్దబావ తల్లిని, తమ్ముడిని తీసుకు వెళ్ళడం శారదకి కొండంత బరువు దింపుకొన్నట్టు అయింది. ముందు సంగతి ఏమిటి అని ఆలోచించడానికి సందు దొరికింది.

అభిమానంతో అత్తయ్య తన చదువు ఆగిపోకుండా చూడగలదు. కాని, తల్లి, తమ్ముడు — వాళ్ళ మాటేమిటి? ఇప్పటి మట్టుకి అల్లుడి దగ్గరికి వెళ్ళినా, తల్లి ఎంతకాలం అక్కడ ఉండగలుగుతుంది? తాళి కట్టిన ఇల్లాలికే ఆ ఇంట గౌరవం, ఆదరం లేవు. ఇంక ఆమెని కన్న తల్లి కేముంటుంది?

ఈ శిక్షా కాలం గడిచి తండ్రి బయటపడ్డా, ఇటువంటి నేరం మీద జైలుకి వెళ్ళిన వాడికి తిరిగి ఉద్యోగం ఎవ రిస్తారు? అసలే అంతంత మాత్రంగా ఉన్న అతని ఆరోగ్యం ఆ జైలు జీవితం పాలబడ్డాక, తిరిగి కష్టపడి పనిచేసే శక్తిని అతడిలో మిగిల్చి ఉంచుతుందా?

రాత్రీ పగలూ ఆలోచించి చివరికి ఒక నిర్ణయానికి వచ్చింది శారద. ఇంక ఈ చదువుకి మంగళం పాడి, మామయ్య సహాయంతో ఏదైనా చిన్న ఉద్యోగం సంపాదించుకోవాలి. జాగ్రత్తగా ఖర్చు చేసుకొంటూ, మొదట ఊరిలో మిగిలి ఉన్న అప్పుల్ని చెల్లుపెట్టి, అమ్మని, తమ్ముడిని తెచ్చి కాపురం పెట్టాలి.

శారద ఆలోచన బాగానే ఉందనిపించింది మాలతికి. అభిమానంతో తను ఆదుకోవాలనుకొన్నా, వారింటి బాధ్యత అంతా భర్త నెత్తిమీద రుద్దడం న్యాయం కాదు. ఈ రోజు కాకుంటే రెండేళ్ళ పోయేకైనా శారద ఉద్యోగం చేసి ఆ ఇంటిని ఆదుకోవలసిందే. అదృష్టం బాగుండి ఉద్యోగం అంటూ దొరికితే పి. యు. సి. కి, బి. ఎ. కి ఈ రోజుల్లో పెద్ద తేడాలేం కనిపించడం లేదు. బి. ఎ. పాసైన ఎందరో నైట్ వాచర్లుగాను, కాఫీ హోటల్లో కౌంటరు ముందు కూర్చున్న వాళ్ళూ ఉంటున్నారు.

తన తరఫు వారి వల్ల భర్తకి ఆట్టే విసుగు పుట్టక మునుపే, అతడితో చెప్పి శారదకి ఒక ఉద్యోగం అంటూ వేయించ గలిగితే ఆ కుటుంబానికి తను చెయ్య గలిగింది చేసిందనే తృప్తి పడవచ్చు — అనుకొంది.

## 33

ఆశ నిరాశలు, కష్ట సుఖాలు కలిసి కట్టుగా తిరుగుతూ మనిషి జీవితాన్ని నడిపిస్తాయి. అనంత సుఖాలు అందుకొంటున్న మనుషుల జీవితాల్లో కూడా అణువంత వేదన ఏదో సమయాన ప్రత్యక్షం కాకుండా ఉండదు. అదేవిధంగా అష్టకష్టాల పాలవుతున్న వారి ప్రయత్నాల్లో

కూడా రవ్వంత ఆనందం ఏదో మూలన తొంగిచూడకుండా పోదు.

ఆ కష్టసమయంలో, జీవితపు బాటలో ఎంత దూరానికి దృష్టి సారించినా గోతులు, గతుకులే తప్ప సాఫీ అయిన దారి కనిపించని ఆ తరుణంలో, కూతురికి ఉద్యోగం అయింది అన్న విషయం అన్నపూర్ణకి నిధి నిక్షేపాలు కంటపడ్డట్లు అనిపించింది. కాని, దానితో పాటే అందుకొన్న ఇంకో వార్త ఆ ఆనందాన్ని సగం మింగి కూర్చుంది. రఘునాథ రావుకి బదిలీ అయిందనీ, వారంతా త్వరలోనే ఊరునుంచి వెళ్ళిపోతున్నారనీ ఆ సమాచారం.

వీళ్ళు వెళ్ళిపోతే శారద ఎక్కడ ఉంటుంది? ఒంటరిగా ఆడపిల్లని పట్నంలో ఉంచడం ఎలా? అంతా అక్కడ ఉండాలంటే వస్తున్న ఆ సొమ్ము సరిపోతుందా? వస్తున్నదంతా తిని కూర్చుంటే ఇంక అప్పులు తీరడం ఎలా? ఇలా ఆరాటపడుతున్న అన్నపూర్ణకి కాంతమ్మ ఒక సలహా చెప్పింది.

"మా వేలువిడిచిన పెత్తల్లి ఒకావిడ ఆ ఊళ్ళో ఉంటున్నాది. వాళ్ళింట్లో కాని ఒక గది దొరుకుతుందేమో — అబ్బాయిచేత ఉత్తరం రాయిద్దాం. ఆవిడ సరే అంటే నీ కూతురు నీ ఇంట్లో ఉన్నంత క్షేమం" అంది.

ఆ వేలు విడిచిన పెత్తల్లి పేరు తాయారమ్మ. ఆవిడ కొడుకు రైల్వేలో పని చేస్తున్నాడు. అతడికి ఆరుగురు పిల్లలు. తన ఉద్యోగంలో బదిలీల మూలంగా పిల్లల చదువులు పాడవుతాయని తల్లిని, విధవ అప్పచెల్లెలు చెల్లాయమ్మని ఆ ఊళ్ళో కాపురం పెట్టి, అక్కడ స్కూళ్ళలో పిల్లల్ని చేర్పించేడు.

ఆ ఏడు పెద్దవాళ్ళిద్దరి చదువులు పూర్తయి ఉద్యోగాల్లో చేరేరు. పెద్ద కూతురికి స్కూలుఫైనలు పాసు కాగానే పెళ్ళి చేసి అత్తవారి ఇంటికి అంపకం పెట్టేరు. ఇంక మిగిలింది ఇద్దరు మగ పిల్లలు, కడపిరవు ఆడపిల్ల.

ఇద్దరు బోడెమ్మల అధికారం కింద ఆ ఇంట్లో ఉండడం అంత సుఖమైన పని కాదని శారదకి తెలుసు. కాని అంతకు మించి అప్పుడు వేరే మార్గం కనిపించలేదు.

అరవింద పోన్నలుకి, శారద తాయారమ్మగారి ఇంటికి ఒకే రోజున బయలుదేరి వెళ్ళేరు. మరుచటి రోజునే మాలతిగారి సంసారం అంతా ఆ ఊరినుంచి వెళ్ళిపోయేరు.

రాజసౌధం లాంటి అత్తగారి ఇంట మసిలి వచ్చిన శారదకి తాయారమ్మగారి ఆ వీధి గది ఎలక కన్నంలా కనిపించింది. దానికి తోడు ఆ చిన్న మనుమరాలు రాత్రి పొడుక్కీ దేనికోదానికి ఆరున్నొక్క రాగం పాడుతుండేది. ఆ పిల్లని ఊరుకో పెట్టడానికి ఆ తల్లీ కూతుళ్ళు బోదురు కప్పల్లా నోళ్ళు పెట్టుకొని తల్లిని కూతురూ, కూతుర్ని తల్లీ కోప్పడుకొంటూ — అదంతా అదో నాటకం. అత్త, నాన్నమ్మ ఆడుతున్న ఆ నాటకం ఆ చిన్నదానికి తెలుసు. అయినా, అంతా శాస్త్రోక్తంగా జరగందే నోరు మూసేది కాదు.

మగపిల్లలిద్దరూ మప్పితమైన వారే. తమ చదువేమో, తామేమో అన్నట్లు ఉండేవారు. పెద్దవాడి పేరు రాముడు. చిన్నవాడి పేరు భీముడు. భీముడు సన్నగా వల్లికి వరంలా ఉండేవాడు. రాముడు గుండుగా ఉండి బాబూ ఈ వయసులోనే ఇలా ఉన్నాడు పెద్దవాడైతే ఎలా తయారవుతాడో అని అనిపించేలా ఉంటాడు.

శారద ఆ ఇంట్లో కాలు పెట్టగానే శారదక్కా అంటూ వరస కలిపేసేరు మగ పిల్లలు. తమ కేమైనా పాఠాలు తెలియకపోతే శారదని అడగవచ్చని ఆమె తమ ఇంట్లో చేరడం వారికి సంతోషంగానే ఉంది. ఆడపిల్ల 'చిట్టి' మాత్రం శారద ఎప్పుడు కనిపించినా, "మా ఇంటి కెందు కొచ్చేవు ... పో" అనేది. ఆ పిల్ల అలా అంటూంటే 'తప్పమ్మా' అని అత్తకాని, నాన్నమ్మకాని మందలించేవారు కాదు. "పోతుందిలే, అమ్మా ... పోతుంది" అనేవారు.

ఆ పిల్ల మాటల్ని కాని, పెద్దవారి ధోరణిని కాని శారద పట్టించుకోలేదు అక్కడ తన ఉనికి—ఎంతవరకు కావాలో అంతవరకే వారితో సంబంధం పెట్టుకోవడం చాలా అవసరమని అక్కడికి వచ్చిన మొదటి రోజునే నిర్ణయించుకొంది. అంతకుమించి బంధుత్వాలకి పోతే, వేలు చూపితే మండ మింగే రకంలా ఉన్నారు ఆ తల్లీ కూతుళ్ళు. అనవసరమైన చొరవ చేసుకొని తనపై అధికారం చెలాయించడం మొదలు పెట్టచ్చు.

ఆ ఇంట్లో వీధి నడవని ఆనుకొని ఒక చిన్న గది ఉంది. అంతకు పూర్వం తాయారమ్మ కూతురు చెల్లాయమ్మకి నెలనెల అవసరాలకి అది ఉపయోగపడుతుండేది. ప్రస్తుతం ఆవిడికి ఆ కొడద తీరిపోబట్టి అది ఖాళీగా ఉండి, శారదకి వాసంగా దొరికింది. ఆ కొట్టు గదికి వీధి వరండాలోకి, నడవాఇంట్లోకి రెండు గుమ్మాలు ఉండేవి. నడవలోకి ఉండే గుమ్మాన్ని చాలావరకు మూసే ఉంచేది శారద.

"అమ్మడూ! బయటికి వెళ్ళేముందు ఇటునుంచి తాళం వేసుకుని వెళ్ళు. అటునుంచి ఎవరైన కన్ను పగలగొట్టి ఇంట్లో దూరినా తెలియకుండా పోతుంది" అనేది తాయారమ్మ.

"నా గదిలో ఎవరు జొరబడి ఏం ఎత్తుకు పోతారు లెండి" అనేసేది శారద. తాయారమ్మ అలా చెప్పడంలో అభిప్రాయం శారద రాకపోకల మీద ఒక కన్నేసి ఉంచవచ్చని. శారద జవాబుకి కూడా అదే కారణం — తన స్వేచ్ఛకి ఈ ముసలి వాళ్ళు ముళ్ళు వెయ్యకుండా జాగ్రత్త పడాలని.

వారానికి రెండు, మూడు సార్లయినా సాయంకాలం పూట వచ్చి వెళ్ళేది అరవింద. ఎప్పుడైనా రాజేందర్ కూడా ఆమెతో వచ్చేవాడు. అరవింద ఒంటరిగా వచ్చినప్పుడు ఒక్కొక్కసారి ఆ రాత్రికి శారద గదిలో ఉండిపోయేది.

"ఆ హాస్టలు తిండి తినలేక చస్తున్నాను. ఏం చేసినా పెట్టు" అంటూ పీట వాల్చుకొని కూర్చునేది.

"ఈ తిండి నువ్వేం తింటావు? పద, అలా బయటికి పోయి ఏ హోటల్లో అయినా తిని వద్దాం" అనేది శారద. ఎప్పుడో ఉదయమనగా వండుకుపోయిన అన్నం, కూర — ఆ చల్లారిన తిండి అరవింద కేం పెడుతుంది?

"పెట్టాలని ఇష్టం లేకపోతే ఆ మాట చెప్పరాదూ... ఈ కబుర్లన్నీ దేనికి?" మూతి ముడిచేది అరవింద.

ఇద్దరూ కబుర్లు చెప్పుకొంటూ ఆ ఉన్న తిండినే పంచుకొని తిని, రాత్రి ఒకే పక్క మీద రాసుకు, తోసుకు అలా పడుకొంటే, అరవింద తన తోడపుట్టిన వాళ్ళకన్నా ఎంతో ఆత్మీయంగా, సన్నిహితంగా కనిపించేది శారదకి.

వారానికో, పది రోజులకో ఒక రాత్రి శారదతో సరదాగా గడపాలని అరవింద అలా ఉండిపోయినా తెల్లవారేసరికి పక్క అమరక "అమ్మా ... అబ్బా ..." అంటూ నడుం రాసుకుంటూ లేచేది.

"నే చెప్పేనా ... తల్లీ! నీ రూమ్‌కి వెళ్ళిపోయి పడుకోవే అని ... ఇదేం స్ప్రింగ్ కాట్, ఫోమ్ రబ్బరు పరుపులు అనుకొన్నావా ... ఎంచక్కా దొర్లడానికి... నా మాట వినకుండా మొండికేసినందుకు అమ్మగారికి కావలసిందే" అనేది శారద.

"మంచానికీ, పక్కకీ ఏమొచ్చింది తెగులు ... హాయిగా మహారాజావారి హంసతూలికాతల్పంలా ఉన్నాది. నీ కీ మధ్య సోమరితనం బాగా బలిసిపోయి నెల కోసారేనా పట్టెడ బిగించక ... రా, నే సాయం చేస్తాను. ఒక్క నిమిషంలో బిగించి పారేద్దాం."

"నువ్వు పని మొదలు పెడితే పట్టెడ బిగియడం మాటేమో కాని, మంచమే విరిగి ఊరుకోగలదు. వద్దులే...రేపు నే చూసుకొంటాను" అని లేవగొట్టేది. శారద.

అనిల్ సాయంకాలం కాలేజీనుంచి నేరుగా శారద ఆఫీసుకి వచ్చేవాడు. ఇద్దరూ కలిసి అలా బజారులోనో, పార్కులోనో కాస్త సేపు తిరిగి ఎవరి గూళ్ళకి వారు చేరుకొనే వారు.

ఒక రోజు కడుపులో బాగులేదని ఆఫీసుకి సెలవు పెట్టింది శారద. ఆమెని వెతుక్కుంటూ ఇంటికి వచ్చేడు అనిల్.

"ఇదేమిటి ఇలా దిగబడ్డారు!" అంది శారద, మంచం మీంచి లేచి అతడు కూర్చోవడానికి చోటు చేస్తూ.

"ఏం, రాకూడదా?"

"రాకూడదని ఎవరన్నారు?"

"అనలేదు కాబట్టే వచ్చేశాను. ఆఫీసుకి వెళితే సెలవు పెట్టే వన్నారు. మంచో చెడ్డో కనుక్కో వద్దా మరి?"

"చాలా మంచి పని చేశారు లెండి. నాకు మరో కప్పు కాఫీ దండుక్కి." లేచి కాఫీకి ప్రయత్నంగా స్టౌ వెలిగిస్తూ అంది శారద.

"మిమ్మల్ని చూసిపోవడానికి వచ్చేను కాని ... నా కిప్పు డేం అక్కర్లేదు. లేచి రండి."

"మీకు అక్కరలేకపోయినా నాకు కావాలి. ఈ ఉదయం మంచి నోట్లో నీళ్ళు కూడా పొయ్యలేదు."

"అరె ... నిజంగా! ఏమిటి చికాకు ... మందేమైనా వేసుకొన్నారా? ఆఫీసుకి సెలవు పెట్టేరు అంటే ఏదో ఇబ్బందిగా ఉండి పోలేదేమో అనుకొన్నా. నిజంగా

ఒంట్లో బాగులేదని తెలియదు ... మీరు లేవండి. ఓ గిన్నె, చెంబో ఇస్తే ఆ పక్క హోటల్లోంచి కాఫీ పట్టుకొస్తాను."

"మా శిష్యుడానికి నా దగ్గర గిన్నెలు, చెంబులు లేవుగా. మీ రలా మాట్లాడకుండా బుద్ధిగా రెండు నిమిషాలు కూర్చోండి. ఈ కాఫీ నోట్లో పోసుకున్నాక మిగిలిన విషయాలన్నీ అప్పుడు చెప్పుకొందాం" అంది శారద.

చతురస్రాకారంగా ఉన్న ఆ గదే శారదకి డ్రాయింగ్ రూమ్, బెడ్ రూమ్, డైనింగ్ రూమ్, డ్రెస్సింగ్ రూమ్, కిచెన్, స్టోర్‌రూమ్—అన్నీను. ఓ పక్క మంచం, బట్టల పెట్టె, ఇంకో వంక వంట సామాన్లు, మరో వైపు బట్టల స్టాండు, అద్దం, పన్నె వగైరా ... మధ్యలో కాస్త జాగా మిగిలితే అక్కడే పీట వాల్చుకొని భోజనం ముగిస్తుంది.

అరవింద, అనిల్, రాజేందర్ — ఎవరొచ్చినా ఆ మంచం మీద కూర్చోవలసిందే. లేకపోతే గుమ్మంలో నిలిచి అక్కడి నుండి అలా వెళ్లిపోవలసిందే.

అనిల్, శారద కాఫీ తాగుతుంటే, అప్పుడే ఏకాదశి ఫలహారం చేసిన తాయారమ్మగారు ఆపసోపాలు పడుతూ అరుగుమీద విశ్రమించడానికి వచ్చింది. శారద గదిలోంచి ఏవో మాటలు వినిపిస్తుంటే ఎవరా అన్నట్లు ఓ సారి తొంగి చూసింది.

అనిల్‌తో మాటల్లో పడ్డ శారద పొద్దుపోయిన విషయం గమనించలేదు. లేచి దీపం వెలిగించాలనే తలపు మనసులోకి రాలేదు. గదిలో వెలుగు అంతంత మాత్రంగా ఉంది. తాయారమ్మగారి కనుదృష్టి కూడా దానికి సమ ఉజ్జీలో ఉంది. శారద గదిలో ఉన్నది ఎవరు — ఆడా, మగా అన్న అనుమానంతో గోడ దగ్గరగా చెవులుంచి మాటలు వినడానికి ప్రయత్నించింది. ఆ చెవులు కూడా ఆమెకి ఆ కార్యాచరణలో సహాయపడ్డం మానేసేయి. గదిలో ఉన్నది ఎవరో తెలిసిరాక, మామ్మగారికి గొంతులో వచ్చిపెండి చలిమిడి మింగుడు పడక అడ్డుకొన్నట్లు అయింది. ఇంక తప్పదని మెల్లగా వడ్డి ఈడ్చుకొంటూ లోపలికి పోయి, "చెల్లాయీ! శారద గదిలో ఎవరే" అని కూతుర్ని ప్రశ్నించింది.

"వాళ్లత్త కూతురు వచ్చిందేమో" అంది చెల్లాయమ్మ.

"ఓసారి పోయి చూసి రా ... మగాడి మాటల్లా వినిపిస్తున్నాయి."

తలమీది కొంగు సరిచేసుకొంటూ, శారద గదిలో ఉన్నది ఎవరో తెల్సుకోవడానికి బయలుదేరింది చెల్లాయమ్మ. మొదట సరాసరి తలుపు తోసి, గదిలోకి పోయి చూసిరావాలనే అనుకొంది. కాని, గుమ్మం దగ్గిరికి వచ్చేసరికి కొత్త గొంతుక వినిపించి ఆమెని ఆ పనినించి వారించింది. ఓరవాకిలిగా వేసి ఉన్న తలుపు సందులోంచి తొంగి చూసింది. చెల్లాయమ్మ కళ్లు తల్లి కళ్లలా మసకలుబారి పోలేదు. అందునా ఇటువంటి పనులు చేసేటప్పుడు ఇంకా కాంతిని తెచ్చుకొంటాయి.

అనిల్ మంచం మీద కొద్దిగా వంగి కూర్చున్నాడు. శారద పక్కగా ఉన్న పెట్టె మీద కూర్చుంది. ఏదో మాటలు చెప్పుకొని ఇద్దరూ నవ్వుకొంటున్నారు.

వాళ్లిద్దర్నీ అలా చూస్తే చెల్లాయమ్మకి ముచ్చట వేసింది. చెల్లాయమ్మ తల్లి అంత అనాగరికురాలు

కాదు. ఆమె ఊళ్ళోకి వచ్చిన సినిమాలన్నీ చూస్తుంది. అవకాశం అయితే రెండేసి సార్లు కూడా చూస్తుంది. కనీసం ఒక్కసారైనా ఆమె చూడకుండా ఏ సినిమా కూడా ఆ పట్నం నుంచి వెళ్ళిపోవడానికి వీలులేదు. చిన్నప్పుడు వీధి బడిలో నేర్చుకొన్న అక్షరాల్ని గుర్తు చేసుకొంటూ పత్రికల్లో కథలు, నవలలు ఒకటికూడా వదలకుండా చదువుతుంది.

కథల్లోను, సినిమాల్లోను అమ్మాయిలు, అబ్బాయిలు ప్రేమించుకోవడం, పెళ్ళిచేసుకోవడం, తోటలంటూ, పార్కులంటూ పక్షుల్లా ఆడుతూ, పాడుతూ తిరగడం — ఇటువంటి సన్నివేశాలంటే ఆమెకి ఎంతో ఇష్టం. తనూ ఈ రోజుల్లో పుట్టి ఉంటే హాయిగా అలా ఎవర్నో ఒకర్ని ప్రేమించేసి, ఆడుతూ పాడుతూ కాలం గడిపి ఉండేది. తన కర్మం కాలి, ఏభై ఏళ్ళ ముందు పుట్టబట్టి, అలా ఆ పల్లెటూళ్ళో అఘోరించబట్టి, పదిహేనేళ్ళు నిండకుండా ముండమోసి, మొరడులా ఇలా ఉండిపోయింది.

చెల్లాయమ్మ జీవితంలో ఇదొక తీరని కోరిక. నోరు విడిచి పైకి చెప్పుకొనేందుకైనా వీలుకాని కోరిక. ఇటువంటి విషయాలు తల్లి దగ్గర అంటే చంపేస్తుంది. నీ బుర్ర గొరిగించినా నీ బుద్ధులు మారలేదే— అని తిట్టిపోస్తుంది.

చెల్లాయమ్మ మొగుడు పోయిన కొత్తలో, ఇంకా బుర్ర గొరిగించక పూర్వం ఆ ఊరి నాయుడు కొడుకుతో కొంత గ్రంథం నడిపింది. ఒక రోజు అది కాస్తా తల్లి కంట పడేసరికి, కొట్లో పడేసి తాళం పెట్టి వారం రోజులు తిండి పెట్టకుండా మాడ్చింది. తిరిగి సైనుపంచ కట్టేకే చెల్లాయమ్మ వీధి గుమ్మం చూసింది.

ఈనాటికీ చెల్లాయమ్మ మనసులో ఆ అనుభవం పచ్చిగానే ఉంది. అందుకే శారదని, అనిల్‌ని చూసి తల్లిలా కళ్ళు పత్తికాయలు చేసుకోలేదు. వయసులో ఉన్న పిల్లలు ఇటువంటి సరదాలు ఇప్పుడు కాకపోతే ఎప్పుడు అనుభవిస్తారు — అనుకొంది.

చెల్లాయమ్మ తన ఆలోచనల్లో తాను మునిగిపోయి అసలు వచ్చిన పనే మరిచిపోయింది. కూతురు ఎంతకీ తిరిగి రాకపోవడం చూసి, తాయారమ్మ ఏమిటా వంగతి—అనుకొంటూ మళ్ళీ వీధి గుమ్మంలోకి వచ్చింది.

అనిల్ తలుపు తీసుకు రావడం చూసి తల్లీ కూతుళ్ళు పక్కకి తప్పుకున్నారు. శారద గుమ్మం దిగి నాలుగు అడుగులు వేసి అనిల్‌ని అంపకం పెట్టి తిరిగి వచ్చింది.

శారద గదిలోంచి అనిల్ అలా తలుపు తీసుకొని బయటికి రాగానే ఆశ్చర్యంతో తెరుచుకొన్న ఆ తల్లీ కూతుళ్ల నోళ్ళు శారద తిరిగి వచ్చేవరకు మూత పడలేదు. చెల్లాయమ్మ ఆశ్చర్యానికి కారణం అనిల్ అందమైతే, తాయారమ్మ ఆశ్చర్యానికి కారణం శారద తెగింపు.

ఎక్కడో ఆఫీసుల్లో, కాలేజీల్లో ఆడపిల్లలు, మగపిల్లలు కలిసి తిరిగేరంటే అదో దారి. ఆ స్థలాలు, ఆ అవసరాలు అలాటివి. పోనీ అని సర్దుకు పోవచ్చు. కాని, ఇలా తిన్నగా ఇంటికే పిలుచుకొచ్చి గదిలో కూర్చోపెట్టుకోవడం ... ఏం కలికాలం?

శారద ఆ గదిలోకి వచ్చేక అనిల్‌కుమార్ అంతకు పూర్వం రెండు, మూడు సార్లు వచ్చి ఉన్నాడు. కాని ఆ సమయాల్లో తాయారమ్మ పురాణానికి, చెల్లాయమ్మ సినిమాకి వెళ్ళి ఉండడం వల్ల అతడు రావడం వాళ్ళ కంట పడలేదు.

శారద గుమ్మంలో అడుగు పెడుతుంటే — "ఎవరేమిటి ఆ కుర్రాడు" అని అడిగింది తాయారమ్మ. "మన శాఖవాడేనా?" ప్రశ్నించింది చెల్లాయమ్మ.

తల్లీ కూతుళ్ళు ఇద్దరూ ఆకులు రాలిన మొద్దుల్లా అలా గుమ్మంలో నిలిచి తన్ను నిలదీసి అడుగుతుంటే శారదకి చిర్రెత్తుకొచ్చింది. అలా గుచ్చి గుచ్చి అడగడంలో ఉన్న అంతరార్థం ఏమిటో గ్రహించింది.

వాళ్ళకి కొరడా దెబ్బలా తగలాలని — "మన తెలుగు వాడు కాడు, మామ్మగారూ. ఆయన బెంగాలీ వాడు" అంది. ఆ కాస్త మాట వాళ్ళ ముఖాన కొట్టి ఇంక మీ చావులు మీరు చావండి అన్నట్లు గదిలోకి వెళ్ళిపోయి తలుపు గడియ వేసుకొంది.

(సశేషం)

# కొత్త పుస్తకాలు

## శ్రీరామావతారము-అయోధ్యా కాండ

[శ్రీ వేంకటేశ్వర జ్యోతిష గ్రంథమాల 15 వ కుసుమం. గ్రంథకర్త: శ్రీ దివాకరుని వేంకట సుబ్బారావు. ప్రతులకు: శ్రీ వేంకటేశ్వర జ్యోతిష గ్రంథమాల, 7, చక్రపాణి వీధి, వెస్టు మాంబళం, మద్రాసు—33. క్రౌన్ 8+158 పుటలు. వెల: రు. 5—00.]

దైవజ్ఞరత్న, విద్యావిశారద బిరుదాంచితులు, సుప్రసిద్ధ జ్యోతిర్విద్యావిదులు అయిన రచయిత శ్రీ వేంకటేశ్వర జ్యోతిష గ్రంథమాలను స్థాపించి దాని ద్వారా స్వరచితాలయిన గ్రంథాల నెన్నింటినో ప్రకటిస్తున్నారు. ఆ గ్రంథమాలలో జ్యోతిష గ్రంథాలే కాకుండా రామాయణం వంటి ఉద్గ్రంథాలలోని విశేషాలను వివరించే పరిశీలన గ్రంథాలనుకూడా ప్రకటిస్తూ ఉన్నారు. సామాన్యులకే కాకుండా విద్వాంసులకుకూడా తెలియని పెక్కు విషయాలు సప్రమాణంగా వాటిలో వివరించబడుతూ ఉన్నవి. ఇదివరలో సీత, హనుమలను గురించిన ప్రత్యేక గ్రంథాలు— జ్యోతిర్విషయాలను జోడిస్తూ రచించబడినవి. తరవాత రామాయణంలోని బాలకాండలోని విశేషాలను గూర్చిన గ్రంథం ప్రకటించబడింది. ఇది అయోధ్యా కాండను గురించిన గ్రంథం.

రామాయణం అయోధ్యా కాండలోని కథ యావత్తూ ఇందులో అభిషేకప్రయత్నం, నారదుడు, నిర్ణయం, ధర్మసూక్ష్మాలు (2 భాగాలు), మంధర, రెండు వరాలు, రాముని ధర్మబోధ, పతివ్రత, భరతుడు, భరతగుహుల సమావేశం, చిత్రకూటం, పాదుకాపట్టాభిషేకం, దండకారణ్య ప్రవేశం అనే పన్నెండు శీర్షికలలో విశేష విషయాలతో చెప్పబడి ఉన్నది. అనుబంధంలలో రాజ్యార్హుని యోగ్యతలు, ప్రజారంజకుని లక్షణాలు, పతివ్రతా ధర్మాలు, రాజధర్మాలు, అరాజక లక్షణాలు, దోషకృత్యాలు, సహగమనం, చర్చించబడినవి. రామాయణంలోని పాత్రల విశిష్టత— ప్రత్యేకంగా శ్రీరాముడు, భరతుడు, కైక, కౌసల్య, సుమిత్ర, దశరథుడు, సుమంత్రుడు అనే ప్రధాన పాత్రల శీలం వివరించబడింది. కొన్ని ముహూర్తాది విషయాలున్నూ తెలుపబడినవి. అయోధ్యా కాండ విశిష్టతను తెలుసుకొనుటకు ఈ గ్రంథం ఎంతో ఉపయోగకరమై ఉంటున్నది.

శ్రీ వేంకటసుబ్బారావుగారు ఈ గ్రంథాన్ని వెనకటి గ్రంథాలవలె పెద్ద టైపులో ముద్రింపించక చిన్న టైపులోనే ముద్రింపించారు. తక్కువ పుటలలో ఎక్కువ విషయాన్ని ఇవ్వగోరడమే దీనికి కారణం కావచ్చు. ఇలా చిన్న అక్షరాలలో కూర్చడం వల్ల ముద్రణ స్ఖాలిత్యాలు ఎక్కువ దొర్లడానికి అవకాశం ఉన్నది. ఇందులో తప్పులు ఎక్కువగా పడ్డాయి. భరతుడికి భారతుడనే కొన్ని చోట్ల పడింది. అలాంటివే మరికొన్ని. అయినా పాఠకులు వాటిని సులభంగా సరిచేసుకోగలరు.

అయోధ్యా కాండ సారాన్ని గ్రహింపగోరువారు ఈ గ్రంథాన్ని పఠిస్తే చాలును.

## సైరన్

[వివిధ రచయితల కవితా సంకలనం. ప్రచురణ: యువరచయితల సమితి, డి. నం. 187/69, నల్లగొండ. డెమ్మీ. 78 పేజీలు. వెల: రు. 1-50.]

ఇప్పటి నవ్యకవుల్లో నూటికి తొంభైకి పైగా దేశంలోని దుస్థితికి వాపోయేవారే! నేటి ఈ సమాజంలో దరిద్రం, అజ్ఞానం, అన్యాయం ఉన్నాయనీ, పేదప్రజలను నిత్యం దోపిడి చేస్తున్న వాళ్ళున్నారనీ, కుల మత మౌఢ్యాలను రెచ్చగొట్టే రాజకీయాలు, మూఢవిశ్వాసాలు, చిత్తకార్తె చెత్తసాహిత్యంతో యువతరాన్ని నిర్వీర్యం చేస్తున్న పత్రికలు, సినిమాలు సామాన్య మానవుని ఆలోచనలను అరికట్టి వేస్తున్నాయనీ వారు బాధపడుతున్నారు. మానవుడు తన అధోగతికి కారణాలను తెలుసుకోలేకపోతూ ఉండడంవల్ల చెవులు గింగురుమనేటట్లు లోకం దురన్యాయాలను ఈ 'సైరన్' మూలంగా తెలుపుతూ బహుపరాక్ చెపుతున్నారు ఈ యువ రచయితలు!

నవసమాజ నిర్మాణానికీ, దేశక్షేమానికీ రక్తం చిందించడమే ప్రతి వ్యక్తికీ లక్ష్యమై ఉండాలని ఈ రచయితల ఆశయం. అయితే, రక్తం చిందించడం మూలంగానే దేశానికి క్షేమం కలుగుతుం దనుకోవడం సరైనదో, కాదో నిర్ణయించే వా రెవరు?

నలభైకి పయిగా ఉన్న ఇందలి కవితలు 'పాత చింతకాయపచ్చడి'తో ప్రారంభమై 'రాజకీయ పాఠా'లతో పూర్తి అవుతున్నవి. కొన్ని విన్నవాన్ని ప్రోత్సహించేవి

కొన్ని కుళ్ళు, వెళ్ళగక్కేవి. కొన్ని అధిక్షేపించేవి; కొన్ని పెద్దరికం లేని పెద్ద మనుష్యులను దుయ్యబట్టేవి. వినడానికి ఇష్టం లేకపోయినా, 'సైరన్'గా ఉండడం వల్ల వినపడక తప్పవు.

ఇప్పట్లో విరివిగా వెలువడుతున్న నవ్యకవితా ప్రచురణలలో— విప్లవాత్మక రచనలలో-'సైరన్' తగిన స్థానాన్నే ఆక్రమించుకోగలదు.

## జీవనాడి

[ నవకవితా సంకలనం. రచన: శ్రీ వరవరరావు. ప్రకాశకులు: ఎమ్. శేషాచలం అండ్ కో., 14, సుంకురామశెట్టివీథి, మద్రాసు—1. 71 పేజీలు. వెల: రు. 2—00. ]

నవయుగ కవులలో పేరు గడించినవారూ, యువ కవులకు మార్గదర్శకులూ శ్రీ వరవరరావుగారు. ఆయన 'సాహితీమిత్రుడుగా, 'సృజన సంపాదకుడుగా' చలిచెగళ్ళు రగిల్చిన సమాజ ప్రగతివాది కవిగా' పేరు తెచ్చుకుని తమ పత్రిక మూలంగా చాలామంది తమ వంటివారిని తయారుచేశారు. 1965 నుంచి 1969 నడుమ అయిదేండ్లలో తాము కూర్చిన కవితలను 'జీవనాడి'గా జీవలోకానికి అందిస్తున్నారు. ఇందులో ఉన్న 33 కవితల్లో జాతి జీవనాడిని పట్టి చూపినట్లు రచయిత భావిస్తున్నారు.

స్వచ్ఛంద కవులలో సామాజిక ప్రగతి వాదానికి ప్రతినిధీ, ప్రబోధకుడూ అనదగిన వారీ రచయిత. దుర్భరదాస్యదారిద్ర్యాలలో బాధపడుతూఉన్నసమాజంలో సమతా సౌజన్యాలను నెలకొల్పి, దాన్ని సుఖింపజేయడం ఈయన లక్ష్యం. ఆ లక్ష్యాన్ని సాధించడానికి ఈ కవిత పరమ సాధనంగా గ్రహించబడింది. ఇందులో అత్యున్నతాధికారులు మొదలుకొని అతి సామాన్యుడివరకూ విమర్శించబడి ఉన్నారు. నమ్మకాలూ అవీ తీవ్ర విమర్శనకు గురి అయ్యాయి. కొన్నిచోట్ల ఇంగ్లీషు మాటలు స్వేచ్ఛగా వాడబడినవి. అవి అందరికీ అర్థం కావడం కష్టం. అనేకాదు, ఇందులోని కొన్ని గీతాల లోతుపాతులను, అట్టి కవిత్వానుభవం ఉన్నవారు తప్ప ఇతరులు అర్థం చేసుకోవడం కష్టం.

ఇందులోని గీతాలు ఇదివరలో పత్రికలలో పడినవే! అయినా వాటిని గ్రంథరూపంగా సంకలనం చేస్తే కవితావేశాన్నీ, సందేశాన్నీ, కావ్యహృదయాన్నీ అవగాహన చేసుకొనుటకు వీలుంటుందని ఈ 'జీవనాడి' వెలువడింది.

నవ్యకవితా రీతుల్ని అభిమానించేవారి ఆమోదం దీనికి తప్పక లభిస్తుందని నా ఆశ.

—ఆయాస్య

## స్వీకారం

బాలల బొమ్మల భారతము రచన: శ్రీ రావూరి దొరస్వామి శర్మ. ప్రచురణ: బాలసరస్వతి బుక్ డిపో, 6, సుంకురామచెట్టి వీథి, మద్రాసు—1. వెల: రు: 3—50. ★

Printed and Published on behalf of Andhra Prabha Private Ltd., by M. KRISHNASWAMI B.A., B.L. at the Dinamani Press, Express Estates, Madras-2. Editor: P. NAGESWARARAO.